# అద్భుత చరిత్ర



"అమ్మ సేవ యొకటె ఆనందతీరమ్ము
అమ్మ నామ మదియె అక్షరమ్ము
అమ్మ పాదయుగళి అవనిలో స్వర్గమ్ము
అమ్మ దివ్యచరిత అద్భుతమ్ము" - మల్లాప్రగడ

## మల్లాప్రగడ శ్రీవల్లి

ప్రథమ ముద్రణ : 07, ఏప్రిల్ 2011

ప్రతులు : 1000



వెల : **రూ. 60/-**

ప్రతులకు

**డా॥ఎం.శ్రీవల్లి**, 302, శ్రీసాయిసౌధ,

శ్రీ వెంకటేశ్వర కల్యాణ మంటపం వెనుక

ఎన్.టి.ఆర్. స్టేడియం వద్ద, కృష్ణనగర్, గుంటూరు - 522 007

ఫోన్ : 08106194735; 08106196418

**శ్రీ విశ్వజననీపరిషత్**

**జిల్లెళ్ళమూడి - 522 113, బాపట్ల మండలం,**

**గుంటూరు జిల్లా. (ఆం.ప్ర.) - ఇండియా**

**ఫోన్ : 08643-227324; 227429**

డి.టి.పి. : క్రియేషన్ గ్రాఫిక్స్,
**5/4,** అరండల్‌పేట
గుంటూరు. ఫోన్: 2250885

ముద్రణ : **లక్ష్మీగణపతి ఆర్ట్‌ప్రింటర్స్,**
2/4, బ్రాడీపేట,
గుంటూరు. ఫోన్: 2235036

# సమర్పణము



'అమ్మ' శ్రీ చరణాలకు భక్తితో.....

- శ్రీవల్లి

# విషయసూచిక

1. స్వగతం vi
2. ఆశీర్వాద శ్రీముఖము xi
3. భక్తి సుమవల్లి xii
4. అనుబంధం xxiii
5. అక్షరార్చన xx
6. స్వరూప లలిత xxiii
7. స్వభావ మధుర xxx
8. మాతృదేవోభవ ! xxxiv
9. అమ్మా! xxxvi

1. సర్వాధారా 3
2. నిరాధారా 9
3. ధర్మాధారా 11
4. గోమాతా 14
5. ఆబ్రహ్మకీటజననీ 17
6. ప్రేమరూపా 19
7. ప్రియంకరీ 24
8. సాధ్వీ 28
9. స్వభావమధురా 32
10. నామపారాయణప్రీతా 35
11. కావ్యాలాపవినోదినీ 38

| | | |
|---|---|---|
| 12. | అన్నదా | 41 |
| 13. | ప్రాణదాత్రీ | 44 |
| 14. | ముక్తిదా | 46 |
| 15. | నిర్వాణసుఖదాయినీ | 49 |
| 16. | అనర్ఘ్య కైవల్యపదదాయినీ | 52 |
| 17. | వాంఛితార్థప్రదాయినీ | 56 |
| 18. | పుణ్యాపుణ్యఫలప్రదా | 58 |
| 19. | సద్గతి ప్రదా | 60 |
| 20. | అవ్యాజకరుణామూర్తిః | 63 |
| 21. | సర్వవ్యాధి ప్రశమనీ | 70 |
| 22. | సర్వమృత్యు నివారిణీ | 74 |
| 23. | నిర్భేదా, భేదనాశినీ | 77 |
| 24. | నిర్ద్వైతా, ద్వైతవర్జితా | 80 |
| 25. | విశ్వసాక్షిణీ | 83 |
| 26. | నిస్సీమ మహిమా | 89 |
| 27. | అద్భుతచారిత్రా | 92 |




# స్వాగతం

జన్మనిచ్చిన తల్లిదండ్రులు కీ॥శే॥శ్రీమతి ప్రభావతి, డా॥ నారపరాజు శ్రీధరరావు గార్లకు భక్తితో నమస్కరిస్తున్నాను.

మా నాన్నగారు నాకు జన్మతో పాటు సాహిత్య, ఆధ్యాత్మిక సంస్కారాన్ని అనుగ్రహించిన గురువు కూడా. బాల వ్యాకరణ రహస్యాలను, సిద్ధాంత కౌముదిలోని చిక్కుముడులను విప్పి చెప్పి, సంస్కృతాంధ్ర వ్యాకరణ సముద్రాలను స్వయంగా మథించి, విజ్ఞానమనే అమృత కలశాన్ని నాకు ప్రసాదించిన విద్యా ధన్వంతరి మా నాన్నగారు. ఆత్మీయులు డా॥వరలక్ష్మిగారు అన్నట్లు – నాకు 'వ్యాకరణ వైదుష్యం' ఏమైనా ఉంటే, అది మా నాన్నగారు నాకు ప్రసాదించిన వరం. నేను సంపాదించుకున్నానని మా చిరంజీవి చెప్పిన 'పసిడి పతకం' నిజానికి మా నాన్నగారికే చెందుతుంది. తండ్రే గురువై ఆనాడు విద్యాభిక్షను నాకు అనుగ్రహించగా, ఈనాడు ఆ సన్నివేశాలు నా మదిలో మెదలుతున్నాయి. ఈ శుభసందర్భంలో గురుస్మరణ చేయకపోతే, నా మనస్సు అసంతృప్తితో అలమటిస్తుంది. మా నాన్నగారికి 'అక్షరాంజలి' సమర్పించడం కన్న, ఏమి చేయగలను?

బాల్యంలోనే అవతారమూర్తి అయిన "అమ్మ"ను దర్శించే భాగ్యం నాకు లభించింది. "అమ్మ"తో, జిల్లెళ్ళమూడితో మాకుటుంబానికి చక్కని అనుబంధం ఏర్పడింది. ఈ కారణాలవల్ల కాబోలు, నాకు జిల్లెళ్ళమూడి "అమ్మ"పట్ల అచంచలమయిన భక్తివిశ్వాసాలు ఏర్పడ్డాయి. "అమ్మ"ను లలితాస్వరూపంగా భావించి జిల్లెళ్ళమూడిలో లలితా సహస్ర నామపారాయణం నిరంతరం జరుగుతూ ఉండడం నాకెంతో ఆనందాన్ని కలిగించింది.

సహస్రనామస్తోత్రంలో లలితాదేవిని గురించి వ్యాసమహర్షి చెప్పిన లక్షణాలు "అమ్మ"లో పరిపూర్ణంగా ఉన్నాయి కదా ! అని నాకు అనిపించింది. "అమ్మ" లోని అవ్యాజకరుణ, అంతులేని మహిమ, సాటిలేని ప్రేమ, మొదలయిన

కల్యాణ గుణాలు నాకూ అనుభవానికి వచ్చాయి. లలితాసహస్రనామస్తోత్రంలో దర్శనమిచ్చే 'శక్తిస్వరూపిణి' మణిద్వీపంలోనో, శ్రీ చక్రంలోనో మాత్రమే కాక, అర్కపురిలో కూడా అవతరించిందని నాకు అనిపించింది. సహస్రనామస్తోత్రంలోని తత్త్వం "అమ్మ" జీవితంలో, "అమ్మ" ఇచ్చిన ప్రబోధంలో దాగిఉన్నదని, ఆర్తితో అన్వేషిస్తే సమన్వయం లభించకపోదు అని ఒక చిత్రమయిన ఆలోచన కలిగింది. 'విశ్వజనని' పత్రికకు 'అవ్యాజకరుణామూర్తి' అనే వ్యాసం పంపాను. "అమ్మ" దయవల్ల వెలువడిన ఆ మొదటి వ్యాసం ఇలా ఒక గ్రంథ రచనకు చుట్టిన శ్రీకారమని ఆనాడు నాకు తెలియలేదు.

మొదటి వ్యాసానికి పాఠకుల నుంచి మంచి స్పందన లభించింది. మరో రెండు వ్యాసాలు వచ్చాయి. తలవని తలంపుగా ఆ సమయంలో మా ఇంటికి వచ్చిన ఆంధ్రాయూనివర్సిటీ తెలుగు శాఖ ఆచార్యులు శ్రీమతి మలయవాసినిగారు ఈ వ్యాసాలు చూసి, రచనా వ్యాసంగాన్ని కొనసాగించమని ప్రేమతో ప్రోత్సహించారు. గురువుగారి ఆజ్ఞను ప్రేరణగా, "అమ్మ" దీవనను స్ఫూర్తిగా భావించి ముందుకు సాగాను.

నాలుగయిదు వ్యాసాలు వెలువడిన తర్వాత, "ఈ వ్యాసాలన్నీ ఒక పుస్తకరూపంలో తీసుకు వస్తే బాగుంటుంది" అన్నారు మా వారు. అయితే, ఆ విషయంలో నాకు అంతగా ఆసక్తి కలగలేదు. మరికొన్ని వ్యాసాలు ప్రచురితమయిన తర్వాత మాతృశ్రీ ఓరియంటల్ కళాశాల తెలుగు రీడర్, ఆత్మీయురాలు శ్రీమతి డాక్టర్ సుగుణ నాకు ఫోను చేశారు. తమ ఆనందాన్ని ప్రకటిస్తూ, పుస్తకంగా అచ్చువేయమని సూచన చేశారు. "అమ్మ" సాహిత్యాన్ని నిరంతరం అధ్యయనం చేస్తూ, "అమ్మ" సాహిత్యంపై పరిశోధన చేసిన డాక్టర్ సుగుణ ఇచ్చిన ప్రేరణ "అమ్మ" సంకల్పంగా నాకు తోచింది. 'సరే' అన్నాను. అలా ఈ గ్రంథ ప్రచురణకు నేపథ్యం ఏర్పడింది.

శ్రీ లలితా సహస్రనామస్తోత్రంలో వ్యాసరచనకై నేనెన్నుకున్న నామానికి గల అర్థాన్ని వివరించడానికి 'భారతీవ్యాఖ్య'ను ఆశ్రయించాను. మా మామగారు

కీ॥శే॥ మల్లాప్రగడ శ్రీరంగారావుగారు 'అమ్మ' సన్నిధిలో ప్రవచనం చేసిన లలితా సహస్రనామభాష్యానికి అక్షర రూపం ఆ గ్రంథం.

పవిత్ర హృదయులు, ప్రాతఃస్మరణీయులు అయిన మా మామగారికి భక్తితో నమస్కరిస్తున్నాను. మా అత్తయ్యగారు శ్రీమతి వసుమతి గారు నన్నాశీర్వదించి ప్రోత్సహించారు. ఆత్మీయతకు అద్దంపట్టిన మా అత్తగారికి శిరస్సు వంచి ప్రణమిల్లుతున్నాను.

అమ్మతత్త్వాన్ని అవగాహన చేసుకోవడానికి శ్రీ కొండముది రామకృష్ణ, శ్రీమతి బ్రహ్మాండం వసుంధర, శ్రీమతి భవానీకుమారి, శ్రీ పి.యస్.ఆర్.ఆంజనేయ ప్రసాద్, శ్రీమతి కుసుమాచక్రవర్తి, డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గార్ల రచనలు, శ్రీమతి డా॥బి.యల్.సుగుణ గారి పరిశోధన ప్రబంధం "మాతృశ్రీ సాహిత్య సౌందర్యానుశీలనం" నాకు ఎంతగానో ఉపకరించాయి. దారీ, తెన్నూ తెలియని నాకు వారి రచనలు కరదీపికలై సహకరించాయి. ఆ సోదరీ సోదరులకు నా కృతజ్ఞతాభివందనాలు.

ప్రతి వ్యాసానికీ ముందు 'అమ్మ'కు ప్రణమిల్లుతూ, మా శ్రీవారు రూపొందించిన పద్యాలు ఈ గ్రంథానికి వినూత్న శోభను కలిగించాయని భావిస్తున్నాను. 'విద్యాస్వరూపిణి' అయిన అమ్మకు మేమిద్దరమూ కలసి ఇలా సారస్వతార్చన చేసుకునే అవకాశాన్ని 'అమ్మ' అనుగ్రహించింది. ఈ దివ్యానుభూతిని కలిగించిన అమ్మకు నమస్కృతులు.

ఇటీవల ఒకనాడు ఆత్మీయులు శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం గారు సతీ సమేతంగా మా యింటికి వచ్చారు. అంతకుముందు రోజుననే మా వారు ఈ గ్రంథంలో వ్రాసిన పద్యాలు పూర్తి అయ్యాయి. ఆ పద్యాలన్నీ చూసి, శ్రీ కోటవారు సముచితమైన సవరణలు సూచించారు. 'ఆమోద ముద్ర'తో ప్రోత్సహించిన 'సహస్రావధాన భాస్కరులు' శ్రీ కోటవారికి కృతజ్ఞతా కుసుమాంజలులు.

సముచితమైన సలహాలతో, ఆత్మీయ సహకారం అందించిన వేదమూర్తులు బ్రహ్మశ్రీ టి.వి.సోమయాజులు గారికి నమోవాకాలు.

వ్యాసం పూర్తి అయిన తరువాత 'అమ్మవాక్యం' ఉంటే బాగుంటుందని పించింది. కొన్నిచోట్ల మా నాన్నగారు 'అమ్మ'ను గూర్చి వ్రాసిన పద్యాలు ఆ ఖాళీస్థలాన్ని అందంగా అలంకరించాయి.

అవ్యాజవాత్సల్యంతో అనుగ్రహించిన కుర్తాళం పీఠాధిపతులు, జగద్గురువులు, పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానందభారతీ స్వామివారికి సాష్టాంగ దండ ప్రణామాలు సమర్పిస్తున్నాను.

ఈ గ్రంథాన్ని పరిశీలించి ఆశీర్వదించిన అగ్రజులు, 'విశ్వజనని' సంపాదకులు శ్రీ పి.యస్.ఆర్.ఆంజనేయప్రసాద్‌గారికి, శ్రీమతి బ్రహ్మాండం వసుంధర అక్కయ్యకు, గురువర్యులు ఆచార్య మలయవాసినిగారికి నా ప్రణామములు. ఆత్మీయతను అభినందనగా అందించిన డా॥సుగుణ, డా॥వరలక్ష్మి గార్లకు కృతజ్ఞతలు చెప్పడానికి భాషచాలదు. వారి అభిమానాన్ని నా అంతరంగంలో పదిలపరచు కుంటున్నాను.

ఈ వ్యాసాలన్నింటికీ ప్రథమ పాఠకుడు మా చిరంజీవి నందకిశోర్. 'మాతృదేవోభవ' అంటూ తన్మయత్వంతో స్పందించాడు. ఆ చిన్నారికి 'అమ్మ' అమృతాశీస్సులు ప్రసాదించుగాక ! నా వ్యాసాలు చదివి, ఎంతగానో ఆనందించిన నా శిష్యులు చి॥రఘు, చి॥రాములపై "అమ్మ" అశీస్సుమాలు వర్షించుగాత!

ఈ వ్యాసాలు గ్రంథరూపాన్ని పొందుతున్న వేళ తమ ప్రేమను పంచిన చి॥సౌ॥మృదులకు, చి॥ఫణి రామ లింగేశ్వర శర్మకు ఆశీరక్షతలు ప్రసాదించమని అమ్మను మనసారా వేడుకుంటున్నాను.

నా వ్యాసాలను మాసపత్రికలో ప్రచురించి, నన్ను ప్రోత్సహించి, గ్రంథ ముద్రణలో సమయోచితమైన సూచనలతో సహకరిస్తూ, మార్గదర్శకులైన 'విశ్వజనని' సంపాదకులు, మాన్య సోదరులు శ్రీ పి.యస్.ఆర్.ఆంజనేయ ప్రసాద్ గారికి అభివందనాలు.

ఓర్పు, నేర్పులతో అందంగా డి.టి.పి. చేసిన సోదరి శ్రీమతి ఇందిర గారికి కృతజ్ఞతాభివందనాలు. ఈ గ్రంథాన్ని సకాలంలో సర్వాంగ సుందరంగా ముద్రించి యిచ్చిన శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్ యాజమాన్యం వారికి, సిబ్బందికి ధన్యవాదాలు.

అంతా తానే అయి అడుగడుగునా నన్ను నడిపిస్తున్న 'అమ్మ'కు ముకుళిత హస్తాలతో భక్తిపుష్పాంజలి సమర్పించడం కన్న ఏమివ్వగలను " ?

సర్వం శ్రీ మాతృచరణారవిందార్పణమస్తు.

-రచయిత్రి



శ్రీ కుంకుమ రేఖాంకిత
లోకిత రమణీయ ఫాల ! లోలాపాంగ
స్వీకృత భక్తౌఘ ! ఘృణా
శ్రీకర పరిషిక్త హృదయ ! శ్రీ అనసూయా !

శ్రీ రాజిత నేత్రాంచల;
నీరాగ మనోవికాస ! నిత్య విలాస
ప్రేరిత సద్భావోదయ!
స్మేరానన పద్మశోభ ! శ్రీ అనసూయా!

-డా॥నారపరాజు శ్రీధరరావు



*His Holiness - Jagadguru*
**SRI SIDDHESWARANANDA BHARATISWAMY**
*Siddheswari Peethadhipati - Courtallam*

పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు
శ్రీ సిద్ధేశ్వరానందభారతీస్వామి
సిద్ధేశ్వరీ పీఠాధిపతి - కుర్తాళం

Mounaswamy Mutt,
Courtallam - 627 802
(Via Tenkasi),
Thirunelveli (Dt.)
TAMILNADU
Ph:04633-283707

Camp Office :
B1-C40,
Kaalipeetham Street,
4th Line,
Ravindra Nagar,
GUNTUR-522 006
Ph : 0862-2231625
2256666

## ఆశీర్వాద శ్రీముఖము

ఈ దేశములోని ఆధ్యాత్మిక భావనలలో ఎన్నో చిత్రమైన మలుపులు వచ్చినవి. తల్లిని, తండ్రిని, ఆచార్యుని దేవునిగా చూడమని వేదమే చెప్పినది. వృద్ధ దంపతులను లక్ష్మీనారాయణులుగా, పార్వతీ పరమేశ్వరులుగా అర్చించటం కూడా ప్రాచీనమైనదే. సువాసిన్యర్చన ప్రీతయని లలితానామములలో ఉన్నది. భక్తులు తమ గురువులలో వివిధ దేవతలను దర్శించటం వారిని పరిపూర్ణ దేవతలుగా భావించటం ఇటీవల ఎక్కువగా కనిపిస్తున్నది. గురువు మహనీయుడు కావచ్చు గాని పూర్ణమైన దేవుడు కాడని ఎక్కువమంది అభిప్రాయము.

ఇటీవల విష్ణు సహస్రనామములు మొదలైన వానిని తమ గురువుల కన్వయించి గ్రంథములు వ్రాసిన వారున్నారు. అలానే ఇప్పుడు మల్లాప్రగడ శ్రీవల్లిగారు (సుప్రసిద్ధ విద్వత్కవి శ్రీమన్నారాయణమూర్తి గారి శ్రీమతి) లలితా సహస్రనామములను కొన్నింటిని జిల్లెళ్ళమూడి అమ్మ మాతృశ్రీ అనసూయాదేవికి అన్వయించి గ్రంథరచన చేశారు. 'అమ్మ' భక్తులకు ఇది అమృత ప్రాయంగా ఉంటుందనటంలో సందేహం లేదు. విశ్వాసమునకు సంబంధించిన విషయములలో తర్కమునకు తావులేదు.

రచనను ఒక సాహిత్య సంధానంగా పరిశీలిస్తే ప్రజ్ఞా విలసనము కనిపిస్తున్నది గనుక ప్రశంసనీయమైనది. అర్కపురి అంబికను భౌతిక శరీరంతో ఉన్నపుడు భౌమభూమికలోను, పాంచ భౌతిక తనువు వీడిన తరువాత దివ్యభూమికలోను దర్శించాను గనుక, ఆమె సిద్ధయోగస్థితిని గురించి కొంత అవగాహన ఉన్నది గనుక ఇటువంటి రచన నాకు నచ్చటం సహజం. ఆ దృష్టితో రచయిత్రికి అమ్మకరుణా కటాక్ష కాంతి ప్రసారము లభించును గాక – అని ఆశీర్వదిస్తున్నాను. శుభమస్తు !

# భక్తి సుమవల్లి

"పురుషోత్తమపుత్రభార్గవ"
శ్రీ పి.యస్.ఆర్.ఆంజనేయప్రసాద్
సంపాదకులు, 'విశ్వజనని'
సంచాలకులు, శ్రీనాధపీఠం

**"మామిడి చెట్టును అల్లుకొన్నదీ మాధవీలతొకటి
ఏమా రెండిటి స్నేహసంపద ఇంతింతన లేము"**

మా మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిని, సోదరి శ్రీవల్లిని చూచింతర్వాత వారి దాంపత్యాన్ని చూచింతర్వాత నాకాపాట గుర్తు కొచ్చింది. వారి అన్యోన్యత అలాంటిది. శ్రీమన్నారాయణమూర్తి నాకు నచ్చిన వ్యక్తులలో ఒకడు. ప్రతిభావంతుడు. సహృదయుడు. శ్రీవల్లిని గూర్చి సంస్కృత కళాశాలలో ఒక లెక్చరర్గా మాత్రమే తెలుసు. ఆమె రచయిత్రి అని తెలియదు. పైగా విశ్వజనని సంపాదకునిగా మా శ్రీమన్నారాయణమూర్తిని ఏదైనా విశ్వజనని మాసపత్రికకు వ్రాయవయ్యా ! నీవు లలితా సహస్రనామాల రహస్యార్థాలు తెలిసిన వాడివి గదా! అమ్మమాటలతో అన్వయం చేస్తూ వ్రాయకూడదా ! అన్నాను. మొత్తం మీద ఆయన కొంతకాలానికి వ్యాసాలు వారి శ్రీమతి శ్రీవల్లిపేర పంపటం మొదలుపెట్టాడు. నేను ఆయనే వ్రాసి ఆమెపేరు పెట్టి పంపుతున్నాడు అనుకున్నాను. మాటల సందర్భంలో ఆ మాట వారితో అన్నాను కూడా! అప్పుడాయన "ఏమండోయ్! ఆవిడ శ్రీధరరావు గారి కూతురు. నన్ను ఆ రచనలో చేయి పెట్టనివ్వదు" అన్నాడు. ఆశ్చర్యపోవటం నావంతైంది. ఎందుకంటే, నిజానికి నేను మా శ్రీమతి పేరుతో ఎన్నో రచనలు చేస్తుంటాను. కాని వారి శ్రీమతి చాల వ్యక్తిత్వం కలది. ఆమె రచనలో వీరి జోక్యాన్ని ఒప్పుకోనిది. పైగా పరిశోధన చేసి డాక్టరేట్ సంపాదించుకొన్నది.

శ్రీవల్లి గారి తండ్రి డాక్టర్ నారపరాజు శ్రీధరరావుగారు వైద్యుడు. అంతేకాదు. సంస్కృతాంధ్రాలలో మంచి పండితుడు. కవి, వైయాకరణి, అలంకార శాస్త్రవేత్త. అంతంత మాత్రం వాళ్ళు ఆయన దగ్గర ఆగేవారు కాదు. జిల్లెళ్ళమూడి

అమ్మ పట్ల అచంచల భక్తి విశ్వాసాలు కలవాడు. అమ్మపై కావ్యాలు వ్రాశాడు. అలంకార శాస్త్రం పద్యాలలో వ్రాశాడు. మంచి వేదాంతి. వేదాంతం కూడా పద్యాలలో వ్రాశాడు. అంతటి సమర్థుడు.

శ్రీవల్లి, శ్రీమన్నారాయణమూర్తి ధన్యులు. ఎందుకంటే శ్రీమన్నారాయణ మూర్తి తండ్రి శ్రీరంగారావుగారు సుప్రసిద్ధ పండితుడు. శృంగేరీ శారదాపీఠ ఆస్థాన విద్వాంసుడు. రాష్ట్ర రాష్ట్రేతర ప్రాంతప్రజలను తమ ప్రవచనాలతో పరవశింపచేసిన పౌరాణిక సార్వభౌముడు. ఆర్షవిద్యలో ఆరి తేరినవాడు. అమ్మ సన్నిధిలో లలితాతత్త్వాన్ని వ్యాఖ్యానించిన ధన్యచరితుడు. లలితా సహస్రనామ వ్యాఖ్యాత. ఇక నారపరాజు శ్రీధరరావుగారిని గూర్చి పైన చెప్పాను. అలాంటి వారి సంతానం వీర్దిదరూ. అంతమాత్రం చేతనే ఈ దంపతులు ధన్యులు కాదు. ఆ తల్లిదండ్రులకు, ఈ తల్లిదండ్రులకు సేవలుచేసి తరింపచేసినవారు. "తల్లి దండ్రి మీద దయలేని పుత్రుండు పుట్టనేమి, వాడు గిట్టనేమి ? పుట్టలోన చెదలు పుట్టవా ? గిట్టవా? " అన్నాడు వేమన. అదృష్టవశాత్తు ఇరువైపుల తల్లిదండ్రులకు సేవచేసిన ధన్యులు శ్రీవల్లి, శ్రీమన్నారాయణమూర్తులు. అంతేకాదు 'అమ్మ' (జిల్లెళ్ళమూడి)ను సేవించుకున్నవారు రెండు కుటుంబాలవాళ్ళు.

ఇక గ్రంథాన్ని గూర్చి చెప్పమంటే ఇదంతా ఎందుకు చెప్పినట్లు ? ఈ గ్రంథనేపథ్యమే ఇదంతా ! ఈ గ్రంథం చదివితే మీకు తెలుస్తుంది, లలితా సహస్రనామాలు ఎంత అధ్యయనంచేశారో, అమ్మ - అమ్మ వాక్యాలు ఎంత నిశితంగా పరిశీలించారో రచయిత్రి. ఇందులో మొదటి వ్యాసం 'సర్వాధారా'. చివరిది 'అద్భుతచారిత్రా'. సర్వమునకు ఆధారమైనవారు అద్భుతచారిత్రులు కాకుండా ఎలా ఉంటారు ? లలిత కానివ్వండి, అమ్మ కానివ్వండి. అమ్మ లలితకాకపోతే కదా!

ఇక లలితానామాలలోని నక్షత్రాలలాంటి 27 తీసుకొని, లలితా సహస్రనామాలకు తన మామగారు శ్రీరంగారావుగారు వ్రాసిన భారతీ వ్యాఖ్యను ఆధారం చేసుకొని, అంతకు ముందు అమ్మ మాటలను విశ్లేషణ చేసిన కొండముది రామకృష్ణ 'మాతృసంహిత'లోని అమ్మమాటలను, సంఘటనలను అవగాహనకు తెచ్చుకొని, అర్కపురి లేఖలు వ్రాసిన భవానీకుమారి రచనలు మనసుకు పట్టించుకుని, శ్రీపాదగోపాలకృష్ణమూర్తి గారి గ్రంథాలు నెమరు వేసుకుంటూ

ఒక సమగ్రమైన ఆలోచనాలోచనంతో తన ప్రతిభను జోడించి వ్రాసిన వ్యాసాలివి. వాటిని నెల నెలా మా విశ్వజనని మాసపత్రికలో ప్రచురించాం కూడా.

శ్రీ చక్రంలో బిందుమండలవాసినియై సర్వజగత్తుకూ ఆధారమైన శ్రీమాత సర్వాధారగా ప్రసిద్ధి. జిల్లెళ్ళమూడిలో ఒక చిన్న మంచం మీద కూర్చుని ఈ సృష్టి నాది అనాది అన్న అమ్మ తాను సర్వధారనని ఎలా చెప్పకనే చెప్పిందో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. శ్రీచక్రంలోని నవావరణల వలె అమ్మ సంకేతమైన చిహ్నం తొమ్మిది వలయాలు గలిగి, మధ్య బిందురూపంలో ఉన్నది. లలితలో మొదటి నామం శ్రీమాత. అమ్మ మాతృశ్రీ. శ్రీమాతలోని 'శ్రీ' మాత ప్రక్కన చేరింది. ఈ విశ్లేషణ విచిత్రమే – అమ్మే లలిత – లలితే అమ్మ అనేది ఎంత తేలిగ్గా తెలియజేసిందో ఈ రచయిత్రి. అంతేకాదు. ఆ వలయాలకు పైన 'నేను నేనైన నేను' అనే మాటలు, క్రింద మాతృశ్రీ అనే శబ్దము ఈ తత్వాన్ని నిరూపిస్తూ నిండుగా ఉన్నాయని శ్రీవల్లి చేసిన సమన్వయం సమగ్రసుందరంగా ఉన్నది.

నిరాధారా, ధర్మాధారా అయిన అమ్మ గోమాత. ఆబ్రహ్మకీటజనని. 1962లో చీరాలలో నారపరాజు శ్రీధరరావుగారింట్లో 'అమ్మ' కొంతకాలం ఉన్నది. ఒకరోజు వారింట్లో ఉన్నవారందరికీ తన చల్లని చేత్తో తల అంటిందిట. డాక్టర్ గారి పెంపుడు కుక్క కూడా ఆ అదృష్టానికి నోచుకున్నది. అమ్మ విశ్వజనని. ఆమెకు సకల ప్రాణికోటీ శిశువులే. అందువల్లే అమ్మ ఆబ్రహ్మకీటజనని అని తన చర్యల ద్వారా నిరూపించిందని సోదాహరణంగా వివరించటం బాగున్నది.

అమ్మ ఎంత ప్రేమరూప ! అమ్మకు ప్రేమసహజం. మానవుల మీదే కాదు, జడపదార్థాలని మనం అనుకునేవాటిమీద కూడా. పత్రికను కూడా పుత్రికగానే భావించింది. వరదలో కొట్టుకొని వచ్చిన కుక్కపిల్లనూ పెంచింది. అందువల్లే అమ్మ అందరికీ ప్రియంకరి కాగలిగింది. శ్రీవల్లిగారి జీవితంలో ప్రతి సన్నివేశంలోనూ అమ్మ అభయహస్తం ఉందిట. చదువు, పి.హెచ్.డి., పెళ్ళి, ఉద్యోగం, సంతానం – ఒకటేమిటి ? అన్నింటిలోనూ అమ్మ అండదండలే. అందువల్ల అమ్మ ప్రియంకరి కాకుండా ఎలా ఉండగలదు?

అమ్మ పతివ్రత, సాధ్వీలలామ. పరధ్యానంలో ఉండదు. ఎప్పుడూ పతిధ్యానంలోనే ఉండేది. అందరికీ దేవత అయిన ఆమెకు మాత్రం నాన్నగారే దేవుడు. నాన్నగారికి ఏ మాత్రం నలతగా ఉన్నా, సేవచేసేది. ఏదైనా తాను చేసే

చెప్పేది బిడ్డలకు. పెనిమిటి అంటే పెన్నిధి అని, స్త్రీకి అదే దైవసన్నిధి అని చెప్పి, ఆచరించి చూపించింది. స్వరూప లలిత, స్వభావ మధుర అయిన అమ్మ తిట్టినా, కొట్టినా దురదగొండాకుతో పూజించినా క్షమించే సహజ సహనమూర్తి. ఆఖరికి తనకు వచ్చిన జబ్బులను, గడ్డలను కూడా బిడ్డలుగానే భావించింది. అది అమ్మ మధుర స్వభావం.

అమ్మ నామపారాయణ ప్రీత. ఏ నామమైనా తనదేనని తన సన్నిధిలో రామనామ సప్తసప్తాహాలు చేయించింది. గాయత్రీ యజ్ఞం చేయించింది.ఎవరో దూరంగా పోతున్నవారిని చూసి ప్రక్కనున్నవారు యమభటుల్లా ఉన్నారే అంటే, అమ్మ వెంటనే 'యమభటులు అమ్మ భటులు కాకపోతేగా' అన్నది. హైమ మనసెరిగిన అమ్మ, హైమ అభీష్టం మేరకు అఖండనామ సంకీర్తనను ప్రారంభించింది.

అమ్మ సంగీత సాహిత్య సరస్వతి. అమ్మ సన్నిధిలో ఎన్ని గ్రంథాలు ఆవిష్కరింపబడ్డాయో చెప్పలేం. ఒక మల్లాప్రగడవారు, ఒక నారపరాజువారు, ఒక ప్రసాదరాయకులపతిగారు, ఒక పుట్టపర్తివారు, ఒక రాజుబావ, ఇలా ఎందరెందరో అమ్మ సన్నిధిలో తమ సాహిత్య సౌరభాలు విరజిమ్మారు. శ్రీమన్నారాయణ మూర్తి చేత పోతన భాగవతపద్యాలు చదివించుకుని ఆనందించిన కావ్యాలాప వినోదిని అమ్మ.

అమ్మ అన్నదా. లక్షమందితిన్నా, ఒక్క బిడ్డ తినకపోతే, ఆ తల్లికి బాధే. అన్నపూర్ణాలయం గంట శబ్దమూ, అమ్మ గుండె చప్పుడూ ఒకటే. నిరంతరం జగన్నాథ రథచక్రాల్లా సాగుతుండాల్సిందే – అమ్మ ప్రాణదాత్రి. ఒక నరసింహారావు మాష్టారో, ఒక రామరాజు కృష్ణమూర్తో, ఒక జేమ్స్ కాంపియనో ఎవరైనా అమ్మ బిడ్డలుగా అమ్మ సేవలో ఉన్నవారే – వారంతా కరెంట్ షాకు నుండి రక్షింపబడ్డ వారే – ఒక గోపాలన్నయ్యో, ఒక బుద్ధిమంతుడో, ఒక పన్నాల రాధాకృష్ణశర్మగారి కుమారుడో, ఒక రావూరి ప్రసాద్ కుమారుడో ఎవరైనా అమ్మచే ప్రాణదానం చేయబడ్డవారే. అమ్మ ముక్తిదాయిని. కోన వెంకాయమ్మ, తాను కొద్ది సేపట్లో చనిపోతున్నానని తెలిసినా భయపడలేదు. కారణం మృత్యువును గూర్చిన భయం లేకపోవటమే మృత్యుంజయత్వం అని మనందరికీ తెలియచేయడానికేనేమో – 'నీ దగ్గరకే గదా వస్తున్నది నాకెందుకు భయం' అని అమ్మతో అనటం ముక్తుల

లక్షణం – అలాంటివాడే పోతుకూచి రవి కూడా. నిర్వాణ సుఖదాయిని అయిన అమ్మ అనుగ్రహమది. అలాగే జుట్టంతా మోటారులో ఇరుక్కుపోయిన డాక్టర్ ఝాన్సీని సర్వమృత్యునివారిణి అయిన అమ్మ కాపాడటం కూడా అందులో భాగమే. అనర్ఘ్య కైవల్యపదదాయిని, వాంచితార్థప్రదాయిని అయిన అమ్మ హైమకోరిన కోర్కె తీర్చి, మనందరికీ కోరిన కోర్కెలు తీర్చే కొంగుబంగారంగా మలచి దేవతను చేసి నిలిపింది. గుంటూరు జొన్నాభట్ల వెంకట్రామయ్య గారి కోరిక మేరకు సన్యాసదీక్షను ఇప్పించి, తనలో కలుపుకున్న తీరు చూస్తే అమ్మ ఎంతటి 'సద్గతి ప్రదా' ఎంతటి 'స్వర్గాపవర్గదా'నో అర్థమౌతుంది. శ్రీ వెంకట్రామయ్యగారు తమ ఇంటిని మరో జిల్లెళ్ళమూడిగా పలకటంలో వారిపై అమ్మ ఎంతటి అవ్యాజ కరుణను కురిపించిందో తెలుస్తుంది.

ముఖము, మెదడు, ఎముకలు చెల్లా చెదరైన వీరమాచనేని ప్రసాదరావు గారి కోడలిని తానే డాక్టరై కాపాడటంలోనూ, వ్యాపారంలో నష్టపోబోతున్న శ్రీ టి.టి.అప్పారావుగారిని, ఆయనను మోసం చేసి, డబ్బు దొంగిలించిన బెహరాను, ఇద్దరినీ కాపాడటంలోనూ అమ్మ నిర్భేదా భేదనాశినిగా, నిర్ద్వైతా ద్వైతవర్జితగా ఎలా సాక్షాత్కరించిందో కన్నులకు కట్టించారు తన రచనలో శ్రీవల్లిగారు.

అమ్మ తనవద్ద శిక్షలేదు, శిక్షణే నన్న అద్భుతచారిత్ర. అమ్మ పుట్టిందగ్గర నుండి విశ్వరూపిణిగా ఆలయంలో చేరేవరకు చూపించిన నిదర్శనాలు, సన్నివేశాలు అమ్మ అద్భుతచరిత్రలో లోకాదర్శనీయమై, అమ్మను లోకారాధ్యగా నిలుపు తున్నాయి. అందుకే, శ్రీమన్నారాయణమూర్తి వ్రాసిన

**"అమ్మ సేవయొకటె ఆనందతీరమ్ము**
**అమ్మ నామమదియె అక్షరమ్ము**
**అమ్మ పాదయుగళి అవనిలో స్వర్గమ్ము**
**అమ్మ దివ్యచరిత అద్భుతమ్ము"** అనే పద్యం అక్షర సత్యం.

ఈ గ్రంథంలో మరొక ఆకర్షణ ఏమిటంటే శ్రీవల్లి తండ్రిగారు డాక్టర్ నారపరాజు శ్రీధరరావుగారు అమ్మను గూర్చి వ్రాసిన పద్యాలు వ్యాసాల చివర దర్శనం కావటం.

పూజ్యులు ప్రసాదరాయకులపతిగారు ఒక వివాహంలో వధూమణికి శుభాకాంక్షలు తెలుపుతూ

"మంటప మెక్కి నీకు ఒకమాట వచింపగనుంటి, అత్తవా
రింటికి పోవు మంగళమయీ ! వినవమ్మ ప్రియమ్ముతోడ, పు
ట్టింటికి మెట్టినింటికిని ఇంతనరాని యశమ్ము గూర్చి, నీ
వంటి చిరంటి పుణ్యముల పంట అనంగ మెలంగు మమ్మరో"! అని ఒక
పద్యం చెప్పారు.

అమ్మా ! శ్రీవల్లీ! నిజంగా పుట్టినింటికి మెట్టినింటికి కీర్తి తెచ్చే పనిచేశావమ్మా! ఏమైనా సౌందర్య సౌగంధ్యరస సుమఫలశ్రీవల్లివి నీవు. భక్తి సుమవల్లివి. ఇంతకంటే ఏంకావాలి ? లలితాదేవి, అమ్మ ఒకరే కనుక, అమ్మ ఆశీస్సులు, వాత్సల్యము నీ మీద, మీకుటుంబం మీద సర్వదా ప్రసరిస్తాయని నమ్ముతున్నాను.



లెక్కలు గట్టు తల్లికిని
లెక్కలు వేయని నిండు తల్లికిన్
లెక్కలు రాని తల్లి; కవలీలగ
సర్వము నాశ్రయించి, లో
నక్కెడు చిట్టి తల్లికి, జనంబులు
నిత్యము బాధలొందగా
మ్రొక్కిన సొక్కు తల్లి కిదె
మ్రొక్కెద నిక్కువమైన భక్తితోన్.

-డా॥నారపరాజు శ్రీధరరావు

# అనుబంధం

శ్రీమతి బ్రహ్మాండం వసుంధర,
జిల్లెళ్ళమూడి

అమ్మతోనూ, హైమతోనూ అనుబంధం ఉన్న కుటుంబాలలో డాక్టర్ శ్రీధరరావుగారి కుటుంబం ఒకటి. వారింటికి వెళ్ళి వారి సేవలందుకుని తన కృపావృష్టిని కురిపించింది అమ్మ. తత్ఫలితంగా డాక్టర్ గారికి అమ్మను గూర్చి రచన చేయాలన్న ప్రేరణ కలిగింది. అమ్మ చిత్రపటాన్ని ముందుంచుకుని అమ్మతో సంభాషిస్తూ, అతి పట్టుదలతో, దీక్షగా సంస్కృతం నేర్చుకున్నారు. అమ్మను పద్యాలతోనూ, పాటలతోనూ స్తుతించి రచించారు. వారి లక్ష్యం నెరవేరింది.

వారి కనిష్ఠ పుత్రికయైన శ్రీవల్లిని డాక్టరు చదివించి, తన వైద్యసేవను వారసత్వంగా ఆమెకు అందించాలని ఆశించారు. అయితే, మధ్యలో ఎందుకో తమ అభిప్రాయం మార్చుకున్నారు. తెలుగు సాహిత్యం చదివించారు. ఈ విషయం నాకు వారే స్వయంగా, ఆత్మీయంగా చెప్పారు. అమ్మతో నేనూ ఉండటంతో 1962 నుంచే ఆ కుటుంబంతో నాకూ అనుబంధం ఏర్పడింది. నాతో చనువుగా, హాయిగా మాట్లాడేవారు.

శ్రీవల్లి కూడామొదట డాక్టర్ కోర్సు చదవాలనుకున్నది. అయితే, తమ తండ్రి గారి దీక్ష, సాధన, సాహిత్యకృషి చూసిన తర్వాత శ్రీవల్లికి తెలుగుమీద మమకారం ఏర్పడిందేమో మరి.

డాక్టరు గారి కోరికను అమ్మ, మరొక విధంగా తీర్చదల్చుకుని, మలుపు తిప్పిందేమో అనిపిస్తుంది. అమ్మ అనుగ్రహంవల్ల శ్రీవల్లి తెలుగులో డాక్టరేట్‌ను సంపాదించింది.

అమ్మ సాన్నిహిత్య ప్రభావం వల్లనూ, అమ్మపై గల భక్తితోనూ స్వీయానుభవాలను రంగరించి లలితా సహస్రనామాలను అమ్మకూ, అమ్మ వాక్యాలకూ అన్వయం చేసి రచన చేస్తూ, "వందే అర్కపురీశ్వరీం" అంటూ లలితా సహస్రనామాలను అనుసంధానం చేసి నిత్యస్తోత్రానికి వీలుగా ఏకాదశ శ్లోకాలను

రూపొందించింది. "అద్భుతచారిత్ర" అయిన అమ్మ యొక్క అద్భుతాల నెన్నింటినో పొందుపరిచింది. శ్రీవల్లి ద్వారా అమ్మ ఇంక ఎన్ని అద్భుతాలను చూపించనున్నదో మరి.

తన తండ్రిగారు ఆశించిన వైద్యసేవ కంటే మించిన దివ్య ఔషధ సేవను వరంగా పొందింది, వారిచ్చిన వారసత్వమా! అన్నట్లు. ఏమైతేనేం? తండ్రి గారి లక్ష్యం నెరవేరింది. జన్మనిచ్చిన మాతా, పితరుల సేవచేసి, తరించిన శ్రీవల్లిని వారు ఆశీర్వదిస్తున్నారని భావిస్తున్నాను.

మరెన్నో పరమౌషధాలను సోదరులకు శ్రీవల్లి ద్వారా అందించాలని అమ్మను వేడుకుంటున్నాను. అమ్మ వల్లీ కుటుంబంపై ఆశీస్సుమాలను కురిపించుగాక!

భక్తిప్రియాం, భక్తివశ్యాం, భక్తిగమ్యాం, భయాపహాం
భక్త సౌభాగ్యదాయినీం వందే అర్కపురీశ్వరీం ॥



వేదము లెన్ని చూచినను
విద్యల సారము సంగ్రహించినన్
వాదన లెన్ని చేసినను
భవ్య తరంబగు తీర్థయాత్రలన్
కాదన కెన్ని చేసినను
కానన సీమల యోగనిష్ఠతో
శోధన లెన్ని చేసినను
చూతుమె అమ్మ మహారహస్యముల్.

-డా॥ నారపరాజు శ్రీధరరావు

# అక్షరార్చన

**ఆచార్య కోలవెన్ను మలయవాసిని**
**విశ్రాంత తెలుగు శాఖాధ్యక్షులు**
**ఆంధ్ర విశ్వకళాపరిషత్, విశాఖ**

చిరంజీవులు శ్రీవల్లి, శ్రీమన్నారాయణమూర్తి దంపతులు ఆంధ్రవిశ్వకళా పరిషత్ తెలుగు ఎం.ఏలో సహాధ్యాయులు. వారు ఎం.ఏ. ఆఖరి సంవత్సరంలో ఉండగా నేను యూనివర్సిటీలో ఉపాధ్యాయినిగా చేరాను. ఆవిధంగా వారిరువురూ నాకు మొదటి బ్యాచ్ విద్యార్థులు. ఇక, శ్రీవల్లి నాపర్యవేక్షణలో మొదటి డాక్టరేట్ అందుకున్న విద్యార్థిని కూడా.

విద్యార్థి దశనుండి ఈ నాటివరకూ మా దంపతులకేకాక మా తల్లిదండ్రులకు కూడా శ్రీమాన్, శ్రీవల్లి ఆత్మీయులే. చిరంజీవి నందకిశోర్ మా ముద్దుల మనుమడే.

క్రితం సంవత్సరం పొన్నూరులో శ్రీవల్లిని కలిసినప్పుడు తాను లలితా సహస్రనామాలలో జిల్లెళ్ళమూడి అమ్మను దర్శించాననీ, ఒక్కొక్క నామాన్ని తీసుకుని ఒక్కొక్క వ్యాసాన్ని వ్రాస్తున్నానని, కొన్ని అప్పటికే "విశ్వజనని" మాసపత్రికలో ప్రచురితమయ్యాయని చూపించింది. 'సర్వాధారా' 'నిరాధారా' అనే వ్యాసాలవి. శ్రీవల్లి 'అమ్మ'లో లలితాపరమేశ్వరిని దర్శించిన విధానం ఎంతో విశేషంగా కనిపించింది. ఆ అనుభూతిని అక్షరబద్ధం చేసి పరమానందాన్ని, పరితృప్తిని పొందుతున్న శ్రీవల్లిని చూస్తే చాలా ఆనందమైంది. ఇప్పుడు ఆ అనుభూతి పరంపరతో వ్రాసిన ఇరవై ఏడు వ్యాసాలను పుస్తకరూపంగా తన పదవీ విరమణ సందర్భంలో 'అమ్మ'కు భక్తితో నక్షత్ర మాలికగా సమర్పణ చేయడం కంటే పరమ పవిత్ర కార్యం వేరే ఏముంది ?

నిత్యం 'సౌందర్యలహరీ' భావ సంపన్నులయిన ఈ దంపతుల సంస్కారానికి ఇదొక నిదర్శనం. 'అమ్మ' ఒడిలో, బడిలో మసలే మహద్భాగ్యం కలిగిన దంపతులు వీరు. తాము నేర్చిన సాహిత్యవిద్యను సార్థకం చేసుకుంటున్న నా శిష్యులిద్దరినీ చూస్తూ ఉప్పొంగిపోతున్నాను.

'అద్భుత చారిత్ర' అనే రచన చదివాక 'అమ్మ'తో శ్రీవల్లికి గల సాన్నిహిత్యం స్పష్టంగా తెలిసింది. డా॥శ్రీధరరావుగారి ఇంటికి 'అమ్మ' ఎన్నోపర్యాయాలు విచ్చేయడం, హైమక్కను వైద్యం నిమిత్తం శ్రీధరరావుగారి వద్దకు పంపడం, 'అమ్మ' స్వయంగా కోరి వారింటినుండి పూరీలు చేయించి, తెప్పించి, వారి చేతనే సముద్రతీరంలో జాలర్లకు, ఇతర ప్రాణికోటికి పంచి పెట్టించడం, శ్రీధరరావుగారిని కవిగా ఆశీర్వదించి, 'నివేదన' కావ్యం వ్రాయించి, ఆవిష్కరించడం శ్రీధరరావుగారి జీవితంలో మరపురానివి. 'అమ్మ' సాక్షాత్తూ ప్రేమరూప. పుణ్యాపుణ్య ఫలప్రద అయిన అమ్మ శ్రీధరరావుగారి జీవితంలో ప్రదర్శించిన మహత్తు విశేషమైనది.

ఆర్ష విద్యానిధి శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావుగారి కోడలు శ్రీవల్లి. శ్రీ రంగారావుగారిచేత లలితా సహస్రనామాలలోని అర్థాలను, అంతరార్థాలను, పరమార్థాలను విశేషాలను భారతీవ్యాఖ్యగా వ్రాయించి, శ్రీరంగారావుగారి చేత ప్రవచనం చేయించి ఆనందించింది అమ్మ.

శ్రీమన్నారాయణ మూర్తి చేత భాగవత పద్యాలు కోరి చదివించుకుని 'కావ్యాలాపవినోదినిగా' దర్శనమిచ్చింది అవ్యాజకరుణామూర్తి అయిన అమ్మ.

ముక్తిదా, నిర్వాణసుఖదాయినీ, అనర్ఘ్య కైవల్య పదదాయినీ, సద్గతిప్రదా, స్వర్గాపవర్గదా అనే శబ్దాలకు సామాన్యంగా మోక్షప్రదాయిని అనే అర్థమే అయినా – ఆ నామాల్లోని సూక్ష్మార్థాలను, అంతరార్థాలను విశ్లేషిస్తూ శ్రీవల్లి వ్రాసిన విషయాలు ఆమె పాండిత్యానికి పట్టుకొమ్మలు." 'ప్రియంకరి' అయిన "అమ్మ అనుగ్రహబలమే నన్ను డాక్టర్ శ్రీవల్లిని చేసింది" అని శ్రీవల్లి మాట. అమ్మను తన అంతరంగంలో అంతగా ప్రతిష్ఠించుకుని అర్చిస్తున్నది కనుకనే ఆమె రచన ఒక ప్రత్యేకతను సంతరించుకుంది.

"వైలక్షణ్యం కలాసు చ" అన్నట్లు – ఈ రచనలో ప్రతి వ్యాసానికి ఆరంభంలో 'సౌందర్యలహరీ' వ్యాఖ్యానప్రియుడైన శ్రీమన్నారాయణమూర్తి వ్రాసిన తేటగీతి – అమ్మకు సువర్ణకిరీటంగానూ, ఆ వెంటనే తన మామగారి 'భారతీవ్యాఖ్య' నుండి స్వీకరించిన ఆ నామ వివరణ – అమ్మ నుదుట దిద్దిన కుంకుమ తిలకంగానూ, సరళ వివరణతో కూడిన శ్రీవల్లి వ్యాసాలు – అమ్మ సుందర దరహాస కాంతులుగానూ, వ్యాసాంతంలో తన తండ్రి శ్రీధరరావుగారి పద్యపాదాలు

అమ్మ పాదమంజీర రవళులుగానూ శోభిల్లుతున్నాయి. ఈ రచన 'సాక్షాత్కరించిన అర్కపురి లక్ష్మి' అనడంలో సందేహం లేదు. సకుటుంబ సమార్చన మీ రచన. ఈ సందర్భంలో శ్రీనాథుని పద్యం ఉదాహరించక తప్పదు.

**తండ్రి వంశంబునం దేడు తరములకును**

**తల్లి వంశంబునం దేడు తరములకును**

**ధవుని వంశంబునం దేడు తరములకును**

**శాశ్వత స్వర్గ సౌఖ్య మీ జాలు సాధ్వి !** – ఈ మాటలు శ్రీవల్లి విషయంలో కూడా అక్షరసత్యాలే.

"దారిని తెలుసుకొంటి త్రిపుర

సుందరిని తెలుసుకొంటి" అన్న త్యాగయ్య గొంతుతో శ్రుతికలిపిన మా శ్రీవల్లి పదవీ విరమణానంతరం – 'అమ్మ'ను గురించి మరిన్ని విశేషాలు తనరచనలో ఆవిష్కరించగలదనీ అందుకు 'అమ్మ' ఆశీస్సులు సర్వదా సర్వధా లభించగలవనీ ఆశిస్తూ..... ఆశీర్వదిస్తూ....



**ఆ పాదములు భవ్యతాలింగితములు**

**ఆ పాదములు నవ్యతాప్లావితములు**

**ఆ పాదములు ప్రేమ కాలంబనములు**

**ఆ పాదములు లక్ష్మి కాటరంగములు**

**ఆ పాదరజము నిత్య శ్రేయదంబు**

**ఆపాద సిందూర మైశ్వర్య మిచ్చు**

**ఆపాద గంగయే ఆకాశగంగ**

**ఆపాద కాంతియే ఆ ప్రభాకరుడు**

**ఆపాద ధూళియే అఖిలలోకములు**

**ఆపాదరక్షయే అఖిల మంత్రములు**

**–డా॥నారపరాజు శ్రీధరరావు**

# స్వరూపే లలితే

డా॥ బి.యల్.సుగుణ
తెలుగు శాఖాధ్యక్షులు
మాతృశ్రీ సంస్కృత కళాశాల, జిల్లెళ్ళమూడి

'సృష్టి అనాది, నాది' అని ప్రకటించిన అమ్మ, సర్వసృష్టికీ మూలమైన శక్తికి సాకారంగా విశ్వంలో జడచైతన్యాలకు భేదం చూడకుండా, అందరినీ, అన్నింటినీ కన్నబిడ్డలవలె ఆదరించే వాత్సల్య స్వరూపిణిగా మాతృప్రేమకు మానవాకృతిగా ఈ భూమిపై అవతరించింది. 'అంతటా ఉన్న అమ్మను తెలియజేయడానికే ఈ అమ్మ' అని తన అవతార పరమార్థాన్ని తెలియజేసిన అమ్మ సకలదేవతా స్వరూపిణి.

**'యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి ।**
**తస్య తస్యాచలాం శ్రద్ధాం తాం ఏవ విదధామి అహమ్' ॥**

ఎవరు ఏ రూపంలో ఆరాధిస్తే ఆ రూపంగానే తాను కనిపిస్తానని భగవద్గీతలో భగవానుని ప్రతిజ్ఞ. అలాగే ఎట్లా చూసే వారికి అట్లా కనపడతాను' అని అమ్మ ప్రవచనం. ఆర్ష విద్యాభూషణ, మధుర భారతి బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావుగారు మొట్టమొదటగా జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించినపుడు తాము ఉపాసించే లలితాదేవియే ఈ రూపంలో దిగి వచ్చిందా! అన్పించిందట. అన్నిరూపాలూ, అన్ని నామాలూ అమ్మవే కనుక కొందరు రాజరాజేశ్వరిగా, కొందరు గాయత్రిగా ఇలా వివిధ నామాలతో, వివిధ రూపాలతో ఎవరి ఇష్టదైవాన్ని వారు అమ్మలో దర్శించారు. ఏ రూపంలో ఆరాధిస్తే ఆ రూపంలో సాక్షాత్కరిస్తుంది అమ్మ.

అమ్మను లలితాపరమేశ్వరిగా దర్శించిన డాక్టర్ మల్లాప్రగడ శ్రీవల్లిగారు 'లలితాసహస్రనామాలకు వ్యాఖ్యానమే అమ్మ జీవితం' అంటూ సోదాహరణంగా సమన్వయాత్మకంగా సాగించిన రచనే 'అద్భుత చారిత్ర' అనే ఈ గ్రంథం. ఎవరైతే లలితా సహస్రనామాలను నిరంతరం అనుశీలన చేస్తారో వారు లలితాకృతులుగా గోచరిస్తారట. అంతేకాదు. సహజమైన లాలిత్యాన్ని అణువణువులో సంతరించుకున్న

స్త్రీలందరూ లలితాస్వరూపులే అని పెద్దలు చెప్తూ ఉంటారు. కనుక శ్రీవల్లిగారు స్వరూప లలిత. అంతేకాదు స్వభావమధుర కూడా.

ఏ వ్యక్తికైనా బాల్యంలో జరిగిన సంఘటనలు హృదయానికి హత్తుకొని మధురస్మృతులుగా నిలిచి ఉంటాయి. ఇంక అవి దైవానికి సంబంధించినవి అయితే, అన్నీ అద్భుతాలే కదా! అమ్మ అవ్యాజప్రేమతత్త్వాన్నీ, విశ్వమాతృత్వాన్నీ తెలియపరిచే ఎన్నో సంఘటనలను చిన్నతనంలోనే ప్రత్యక్షంగా దర్శించిన భాగ్యశాలిని శ్రీవల్లిగారు.

అమ్మ అనుంగు బిడ్డలలో ఒకరు డాక్టర్ నారపరాజు శ్రీధరరావుగారు. ఆయన వృత్తి వైద్యరంగం. ప్రవృత్తి కవితా వ్యాసంగం. తాను కవిత్వం వ్రాయడానికి అమ్మ అనుగ్రహమే కారణమని చెప్తూ

**'నేను నేర్చిన విద్యను నీదు పాద**

**ములకు మంజీరముగఁ జేయగలిగినాను'** అంటూ ఎన్నో కావ్యపుష్పాలను అమ్మ పాదములకు సమర్పించిన కవిరాజు శ్రీధరరావుగారు. అంతేకాదు.

**'కోటిజన్మల కొకసారి కూడఁజూడ**

**వలను గానట్టి నినుఁ జూడ గలిగినాను',**

**'అమ్మే దైవము నాకు, నమ్మనుడులే ఆనందమార్గమ్ము లా**

**అమ్మను గూర్చిన మాటలే సకల విద్యాభ్యాసముల్'** అంటూ అమ్మను సేవించి, తరించిన ధన్యజీవులు. 'ఆత్మా వై పుత్ర నామాసి' అనే కాదు, 'ఆత్మా వై పుత్రికా నామాసి' అని కూడా అనవచ్చు – అన్నదానికి చక్కని ఉదాహరణంగా కన్పిస్తారు శ్రీవల్లిగారు.

ఆ సంస్కారాన్ని పుణికి పుచ్చుకున్న శ్రీవల్లిగారు అమ్మ పట్ల భక్తి విశ్వాసాలతో పెరిగి పెద్దవారయి, అటు చదువులోనూ రాణించి, అధ్యాపక వృత్తిలో ప్రవేశించి ఒక వంక ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తిస్తూ, మరొక వంక గృహిణిగా తన ధర్మాలన్నింటినీ ఆచరిస్తూ ఆదర్శంగా నిలుస్తున్నారు.

**'పుత్రి యోగ్యమైన పుట్టినిల్లు మరియు**

**మెట్టినిల్లు మిగుల మెరయుగాదె'** అని పెద్దలు చెప్పినట్లుగా ఇటు పుట్టినింటికి, అటు మెట్టినింటికి పేరు తెచ్చిన ధన్యజీవన శ్రీవల్లిగారు.

'వింటే విమర్శ కాని కంటే లేదు; విన్నవాడు విమర్శిస్తాడు, కన్నవాడు వివరిస్తాడు' అని అమ్మ చెప్పినట్లుగా ఈ గ్రంథంలో శ్రీవల్లిగారు ప్రస్తావించిన ఎన్నో అంశాలు ఆమె కన్నవే కనుక ఆ సంఘటనలు చక్కగా వివరించి, కనుల ముందు సాక్షాత్కరింపజేశారు. ఎన్నో సంఘటనలకు ప్రత్యక్షసాక్షి అయిన శ్రీవల్లిగారు తాము పొందిన అనుభవాలను, అమ్మ జీవితచరిత్రలోని మరికొన్ని సంఘటలను లలితా సహస్రనామాలకు అన్వయిస్తూ ఆమె దర్శించిన నక్షత్ర మాలికే ఈ గ్రంథం.

వాల్మీకి మహర్షి, దేవర్షి అయిన నారదుణ్ణి

**'కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్**

**ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో ధృఢవ్రతః....''** అని అడిగిన ప్రశ్నకు సమాధానంగా శ్రీరాముడే నిలిచి, రామాయణ మహాకావ్యం ఆవిర్భవించింది. అలాగే, ఆ పరాశక్తే మానవాకృతి ధరించి ఈనాడు అమ్మగా అవతరించడం వలన మరొక 'రామా'యణం ఉదయించింది. లలితా సహస్రంలో ఏ నామాన్ని చదువుతున్నా అది అమ్మకే అన్వయిస్తూ ఉంటుంది.

లలితా సహస్రనామాలకు అర్థం తెలియడం వేరు. పరమార్థం గోచరించడం వేరు. ప్రతి నామానికీ అమ్మ జీవితచరిత్రలోని సంఘటనలతో సమన్వయం చేయాలంటే అమ్మ తత్త్వాన్ని జీర్ణం చేసుకోవాలి. శ్రీవల్లిగారు లలితా సహస్రనామాలను పారాయణం చేయడమే కాదు, పరమార్థాన్ని గ్రహించినవారు. అలాగే అమ్మతో ఎంతో అనుబంధం ఉండి, అమ్మతత్త్వాన్ని అవగాహన చేసుకున్నవారు. కనుకనే ఈ గ్రంథాన్ని లక్ష్య లక్షణ సమన్వయాత్మకమయిన ఒక శాస్త్ర గ్రంథంగా తీసుకువచ్చారు. చెప్పేది శాస్త్రవిషయమైనా సరళసుందరంగా వ్రాయడమే శ్రీవల్లిగారి ప్రత్యేకత. ఈ గ్రంథంలోని కొన్ని వ్యాసాల ద్వారా అనంతమైన అమ్మతత్త్వంలోని మాధుర్యాన్ని ఆస్వాదిద్దాం.

'గోమాతా' అనే వ్యాసంలో అమ్మసర్వమాతృత్వాన్ని ఆవిష్కరించే సంఘటనలు వివరిస్తూ మాతృతత్త్వంలోని గొప్పతనాన్ని ప్రస్తావించారు శ్రీవల్లిగారు. ఒక స్త్రీ తల్లిగా మారినపుడు ఆమెలో ఆశ్చర్యకరమైన మార్పు వస్తుంది. అంతకు ముందు ఏ విషయాలనైతే అసహ్యించుకుంటుందో తన బిడ్డ దగ్గరకు వచ్చేటప్పటికి వాటినే ఏ మాత్రం అసహ్యంలేకుండా చేస్తుంది.

ఈ స్థితి ఏ తల్లికైనా తన బిడ్డల వరకే పరిమితం. కానీ 'నీకు, మీకు, అందరికీ, అన్నింటికీ అమ్మను' అని చెప్పిన అమ్మలో ఈ స్థితి ప్రతి ప్రాణిపట్ల కన్పిస్తుంది. అదే విశ్వమాతృత్వం. అంతేకాదు 'మీరంతా నేనే, ఇదంతా నేనే' అని విశ్వమంతా తననే దర్శించిన అమ్మకు జుగుప్స అనేదే లేదు. పందిపిల్లను కూడా పసిపిల్లగా భావించి లాలించేది.

**'విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని**

**శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః'** అని భగవద్గీతలో చెప్పినట్లుగా అమ్మసమదృష్టిని వ్యక్తం చేస్తుంది ఈ వ్యాసం.

అమ్మతత్త్వాన్ని తెలియచేసే నామాలలో ప్రేమరూపా, ధర్మాధారా అనే నామాలను తీసుకుందాం. ఈ గ్రంథంలో ఇవి రెండు వ్యాసాలుగా రూపుదిద్దు కున్నాయి. సాధారణ దృష్టితో చూస్తే ఈ రెండు నామాలకు కొంత వైరుధ్యం ఉన్నట్లుగా అన్పిస్తుంది. ఎందుకంటే ప్రేమ మధురమయింది, మహత్తరమైంది అయినా స్వార్థం మితిమీరితే అదేప్రేమ గుడ్డిది కూడా అవుతుంది. మహాభారతంలో ధృతరాష్ట్రుడే దీనికి ఉదాహరణగా కన్పిస్తాడు. ధృతరాష్ట్రుని పుత్రప్రేమే అక్కడ ధర్మానికి గొడ్డలిపెట్టు అయింది. కనుక ప్రేమ, ధర్మం విరుద్ధమైనవిగా భాసిస్తాయి. కానీ, నిదానించి ఆలోచిస్తే వైరుధ్యం ఏమీ ఉండదు. ఈ రెండూ పరస్పర ప్రేరకంగానూ పూరకంగానూ కన్పిస్తాయి.

రామాయణమే తీసుకుందాం. శ్రీరాముని ధర్మనిష్ఠ అద్భుతమైనది. ధర్మా చరణ ఆయనకు ప్రాణం కంటే మిన్న. అందుకోసం ఎటువంటి త్యాగానికయినా వెనుకాడడని రామాయణమే మనకు చెప్తున్నది.

**'అనన్యాహి మయా సీతా భాస్కరేణా ప్రభాయథా'**

'సూర్యుని కంటె ప్రభ వేరు కానట్లు సీత నాకంటె వేరు కాదు' అన్న రాముడే, లోకం కోసం ఆమెను పరిత్యజించడం జరిగింది. శ్రీరామునికి సీత పట్ల ప్రేమ ఉన్నా, ధర్మానికే ప్రాధాన్యం ఇచ్చాడేమో అన్పిస్తుంది. ఇటువంటి సన్నివేశాలలో ప్రేమకు ధర్మానికి సంఘర్షణ కలుగుతుంది. కానీ ఒకింత ముందుకు వెళ్ళి ఆలోచిస్తే రాముని ధర్మాచరణకు లోకం పట్ల ఉన్న ప్రేమే కారణం అని తెలుస్తుంది. ఇక్కడ సీతాపరిత్యాగానికి కారణం లోకారాధనమే. ఒక వ్యక్తి పట్ల

ఉన్న ప్రేమ పరిమితం. అదే అపరిమితమై, లోకంలో ప్రసరిస్తే దైవత్వం అవుతుంది. ఇక్కడ రాముడు ఆచరించిన ధర్మం అపరిమితమైన ప్రేమకు పూరకమయింది. అలాగే హరిశ్చంద్రుడు భార్యాబిడ్డలపై ప్రేమ ఉన్నప్పటికీ సత్యనిష్ఠ కోసం వారికి దూరమయ్యాడు. అంటే హరిశ్చంద్రుడు సత్యమనే ధర్మాన్ని ప్రేమించడం జరిగింది. ఇటువంటి సన్నివేశాలను పురస్కరించుకునే "నాకు ధర్మాలు పనికిరావు, నాది ప్రేమతత్త్వం" అన్న ఒక అక్కయ్యతో 'అయితే ధర్మాన్ని ప్రేమించు' అని సూచన చేసింది అమ్మ.

మరొక సందర్భంలో అమ్మ 'ప్రేమకంటే ధర్మం గొప్పది' అని చెప్పింది. ధర్మాన్నే ప్రేమించు అన్న అమ్మ ఇలా అనడమేమిటి ? అన్పిస్తుంది. కానీ 'ధర్మస్య బహురూపతా' అన్నట్లుగా దేశకాలపరిస్థితులను బట్టి ధర్మస్వరూపం ఉంటుంది. భగవంతునికి అందరూ బిడ్డలే. అందరి మీద ప్రేమ సమానమే. కానీ లోక కంటకులయిన రాక్షసులను సంహరించక తప్పలేదు. అక్కడ వారిని శిక్షించడమే ధర్మం. అక్కడ శిక్షకూడ శిష్టరక్షణ కోసమే. అలాగే, ఒక బిడ్డ తప్పు చేస్తే వాడిని సరి అయిన మార్గంలో పెట్టడం కోసం తల్లి శిక్షిస్తుంది. అక్కడ శిక్షణ తల్లి ధర్మం. ఇటువంటి సందర్భాలలో ప్రేమకంటే ధర్మం గొప్పది అన్న అమ్మ వాక్యం చక్కగా అన్వయిస్తుంది. కానీ ఆ తల్లి శిక్షణ వెనుక ఉన్నది ఆ బిడ్డ బాగుపడాలనే అమ్మ ప్రేమే. 'ధర్మం కోసం తల్లి కాదు. తల్లి ధర్మం చూపించడానికే' అన్న అమ్మ వాక్యాన్ని రెండు విధాలుగా చక్కగా వివరించారు శ్రీవల్లిగారు. అసలు తల్లి ధర్మం అనడంలో తల్లి అంటేనే ప్రేమ అని అర్థం. కనుక ప్రేమ, ధర్మం వేరు కావనీ, రెండింటికీ చక్కని సమన్వయం ఉందనీ, తల్లి ధర్మం నెరవేర్చడానికే అన్న అమ్మ వాక్యం మనకు తెలియపరుస్తోంది.

దైనందిన జీవితంలో మనిషికి ఎన్నో ధర్మాలుంటాయి. ధర్మాన్ని ప్రేమతో ఆచరించమని చెప్తూ, అమ్మ తనజీవితంలో తనయగా, కోడలిగా, భార్యగా, తల్లిగా వివిధ భూమికల్లో తన ధర్మాన్ని ఎంతో ప్రేమతో నిర్వర్తించి, ఆచరణాత్మకమైన ప్రబోధాన్ని అందించింది.

గృహిణులందరికీ అమ్మ పతివ్రతాధర్మాలను బోధించడమే కాక, తాను ఆచరించి చూపించిందని ఎన్నో విషయాలను ప్రస్తావించారు శ్రీవల్లిగారు 'సాధ్వీ'

అనే వ్యాసంలో. అమ్మ దృష్టిలో భర్త అంటే భావనే. కనుక 'పరధ్యానం కాదు పతిధ్యానమే' అంటూ నాన్నగారి ధ్యాసే ధ్యానంగా, భర్తే భగవంతుడు అని చెప్తూ నాన్నగారిని దైవంగా ఆరాధించి ఈనాటి కాలంలో మహా పతివ్రతలకు ప్రత్యక్ష ప్రమాణంగా నిలిచింది అమ్మ. అంతేకాదు నాన్నగారితో భేదభావం పొందని అమ్మ 'నిర్భేద'. ఒక్కటే దైవీశక్తి అమ్మగా, నాన్నగారుగా దిగి వచ్చినా నాన్నగారితో అమ్మకు ఎప్పుడూ అభేదమే. 'వివాహమంటే రెండు భిన్న అభిప్రాయాలు ఒకే చోట కలిసి ఏకత్వంగా కాలం గడపటం. అంతేకాదు ఆ రెండు భిన్నాలు ఏకమైనప్పుడే వైవాహికం' అని చెప్పింది అమ్మ. అంటే రెండు ఆత్మలలోని భేదభావాన్ని తొలగించి ఏకత్వాన్ని కలిగించే అద్వైత తత్త్వం. అమ్మ ఎప్పుడూ ఆ అభేద స్థితిలోనే ఉండేది అంటూ అమ్మను నిర్భేదగా దర్శించారు శ్రీవల్లిగారు. నాన్నగారి పాదాల చప్పుడే అమ్మ గుండె చప్పుడుగా ఉండేది. 'నాన్నగారు వచ్చినట్లున్నారు చూడండి' అని అమ్మ అన్న మరుక్షణంలో నాన్నగారు అక్కడికి వచ్చేవారు. సాధ్వీ, నిర్భేదా అనే వ్యాసాలు అమ్మ పాతివ్రత్యాన్ని, ఆత్మానుబంధాన్నీ తెలియచేస్తున్నాయి.

ఈ గ్రంథాన్ని గురించి ఒక్కసారి పర్యాలోచిస్తే అమ్మలో అన్నీ అద్భుతాలే గోచరిస్తాయి. అపూర్వమైనదీ, అనన్యసామాన్యమైనదీ అద్భుతం. అందుకే అమ్మలో కాదు, అమ్మే ఒక అద్భుతంగా కనిపిస్తుంది. అమ్మ వద్దకు వచ్చే ఆబాలగోపాలం లౌకికమైన వావివరుసలు ఎలా ఉన్నా, అందరూ అమ్మకు బిడ్డలే. ఒక్కొక్క తల్లి పిల్లలు ఒకేతల్లిపిల్లలుగా ఉండటం అద్భుతమే కదా ! అమ్మ వర్షించే వాత్సల్యం పూర్వం ఎవరూ కన్నదీ కాదు, విన్నదీ కాదు, ఊహకు కూడా అందనిది. అలాగే అమ్మ విశ్వజనీన మాతృత్వం, అమ్మ ఏర్పరచిన అన్నపూర్ణాలయం, అందరిల్లు, హైమక్కయ్యకు దైవత్వాన్ని ప్రసాదించడం, నాన్నగారి నిర్యాణ సందర్భంలో అమ్మ నిర్వర్తించిన కార్యక్రమం, భర్తచేతనే అమ్మా అని పిలిపించుకున్న పాతివ్రత్యపు పరాకాష్ఠస్థితి, అసాధారణమూ అనుపమానమూ అయిన అమ్మ జ్ఞాపకశక్తి, సర్వాధార, ధర్మాధార, నిరాధార గానే కాదు నిరాహారగా కూడా అమ్మ ఉండటం ఈ విధంగా చూస్తే అమ్మ జీవితంలో ప్రతిసంఘటనా అద్భుతమే, ప్రతిక్షణమూ అపూర్వమే. అందుకే అమ్మ అద్భుత చారిత్ర.

ఏదైనా ఒక విశిష్ట విషయానికి మరో ప్రత్యేకత తోడైతే బంగారానికి పరిమళం అబ్బినట్లు అని అంటూ ఉంటాం. అలాగే ఈ గ్రంథంలోని వ్యాసాలకు ముందుగా వ్యాససారమంతా ఇమిడ్చి సంక్షిప్త సుందరంగా శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు వ్రాసిన పద్యాలు ఈ గ్రంథానికి ఒక శోభను, పరిపూర్ణత్వాన్ని కలిగించాయి అనడంలో సందేహంలేదు. శ్రీవల్లిగారి జీవన సహచరులు శ్రీమన్నారాయణమూర్తిగారు. వీరిద్దరి పేర్ల మొదట ఉన్న శ్రీ సామ్యమే వీరి అభేదస్థితిని తెలియజేస్తున్నది. శ్రీ శబ్దానికి అనేక అర్థాలుంటాయి కదా ! ఉన్నతస్థితి, ఉత్తమత్వము, శోభ, కీర్తి, సరస్వతి, శ్రీ అనే రాగము మొదలైన అర్థాలున్నాయి. ఆ అర్థాలనుసార్థకం చేస్తూ ఈ దంపతులు ఉన్నతులై, ఉత్తములై పరస్పర యశఃకారకులై, అనురాగ సంపన్నులై, సరస్వతీ స్వరూపులై శోభిల్లుతూ ఇరు కుటుంబాల కీర్తిప్రతిష్ఠలను ఇనుమడింపచేస్తున్నారు.

లలితాసహస్రనామం భక్తితో పఠించేందుకు స్తోత్రంగానూ, పరమార్థ చింతనతో పరిశీలించేందుకు శాస్త్రంగాను ఉపకరిస్తుందని పెద్దలమాట. శాస్త్రానికి ప్రమాణం ముఖ్యం. కనుక ఈ నామాలను వివరించటానికి ప్రామాణికత కోసం శ్రీమల్లాప్రగడ శ్రీరంగారావుగారి భారతీ వ్యాఖ్యను ఆధారంగా తీసుకున్నారు శ్రీవల్లిగారు.

ఈ విధంగా శ్రీరంగారావుగారి భారతీవ్యాఖ్య, శ్రీమన్నారాయణమూర్తి గారి పద్యాలు, శ్రీవల్లిగారి వ్యాసాలు, వ్యాసాల చివర శ్రీధరరావుగారి అంతరంగాన్ని ఆవిష్కరించే పద్యాలు గల ఈ గ్రంథం చతుర్ముఖమై, మనలను అంతర్ముఖులను చేసి ఆ లలితాపరమేశ్వరి అనుగ్రహం కలిగిస్తుందని విశ్వసిస్తూ, ఇటువంటి అద్భుతరచనలు శ్రీవల్లిగారి కలం నుండి మరిన్ని వెలవడాలని ఆకాంక్షిస్తూ, ఈ అవకాశాన్ని కల్గించినందుకు కృతజ్ఞతలు తెలియచేస్తూ....



"మరుగే నా విధానం" - అమ్మ

# స్వభావ మధుర

డా॥ఉప్పల వరలక్ష్మి,
విశ్రాంత ఆంధ్ర అధ్యాపకులు,
ఆర్ట్స్ & సైన్సు కళాశాల, బాపట్ల

**చెరగని చిరునవ్వే ఆమె చిరునామా**
**తరగని చెలిమికలిమి ఆమె వీలునామా**
**ఆమె హృదయం ఆత్మీయతా సింధువు**
**సన్నిహితులందరికీ ఆమె ఆప్తబంధువు.**

అనురాగం ఆప్యాయతలు కలబోసుకున్న ఆ మాట తీరు స్నేహపరిమళాలను వెదజల్లే పూలసౌరు. రాజీలే తప్ప రాజకీయాలు తెలియని మల్లెలాంటి మనస్సు. ఇంటా బయటా కర్తవ్యపాలనమే ఆమెకు తెలిసిన తపస్సు. పూలలో దారంలా ఇమిడిపోయే స్వభావం, బాధ్యతలను నిర్వహిస్తూ అంతర్వాహినిలా సాగే సంస్కారం శ్రీవల్లిగారికే సొంతం.

శ్రీవల్లిగారి పుట్టినిల్లు కవితలకు కొలువు. మెట్టినిల్లు ఆర్షవిద్యాసంస్కృతికి, ఆధ్యాత్మిక భావనలకు నెలవు. వ్యాకరణ వైదుష్యం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య. చిన్నారి పొన్నారి చిరుతప్రాయంలోనే తండ్రిగారైన డాక్టర్ శ్రీధరరావుగారితో కలిసి అమ్మను దర్శించుకున్న అదృష్టం ఆమెది. ఇలవేల్పు అయిన అమ్మను తమ యింటిలో ప్రత్యక్షంగా పూజించుకునే సువర్ణావకాశం వారిది. ఏ పూర్వపుణ్యమో మరి ? బుడి బుడి నడకలు నేర్చే దశలో వేలుపట్టుకుని నడిచిన ఆచేతిని వీడకుండా కన్నవారికి చేదోడై నిలిచి కడదాకా వారి బాధ్యతను వహించిన ధన్యత శ్రీవల్లిగారిది.

చిన్నతనంలోనే శ్రీధరరావుగారి లాలిపాట లాలిత్యాన్ని, హైమక్కయ్య లోని అకారణ కారుణ్యాన్ని కలబోసుకుని, స్వరూపలలితగా, స్వభావ మధురగా రూపుదిద్దుకున్నారు శ్రీవల్లిగారు. మల్లాప్రగడ వారింట తరతరాలుగా పరిఢవిల్లిన ఆర్షవిజ్ఞాన వైభవం, ఆధ్యాత్మిక చింతనా ప్రభావంతో ఆమె ఆలోచనా స్రవంతి కొత్తపుంతలలో సాగింది. పరిణతి చెందిన యీ దశలో సమున్నతమైన రెండు

పర్వత శ్రేణుల మధ్య మందగమనంతో ముందుకు సాగే నదిలా దర్శనమిస్తుంది శ్రీవల్లిగారి వ్యక్తిత్వం. పరిసరాలను పచ్చని పొలాలుగా, పవిత్ర తీర్థాలుగా మార్చే అద్భుత భావవిన్యాసాలు శ్రీవల్లిగారి వ్యాసాలు. అలనాటి అనుభవాలు అనుభూతులుగా రూపుదాల్చి, అక్షరరూపం ధరించటానికి శ్రీమల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తిగారి సాహచర్యమే ప్రబలమూ, ప్రధానమూ అయిన కారణం అని నాకు అనిపిస్తోంది. శ్రీవారి ప్రతిభాపాటవాలలో అర్థాంగికి ఆ మాత్రం భాగస్వామ్యం ఉంటుంది కదా !

శ్రీవల్లిగారు 'అద్భుతచారిత్ర' అనే యీ గ్రంథాన్ని తారావళితో తళుకులీనే నక్షత్రమాలికగా జగన్మాతకు సమర్పించారు. ఆ హారంలో జిలుగు వెలుగులు వెదజల్లే వజ్రశలాకలే శ్రీ మల్లాప్రగడవారి తేటగీతి పద్యాలు. లలితాదేవి నామాలకు వ్యాఖ్యానంలా విశ్లేషణాత్మకంగా సాగిన శ్రీవల్లిగారి వ్యాసరచనకు ముందు సంక్షిప్తరూపంగా, సూత్రప్రాయంగా పద్యం దర్శనమిస్తుంది. శ్రీ మల్లాప్రగడ వారి పద్యం సర్వాలంకారశోభితయైన వ్యాసలక్ష్మి నుదుట దిద్దిన కుంకుమ తిలకమై ఇంపు నింపుతోంది. 'అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు" అన్న మకుటం మకుటాయమానమై నిలుస్తుంది. శ్రీవల్లిగారు ప్రతివ్యాసాన్ని బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావుగారి భారతీ వ్యాఖ్యతో ప్రారంభించి - నిర్వచనం, విశ్లేషణ, సమన్వయం. సందేశం / అభ్యర్థన అనే క్రమంతో సర్వలక్షణ లక్షితంగా తీర్చిదిద్దారు. వ్యాసాల చివర అనర్ఘరత్నాలవంటి డాక్టర్ శ్రీధరరావుగారి పద్యాలు ముద్రించటం సహృదయులను ఎంతగానో అలరించింది. వ్యాసాలు ఆ జగన్మాతకు శ్రీవల్లిగారు సమర్పించిన వలిపెంపు జిలుగు పట్టుచీరలయితే కొసమెరుపులతో శ్రీధరరావుగారి పద్యాలు వాగ్దేవికి గరగరల్ పచరించిన సరిగంచులే.

ఈ వ్యాసాలలో ఉదాహరించిన సంఘటనలు చాలాభాగం శ్రీవల్లిగారి స్వానుభవాలే. 'విబుధ జనుల వలన విన్నంత కన్నంత తెలియవచ్చినంత తేటపరతు' అన్న పోతన మహాకవిలోని వినయసంపద, భక్తిప్రపత్తులు శ్రీవల్లిగారిలో మనకు కనిపిస్తాయి. రచయిత అంతరంగానికి అద్దంపట్టేవి రచనలు. నిరాడంబరత, నిర్మల హృదయం, నిశ్చలభక్తి మూర్తీభవించిన శ్రీవల్లిగారి 'ఆత్మీయత' ప్రతిపదంలో ప్రస్ఫుటమవుతుంది ఈ వ్యాసాలలో. త్రికరణశుద్ధిగా తాను నమ్మిన జగన్మాత

తత్త్వాన్ని అందరికీ అనుభవగోచరమయ్యేలా చెప్పాలనే రచయిత్రి తపన, తత్త్వ కథనంతో సంతృప్తి చెందక, ఆచరణ యోగ్యమైన సందేశాన్ని అందించాలనే తహతహ, అచ్చపు చీకటిలో గృహవ్రతులై చరిస్తున్నామనే ఆర్తి, జీవుని వేదన, ఆత్మ నివేదన ఈ రచనలో అంతర్లీనంగా గోచరిస్తున్నాయి.

'సర్వాధారా' అనే వ్యాసంలో శ్రీవల్లిగారు 'నేను నేనైన నేను' అనే అమ్మ చిహ్నాన్ని (లోగో) అమ్మతత్త్వానికి ప్రతీకగా సంభావించి, అక్షరమైన ఆ తత్త్వాన్ని వ్యాఖ్యానించిన తీరు అపూర్వం, అనన్యసామాన్యం. ఆర్షవిద్యావైదుష్యానికి సహజ సరళమైన శైలిని జోడించి సమన్వయాత్మకంగా రచన సాగించారామె. శాస్త్రీయమైన అంశాన్ని సామాన్య పాఠకలోకానికి అందించాలంటే భగీరథ ప్రయత్నం అవసరమయింది. అదే వ్యాసంలో మాతృశ్రీని – శ్రీమాతగా దర్శింపజేసిన తీరు పాఠకుల హృదయాలలో సద్భావనా సంపద లొలికించేదిగా ఉంది. 'ప్రేమరూపా' అనే వ్యాసంలో 'సర్వసమర్పణ భావమే ప్రేమ' అన్న నిర్వచనం, "రూపంలేని ప్రేమకు ఆకారమే అమ్మ", "అమ్మప్రేమ ఒకవాక్యానికో, వ్యాసానికో, గ్రంథానికో పరిమితమైంది కాదు. అది అంతూ అదుపూ లేని ఒక ప్రేమ రసాంబుధి" అన్న అభివ్యక్తి, 'నిర్వాణ సుఖదాయిని' అనే వ్యాసంలో "మంచి నడవడికతో, పరోపకారబుద్ధితో భగవచ్చింతనలతో జీవనయానం సాగించేవారి నిర్యాణమే నిర్వాణం" అన్న ప్రవచనం, 'అమ్మను ప్రేమించటమంటే ప్రేమను పదిమందికి పంచటమే' అన్న సందేశం – ఇలా శ్రీవల్లిగారి వాగ్వైదగ్ధ్యానికి, రచనా సామర్థ్యానికి మచ్చు తునకలయిన ఉదాహరణలు ఎన్నో! విశ్వజనీనమైన అమ్మ ప్రేమతత్త్వాన్ని వివరిస్తూ "అది భాషకు అందనిది, భావానికి లొంగనిది" అన్నారు శ్రీవల్లిగారు. జంటలుగా సాగే ఇలాంటి వాక్యవిన్యాసాలు కోకొల్లలు. సులలితమైన శ్రీవల్లిగారి వచనరచనలో భావం, భాష చెట్టపట్టాలు వేసుకుని సంచరిస్తూ, పాఠకులను అబ్బురపరుస్తాయి.

'ధర్మాధారా' అనే వ్యాసంలో స్త్రీలు భర్తక్షేమంకోసం సౌభాగ్యం కోసం చేసే నోములూ, వ్రతాలు ఎన్నో ఉన్నాయి. కాని పురుషులకు మాత్రం ఏకపత్నీ వ్రత మొక్కటే వ్రతమని అమ్మ మాటను సందర్భోచితంగా గుర్తు చేయటం లోని చతురత గుర్తించవలసిందే. 'కన్నతల్లే కంచంలో ఇంత అన్నం పడేసి ఏ

# మాతృదేవోభవ

ఎం.నందకిశోర్

"అమ్మ"ను గురించి వ్రాసిన మా అమ్మను గురించి వ్రాయడం నాకు చాలా సంతోషంగా ఉంది. మా అమ్మ వ్రాసిన వ్యాసాలకు ప్రథమ శ్రోతను నేనే. మొదట్లో మా అమ్మ వ్రాసిన వ్యాసం విని ఆశ్చర్యపోయాను. ఆ తరువాత ఆనందించాను. ఈ వ్యాసాల్లో "అమ్మ"ను గురించిన సంఘటనలను మా అమ్మ వివరిస్తూ ఉంటే ఒళ్ళు గగుర్పొడిచేది. మా అమ్మ అంటూ ఉంటుంది– "ఇది నేను వ్రాసినది కాదు, అమ్మే వ్రాయించింది" అని. లలితా సహస్ర నామావళిని 'అమ్మ'కు అన్వయించటం ఒక అద్భుతమైన ఆలోచన అని నాకు అనిపించింది. ఆ మాటే మా నాన్నగారితో అన్నాను. "అద్భుతమే కాదు, అపూర్వం కూడా" అన్నారు ఆయన.

మా అమ్మదృష్టిలో 'అమ్మ' చరిత్ర అద్భుతం. నా దృష్టిలో ఈ రచనే ఒక అద్భుతం. మొదట్లో మా అమ్మ వ్రాసిన వ్యాసాలు నాకు అంతగా అర్థమయ్యేవి కావు. కానీ నాకు చదివి వినిపించేటప్పుడు మా అమ్మ కళ్ళలో తపనను చూసి నేను చాలా ఆనందాన్ని పొందాను. క్రమంగా ఆ వ్యాసాలు నాకు కూడా అర్థమయ్యాయి. ఆ తర్వాత నేను ఆ వ్యాసాల్లోని అంతరంగాన్ని తెలుసుకొని చాలా సంతోషించాను.

ఈ వ్యాసాలు వ్రాయటానికి మా అమ్మ చాలా పుస్తకాలు చదివింది. ఎంతో ఆలోచించింది. రాత్రింబవళ్ళు కూర్చుని వ్రాసేది. ప్రతి నామానికీ సరైన సన్నివేశాలు, సంఘటనలను తీసుకుంది. ఇలా కష్టపడినందువల్లనేమో మా అమ్మ విద్యార్థిదశలోనే బంగారు పతకం అందుకుంది.

ఒక్కొక్క వ్యాసం వ్రాస్తున్నకొద్దీ శైలిలో సరళత్వం, వ్యాసంలో లోతైన భావం రావడం మొదలైంది. ఇది పుస్తకంగా ప్రచురించాలనే ఆలోచన మా అమ్మకు రావటం నాకు చాలా ఆనందాన్ని కలిగించింది.

మా అమ్మ వ్రాసిన ఈ వ్యాసాల సంకలనం ఒక అందమైన చిత్రం. తన మనస్సునే "కాన్వాసు"గా చేసుకొని, మా అమ్మ వేసిన "అమ్మ" బొమ్మ ఇది. మా

తాతగారి భారతీవ్యాఖ్య, మరో తాతగారి 'నివేదన' పద్యాలు ఆ బొమ్మకు అద్దిన అందమైన రంగులు. వ్యాసం మొదట్లో మా నాన్నగారు వ్రాసిన పద్యం "ఫొటోకి ఫ్రేమ్" లాంటిది.

నాకు మా అమ్మ దీవనలు, "అందరి అమ్మ" ఆశీస్సులు కావాలని కోరుకుంటున్నాను.



అమ్మ మయమైన యీ విశ్వమందు నెందు
గానవే యమ్మ నిది యేమి కారణంబొ ?
అమ్మయంబైన యాద్యంత మందు కూడ
అమ్మ కనుపించునా ? యూహ కంద దద్ది.

సర్వవిధముల దివ్యతేజమున వాసి
సుగుణగణరాశి ప్రేమనిస్తుల వికాసి
నిత్య సౌహార్ద వారాశి నిగమ భాసి
చూడగాంతుము జిల్లెళ్ళమూడి యందు.

- డా॥నారపరాజు శ్రీధరరావు

# అమ్మా!

నా గానములో నీ నామమునే
నా భావనలో నీ రూపమునే
నా ఊహలలో నీ లీలలనే
నిలుపుకొంచు నిను కొలిచితి నమ్మా! ॥నా గాన॥

నా మనసే ఒక మల్లియగా
నా శిరసే ఒక పూర్ణఫలముగా
నా సర్వస్వమునూ కానుకగా
నివేదించి నిను వేడితి నమ్మా! ॥నా గాన॥

నా తలపులు, నా మమతలు
నా జీవితమూ, జీవనము
నా అనురాగము నీ కోసమే
పదిలపరచి నిను నమ్మితి నమ్మా! ॥నా గాన॥

- శ్రీవల్లి

భారతీయులు ప్రతినిత్యం పారాయణం చేసి, పరవశిస్తున్న విష్ణు సహస్రనామ స్తోత్రం "విశ్వం" అనే నామంతో ప్రారంభమవుతోంది. అంటే విశ్వమే విష్ణుమూర్తి స్వరూపం. అందువల్లనే విశ్వరూపసందర్శనంలో సమస్త చరాచర జగత్తూ గోచరమై, విష్ణుమూర్తిసర్వవ్యాపకత్వాన్ని స్పష్టం చేస్తోంది. విష్ణు మనోనుకూలవతి అయిన శ్రీమహాలక్ష్మి అష్టోత్తరం "ప్రకృతి" నామంతో ఆరంభమవుతోంది. ఈ కనిపిస్తున్న సకలసృష్టి అమ్మవారి రూపమే అనే భావం ఈ నామంలో దాగి ఉంది. అంటే, కంటికి కనిపిస్తున్న సకలచరాచర జగత్తునూ లక్ష్మీనారాయణ స్వరూపంగా భావన చేయమని అంతరార్థం. అందుకే, తెలుగుల పుణ్యపేటి పోతనామాత్యుడు "ఇందు గల డందు లేడని సందేహం"వద్దు అన్నాడు.

"శ్రీమాత యంత్రం శ్రీచక్రం. ఇందులో తొమ్మిది చక్రాలు ఉంటాయి. శ్రీ చక్రం సకల చరాచరాత్మకమైన జగన్మాత విరాడ్రూపం. అదే బ్రహ్మాండం" - భారతీవ్యాఖ్య.

"అమ్మ" విశ్వజనని మాత్రమే కాదు. విశ్వరూపం కూడా తానే అయి ఉంది. "ఈ సృష్టి అనాది, నాది" అని చెప్పిన "అమ్మ" మనల్ని తన శిష్యులుగానో, భక్తులుగానో అంగీకరించలేదు. బిడ్డలుగా సంభావించింది. అంతేనా! "మీరంతా నా అవయవాలు" అన్నది. "మీరు కానిది నేనేదీ కాదు నాన్నా!" అన్నది. మీరు అంటే కేవలం మానవులమయిన మనం మాత్రమే కాదు. స్థావర జంగమాత్మకమైన ఈ సృష్టియావత్తూ "అమ్మ" స్వరూపమే. అందుకే, జగన్మాత అంటే "జగత్తుకు తల్లికాదు, జగత్తే తల్లి" అని విశదీకరించింది "అమ్మ". "అంఆ" అని సంతకం చేసి, "అమ్మ" అంటే అంతులేనిది, ఆధారమైనది అని వివరించింది. "నేను నేనైన నేను" అని చమత్కారంగా చెప్పి, "అన్ని నేనులూ తానే" అని విశ్లేషించింది.

"అమ్మ" సంకేతంలో మధ్యలో ఉన్న చిన్న బిందువు - బిందురూపంలో ఉన్న అమ్మ. ఆ బిందువు చుట్టూ ఉన్న తొమ్మిది వలయాలు శ్రీ చక్రంలోని తొమ్మిది చక్రాలకు సంకేతం. ఆ వలయాలు ఈ సృష్టికి ప్రతీకలు. ఈ సృష్టి ఒక్కసారిగా జరిగి ఆగిపోలేదు. ఇంతకు ముందూ ఉంది. ఇక ముందూ ఉంటుంది. అందుకే "అమ్మ" - "సృష్టికి నాశనం లేదు" అని స్పష్టంగా చెప్పింది. అయితే, కాలచక్రభ్రమణంలో ఎన్నో యుగాలు, కల్పాలు కదలిపోయాయి, కాలగర్భంలో కలిసిపోయాయి. అయినా, సృష్టిమాత్రం ఆగలేదు. సముద్రంలోని

అలలవలె ఆగకుండా, అది అలా అలా జరుగుతూనే ఉంటుంది. ఎందువల్ల ? సృష్టికి ఆధారమయిన "అమ్మ" బిందురూపంలో, ఏ మార్పూ లేకుండా స్థిరంగా ఉన్నది కనుక. ఆదిమధ్యాంతరహితంగా, అన్నింటికీ ఆధారంగా, బిందురూపిణిగా ప్రకాశిస్తున్న "అమ్మ" - బిందుమండలవాసిని - అని "అమ్మ" చిహ్నం వివరిస్తోంది.

"గోపనమంటే రక్షించడం. విష్ణువుచేత సమస్త భువన సంరక్షణ సాగింపజేసే లలితాదేవి - గోప్త్రి. భూమిని రక్షించేవాడు గోవిందుడు. సమస్త భువనపాలనం సాగించే గోవిందుని రూపంలో ప్రకాశించే దేవి - గోవిందరూపిణి"- భారతీవ్యాఖ్య.

అర్కపురిలో అలరారే అనసూయమ్మ గోప్త్రి, గోవిందరూపిణి. గోపనమంటే రక్షించటం. "అమ్మ" తన బిడ్డలను ఎప్పటికప్పుడు ఎలా రక్షిస్తూ, అనుగ్రహిస్తూ ఉన్నదో మనకు అనుభవంలోని విషయమే. కనుక "అమ్మ" గోప్త్రి. ఈ భావమే "అమ్మ" చిహ్నంలో మనకు సుస్పష్టంగా విశదమవుతుంది.

భువనరక్షణభారాన్ని శ్రీమాత, శ్రీమహావిష్ణువుకు అప్పగించింది. అయితే, ఆ భువనరక్షణకు కావలసిన శక్తిని విష్ణుమూర్తిలో నిక్షిప్తం చేసి శ్రీలలిత గోవిందరూపిణిగా భాసించింది. శ్రీమన్నారాయణమూర్తి సామాన్యుడు కాడు. సహస్రశీర్షుడు, సహస్రపాదుడు, సహస్రాక్షుడు, సహస్రభుజుడు. అయినా, శ్రీమహావిష్ణువు సహస్ర ఫణులతో విరాజిల్లే ఆదిశేషుని రూపం ధరించి, తల్లి తనకు అప్పగించిన భువనభారమనే గురుతర బాధ్యతను నెత్తి కెత్తుకున్నాడు. ఈ భావాన్నే 'సౌందర్యలహరి'లో శంకరాచార్యులవారు "వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం" అని విశ్లేషించారు.

'గోప్త్రి,' 'గోవిందరూపిణి' నామాలకూ, "అమ్మ" చిహ్నానికీ సంబంధం ఏమిటీ ? అనిపిస్తుంది. కొంచెం పరిశీలిస్తే, చక్కని సమన్వయం కనిపిస్తుంది. "అమ్మ" సంకేతంలో వలయాలకు పైన రెండు చివరలా రెండు ఫణిరాజులు విరాజిల్లుతూ ఉంటాయి. ఆ రెండు ఫణిరాజులూ ఆదిశేషుని మొదటి, చివరి శిరస్సులుగా భావించాలి. ఎందుకంటే, సహస్రఫణులతో బ్రహ్మాండ భాండాన్ని మోస్తున్నప్పుడు, అన్ని తలలూ కనిపించే అవకాశం లేదు. బ్రహ్మాండ భాండం వాటిని కప్పివేస్తుంది కనుక. చివరగా ఉన్న రెండు తలలు మాత్రం కనిపించే వీలు ఉంది. "అమ్మ" చిహ్నంలోని బ్రహ్మాండభాండం "నేను నేనైన నేను' అనే

వాక్యం. అక్షరరూపంలో ఉన్న అమ్మ స్వరూపమే ఆ వాక్యం. అంటే, ఆ సప్తాక్షరాలూ "అమ్మ" విరాడ్రూపానికి నిలువుటద్దాలు. "నేను నేనైన నేను" అనే వాక్యం బ్రహ్మాండం అనసూయాదేవికి అక్షర రూపం. ఆ బ్రహ్మాండాన్ని మోస్తున్న ఆదిశేషుని తొమ్మిదివందల తొంభై ఎనిమిది (998) తలలను అది కప్పివేయగా, చివర ఉన్న రెండు ఫణిరాజులూ ఆదిశేషుని మొదటి, చివరి శిరస్సులు. ఆ దృశ్యం కన్నుల ముందునుంచి అదృశ్యంకాకముందే, బ్రహ్మాండ భాండంగా ఉన్న "అమ్మ" రూపాన్ని భావన చేసుకుంటే, ఒక దివ్యమయిన దృశ్యం కనువిందు చేస్తుంది. ఆ బ్రహ్మాండ భాండాన్ని మోయిస్తున్నదీ, మోస్తున్నదీ "అమ్మే"అని. అంతేకాదు, మోయబడుతున్న ఆ బ్రహ్మాండభాండం కూడా "అమ్మే"అని మనకు అవగతమవుతుంది. అప్పుడే "అమ్మ" గోప్త్రి, గోవిందరూపిణిగా సాక్షాత్కరించి, మనకు అలౌకికానందానుభూతిని అనుగ్రహిస్తుంది.

ఇక "అమ్మ" సంకేతంలో వలయాలకు క్రింద మధ్యగా "మాతృశ్రీ" నామం కన్నులపండుగ చేస్తుంది. ఇందులోని చివరి 'శ్రీ'ని 'మాతృ' శబ్దానికి ముందు చేరిస్తే 'శ్రీమాతృ' శబ్దం ఏర్పడుతుంది. 'శ్రీమాతృ' శబ్దం ప్రథమావిభక్తి రూపమే లలితాసహస్రనామస్తోత్రంలోని మొదటి నామం 'శ్రీమాతా'. ఎంత గోప్యంగా "అమ్మ" తాను 'శ్రీమాత' అనే విషయాన్ని తెలియ జెప్పిందో కదా ! మాతృశ్రీయే శ్రీమాత. అమ్మ సంకేతంలో 'మాతృశ్రీ' నామానికి ఒక ప్రక్క మూడు నక్షత్రాలు, రెండవ ప్రక్క మూడు నక్షత్రాలు – మొత్తం ఆరు నక్షత్రాలు కనిపిస్తున్నాయి. ఈ ఆరు నక్షత్రాలూ లలితాసహస్రనామాలలోని ఐదు నామాలను స్ఫురింపజేసేవిగా ఉన్నాయి. ఈ ఐదునామాలూ శ్రీమాత ఎవరో, ఎలా ఉంటుందో, ఎక్కడ ఉంటుందో వివరిస్తున్నాయి. అందువల్ల "అమ్మ" ఆ ఐదునామాలలోని లలితాస్వరూప నిరూపణకు ప్రతీకలుగా ఈ ఆరునక్షత్రాలనూ ఎంపిక చేసుకుంది. ఈ ఐదు నామాలలోని అర్థాన్ని ముందుగా గ్రహిస్తే, ఈ నక్షత్రాల ప్రాముఖ్యం తేట తెల్లమవుతుంది. 'భారతీవ్యాఖ్య' ఆధారంగా ఆ నామాలకు గల అర్థాన్ని ఇక్కడ మననం చేద్దాం.

**1. షట్చక్రోపరి సంస్థితా :** ఆరు చక్రాలను దాటి, ఏడవ చక్రంలో మెరుపుతీగలా ప్రకాశిస్తూ, అమృతం వర్షిస్తూ లలితాదేవి నివసిస్తుంది. ఆ శ్రీమాత 'షట్చక్రోపరి సంస్థితా'.

"లోగో"లో ఉన్న ఆరునక్షత్రాల నడుమ ఉన్న "మాతృశ్రీ" నామమే మన "అమ్మ". ఈ ఆరు నక్షత్రాలూ షట్చక్రాలకు సంకేతం. కనుక "అమ్మ" షట్చక్రోపరి సంస్థిత"గా ప్రకాశిస్తోంది.

**2. షడంగదేవతాయుక్తా :** హృదయం, శిరస్సు, శిఖ, నేత్రం, కవచం అస్త్రం అనే ఆరు విధాలయిన అంగాలకు సంబంధించిన ఆరుగురు దేవతలు ఉన్నారు. వారితో కూడి ఉన్న శ్రీమాత 'షడంగదేవతాయుక్త'.

"లోగో"లోని ఆరు నక్షత్రాలూ ఆరువిధాలయిన అంగాలకు అధిదేవతలుగా భావిస్తే వాటితో కలిసి ఉన్న "అమ్మ" (మాతృశ్రీ) షడంగదేవతాయుక్తగా భాసిస్తోంది.

**3. షాడ్గుణ్య పరిపూరితా:** ఐశ్వర్యం, ధర్మం, యశస్సు, సంపద, జ్ఞానం, వైరాగ్యం – అనే షడ్గుణ సముదాయంతో నిండి ఉన్న శ్రీమాత 'షాడ్గుణ్యపరిపూరిత.'

"లోగో"లోని ఆరు నక్షత్రాలనూ ఆరుగుణాలుగా ఊహిస్తే, వాటిని తన ప్రక్కన (లోపల, వెలుపల అంతా తానే కనుక) కలిగి ఉన్న "అమ్మ" షాడ్గుణ్య పరిపూరితగా విరాజిల్లుతోంది.

**4. షడాననా :** పంచ భూతాత్మకమైన స్థితి కంటే అతీతమైనది, అభౌతికమైనది కనుక శ్రీమాతకు ఆరుముఖాలు. అందుకే శ్రీ లలిత 'షడానన'.

'లోగో'లోని ఆరు నక్షత్రాలనూ "అమ్మ" ఆరుముఖాలకు ప్రతీకలుగా గ్రహిస్తే, అక్కడ నెలకొని ఉన్న "అమ్మ" షడాననగా గోచరిస్తోంది.

**5. షడధ్వాతీతరూపిణీ :** అధ్వం అంటే మార్గం. దేవిని చేరుకునే ఆరుమార్గాలు షడధ్వాలు. అవి ప్రకాశ అంశ గల భువన, తత్త్వ, కళా మార్గాలు, విమర్శాంశ గల పద, మంత్ర, వర్ణ అధ్వాలు. ఈ ఆరుమార్గాలకూ అతీతంగా ఉన్న ఆత్మస్వరూపిణి అయిన శ్రీమాత 'షడధ్వాతీతరూపిణి'.

'లోగో' లోని ఆరునక్షత్రాలూ "అమ్మ"ను చేరుకోవడానికి ఆరుమార్గాలు అనుకుంటే, వాటి మధ్య ఉన్న "అమ్మ" షడధ్వాతీత రూపిణిగా ద్యోతకమవుతోంది.

ఇక్కడ "మాతృశ్రీ" నామమే "అమ్మ". ఎందుకంటే నామానికీ, నామికీ అభేదం కనుక. మాతృశ్రీ నామాన్ని అక్షర రూపంలో ఉన్న "అమ్మ"గా దర్శించాలి.

"అమ్మ" తన నామానికి ఇరుప్రక్కలా నక్షత్రాలనే ఎంపిక చేయడంలోని అంతరార్థం - నక్షత్రాలు స్వయం ప్రకాశం కలవి. "అమ్మ" స్వప్రకాశ. కనుక, తన స్వరూప, స్వభావాలను వ్యక్తీకరించటానికి స్వయంప్రకాశం గల నక్షత్రాలే సముచితంగా ఉంటాయని, 'లోగో'లో నక్షత్రాలకే స్థానం కల్పించింది "అమ్మ".

"అమ్మ" సర్వాధారగా ఈ చిహ్నంలో సాక్షాత్కరించిన తీరు అత్యద్భుతం. అవాఙ్మానస గోచరం. ఈ చిహ్నంలోని బిందువు, వలయాలు, ఫణిరాజులు, "నేను నేనైన నేను" అనే అక్షర రూపంలో ఉన్న బ్రహ్మాండ భాండం - వీటన్నింటినీ భరిస్తూ, వీటన్నింటికీ ఆధారపీఠంగా ఉన్నది "మాతృశ్రీ" నామం. అంటే "అమ్మ". కనుక, "అమ్మ" 'సర్వాధార', 'సుప్రతిష్ఠ'.

బిందుమండలవాసినిగా - ఆద్యంతరహితగా, అనాదిగా భాసించిన "అమ్మ", ఇక్కడ సమస్త భువనాలకూ, సృష్టి, స్థితి, లయాలకూ ఆధారమైన సర్వాధారగా, సుప్రతిష్ఠగా దర్శనమిస్తోంది. అర్కపురిలోని అనసూయమ్మ సర్వాధార. ఈ విషయాన్ని అమ్మే ఎన్నో సందర్భాల్లో స్పష్టం చేసింది. "జిల్లెళ్ళమూడిలో మంచం మీద కూర్చున్నదే అమ్మ కాదుగా. అమ్మ అంటే ఆదీ, అంతమూ లేనిది. ఈ సర్వానికీ ఆదీ, అంతమూ అయినది." "సర్వానికీ నేనే మూలం" అని "అమ్మ" స్వయంగా ప్రకటించింది. సర్వాధార అయిన "అమ్మ" మనకు సకలశుభాలనూ, సౌభాగ్యాలనూ ప్రసాదించుగాత ! జయహోమాతా!



**శ్రీరమ్యంబగు నాంధ్రదేశమున వాసింగన్న జిల్లెళ్ళమూ**
**డీ రంగంబున స్నిగ్ధకోమల కృపా డిండీరమున్, వాక్సుధా**
**పారావారమునై సమస్త జనులన్ పాలించి లాలించు యో**
**షారత్నంబగు అమ్మ కంజలిడెదన్ సద్భక్తి నర్చించుచున్.**

**-డా॥నారపరాజు శ్రీధరరావు**

# ౨. నిరాధారా

**అఖిల జగతికి నాధార మగుచు, తనదు**
**యునికిని దెలుప నాధార మొక్కటైన**
**కానరాని నిరాధార తానె యైన**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"శ్రీమాత నిరాధార. అంటే ఆధారం లేనిది. సమస్త ప్రపంచానికీ ఆధారం దేవి. సర్వాధార అయిన ఆమెకు మరో ఆధారం లేదు. సకల చరాచర జగత్తుకూ అధిష్ఠానరూపమైనది, ఆధారమైనది లలితాంబ. ఆమె సర్వస్వతంత్ర. ఆమెకు వేరొక ఆధారంతో పనిలేదు. అందుచేత లలితాదేవి 'నిరాధార'.

శ్రీమాత 'నిరాలంబ'. ఆలంబమంటే ఆధారం. శ్రీ లలితా సహస్రనామావళిలోని ఈ రెండు నామాలూ దేవి – 'నిరాధార' అని నిర్వచిస్తున్నాయి" – భారతీవ్యాఖ్య.

ఏ ఆధారమూ లేని వారిని గురించి చెప్పవలసి వస్తే, సర్వసాధారణంగా లోకంలో మనమనే మాట – వారు నిరాధారంగా ఉన్నారని. అయితే, ఇది వారి దయనీయస్థితికి హృదయం ద్రవించి, జాలితో మనం పలికే మాట. నిజంగానే వారికి ఏ ఆధారం లేదు. ఆధారం కోసం అలమటిస్తున్నారు. కాని, లలితాదేవిని గురించి "నిరాధార" అని చెప్పినపుడు, ఆ నామం ఆమె సర్వస్వతంత్రతను, ఆధిపత్యాన్ని తెలియజేస్తోంది. లలితాదేవికి ఏ ఆధారమూ అవసరం లేదు. లేకపోవడానికి, అవసరం లేకపోవడానికి చాల తేడా ఉంది. లేకపోవడం లేమిని తెలియచేస్తుంది. అవసరం లేకపోవడం ఆధిక్యతను ప్రకటిస్తుంది.

"అమ్మ" నిరాధారా. "అమ్మ" చెప్పిన మంత్రాక్షరాలు "అంఆ". "అం" అంటే అంతులేనిది. "ఆ" అంటే ఆధారమైనది. దేనికి ? అన్నింటికీ, అంతటికీ. సర్వాధారయైన అమ్మకు వేరొక ఆధారంతో పనేముంది? కనుక, "అమ్మ" నిరాధార. ఈ విషయం సందర్భవశాన "అమ్మ" నోటి నుంచి వెలువడిన మాటల్లోనే వ్యక్తమవుతుంది. "సర్వానికీ సర్వం ఆధారం" –ఇక్కడ "సర్వానికీ" లోని సర్వశబ్దాన్ని

సకలసృష్టికీ అన్వయించుకోవాలి. “సర్వం”అనే చోట విశ్వవ్యాప్తమై ఉన్న “శక్తి” కి సమన్వయించుకోవాలి. అంటే – స్థావర జంగమాత్మకమైన సమస్త సృష్టికీ, ఆ సృష్టిలోని అణువణువునా నిండి ఉన్న ఆదిశక్తే ఆధారం. అందుకే “అమ్మ” – చీమగా, దోమగా కూడా ఉన్నది తానే అని ప్రకటించింది. సృష్టిస్థితిలయాలకు కారణమైన (ఏకాకినీ) ఆ శక్తికి ఆధారమేదీ లేదు. ఆ శక్తి స్వాధిష్ఠాన. అంటే తనకు తానే అధిష్ఠానం (ఆధారం)గా కలది.

సర్వాధారగా “అమ్మ”ను దర్శించిన మనం, ఇప్పుడు ఆ “అమ్మ”నే “నిరాధార”గా భావన చేద్దాం. ఎందుకంటే – అన్నింటికీ తానే ఆధారమని చెప్పి, “అం, ఆ” అనే మంత్రాక్షరాలను మనకు ఉపదేశించింది “అమ్మ”. బాల్యంనుంచి మానవులకే కాక, సకల జీవరాశికీ మాతృత్వాన్ని పంచిపెట్టిన అనసూయమ్మ జగత్తుకే తల్లి. తన బిడ్డలను తరింపజేయడానికి విశ్వమే తల్లిగా అవనిలో అవతరించింది. “ఈ అవతారం చుట్టూ మీరు, మీకోసం ఈ అవతారం” అని వివరించిన “అమ్మ” విశ్వజనని. “తల్లి అంటే తొలి” అని విశదపరచిన “అమ్మ” ఈ సృష్టికి పూర్వమే ఉన్నది. అంటే “అమ్మ” – “పూర్వజ”. ఈ సృష్టికి పూర్వం “ఏకాకిని”గా ఉన్న “అమ్మ”కు ఆధారం ఏమిటి ? అనే ప్రశ్నకు –“ఆధారమేమీ లేదు”– అన్నదే సమాధానం. ఆధారమేమీ లేని, ఆధారమే అవసరం లేని “అమ్మ” నిరాలంబ. అందుకే సర్వాధార అయిన అనసూయమ్మ ‘నిరాధార’ కూడా.

“అంతులేనిది, అడ్డులేనిది, ఆధారమైనది” – “అమ్మ”. ఈ వాక్యాన్ని విశ్లేషిస్తే – అంతులేనిది అనడంలో అంతంలేని అనంతస్థితి, అడ్డులేనిది అనడంలో సర్వస్వతంత్రత, ఆధారమైనది అనడంలో సకలసృష్టికి తానే ఆధారం అని స్పష్టమవుతుంది. ఈ సృష్టి ఆద్యంత రహితమని చెప్పి, “జగజ్జనని” అంటే జగత్తుకు జనని కాదు, ‘జగత్తే జనని’ అని తేటతెల్లం చేసింది “అమ్మ”. ఈ వాక్యాల సారం గ్రహిస్తే – ఆద్యంతరహితమైన సృష్టి స్వరూపమే “అమ్మ”. అంతేకాదు. ఆ సృష్టిని సృజియించిన స్రష్ట కూడా “అమ్మే”. అందుకే “తల్లి అంటే తొలి” అన్నది. ఆ తొలిగా ఉన్న తల్లి అనసూయమ్మ ‘నిరాధార’.



“తెలియనిది తెలియ చెప్పటానికే నా రాక” - అమ్మ.

# 3. ధర్మాధారా

**సృష్టిచైతన్య కేంద్రమై చెలువు మీరి**
**ధర్మదీప్తుల కెల్ల నాధార మగుచు**
**తల్లిధర్మమ్మె రూపమై తరలి వచ్చు**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"అన్నింటికీ, అందరికీ ధర్మం ఆధారం. ఆ ధర్మానికి ఆధారం లలితాదేవి. కనుక, శ్రీమాత ధర్మాధార" – భారతీవ్యాఖ్య.

పంచభూతాల్లో ఒకటైన గాలికి ఆకారం లేదు. నీటికీ, నిప్పుకీ ఆకారం లేదు. అయితే, నీరు, నిప్పు ఏదో ఒక రూపంలో కంటికి గోచరిస్తూ, వాటి ఉనికిని తెలియజేస్తూ ఉంటాయి. కాని, గాలి ... ? కేవలం స్పర్శవల్ల మాత్రమే తెలుస్తుంది. అలాగే రుచికూడా. నాలుక మీద పడిన మరుక్షణంలో – అది తీపో, పులుపో, వగరో, కారమో, చేదో తెలుస్తుంది. గాలి, రుచి వంటివి ఎవరికివారు అనుభవంలో తెలుసుకుంటారు. సత్యం, శాంతి, క్షమ, ప్రేమ, కోపం, కామం వంటి వాటికి కూడా రూపం లేదు. ఇవి గుణాలు. ఇవి ఎవరినో ఒకరిని ఆశ్రయించుకొని, ఆయా వ్యక్తుల ప్రవర్తనలో వ్యక్తమవుతూ ఉంటాయి. ఈ గుణాలన్నీ వారి వారి ప్రవర్తనా సరళినిబట్టి, ఎదుటివారికి అర్థమవుతూ ఉంటాయి.

పైన చెప్పిన గుణాలవంటిదే ధర్మం కూడా. రూపం లేని ధర్మం ఎవరినో ఒకరిని ఆశ్రయించుకుని వారి ద్వారా వ్యక్తమవుతూ ఉంటుంది. "ధర్మం" అనే పదం చాల దురవగాహమైనది (అర్థంకానిది). చరాచరాత్మకమైన సృష్టిలోని ప్రతి వస్తువుకూ దేని ధర్మం దానికి ఉంది. మానవులకు మాత్రం ఈ ధర్మం రకరకాలుగా ఉంటుంది. ఒక వ్యక్తికి కుటుంబపరంగా, సమాజపరంగా చేయవలసిన ధర్మాలెన్నో. ఇందులో కొన్ని వ్యక్తిగతమైనవి, మరికొన్ని ఇతరులకొఱకు చేయవలసినవి. కొన్ని స్వార్థపూరితమైనవి కాగా, మరికొన్ని స్వార్థరహితమైనవి.

"అమ్మ" ధర్మాధార. "సర్వాధారా", "నిరాధారా" అనే వ్యాసాల్లో "అమ్మ" –అంతులేనిది, ఆధారమైనది అని తెలుసుకున్నాం. ఆధారమైనది – అంటే దేనికి?

అని ప్రశ్నించుకుంటే, అన్నింటికీ అనేది సమాధానం. అంటే – దృగ్గోచరమవుతున్న చరాచర జగత్తుకే కాదు. ఈ సృష్టిలోని రూపరహితమైన గుణాలకు కూడా ఆధారం "అమ్మే". ధర్మానికి ఆధారం అయిన శక్తి "అమ్మ". వ్యక్తి ప్రవర్తనలో వ్యక్తమయ్యే ధర్మం "అమ్మ" నడవడిలో ప్రతిక్షణం ప్రత్యక్షమవుతూ, బిడ్డలందరికీ మార్గదర్శకమవుతోంది. అందువల్ల "అమ్మ" ధర్మాధార.

"అమ్మ" జీవితమహాకావ్యంలో ఎవరికి తగ్గధర్మాన్ని వారికి "అమ్మ" తెలియజేసే ఘట్టాలెన్నో మనకు కనిపిస్తాయి. ధర్మాధార అయిన "అమ్మ" తన బిడ్డలకు ఆయా సందర్భాల్లో ధర్మాన్ని బోధించే తీరు సరళసుందరంగా, మృదుమధురంగా, ఆచరణాత్మకంగా ఉంటుంది. స్త్రీలకు భర్తే దైవమని, అతని సేవలోనే జీవితం గడపాలని, అదే భార్యకు ధర్మమని ప్రబోధించింది. స్త్రీలు తమ సౌభాగ్యం కోసం, భర్త క్షేమం కోసం చేసే నోములూ, వ్రతాలూ ఎన్నో ఉన్నాయి. కాని పురుషులకు మాత్రం ఏకపత్నీవ్రత మొక్కటే వ్రతమని చెప్పి, ధర్మబద్ధమైన జీవితం వైపు వారికి దారి చూపింది. అత్తా–కోడళ్ళకు, తల్లీ–బిడ్డలకు వారివారి ధర్మాలను వారికి సంక్షిప్తంగా, సమగ్రంగా తెలియజేసింది.

"నాకు ధర్మాలు పనికిరావు. నాది ప్రేమతత్త్వం" అన్న ఒక అక్కయ్యతో "అమ్మ" – "నీది ప్రేమ తత్త్వమయితే ధర్మాన్ని ప్రేమించు" అని చక్కని సూచన చేసి, ధర్మంవైపు ఆమె దృష్టిని మరల్చి, ధర్మాధారగా ప్రత్యక్షమవుతోంది. "ధర్మం కోసం తల్లికాదు. తల్లి ధర్మం చూపించటానికే"– "అమ్మ". కేవలం ధర్మానికి ఆధారంగా తానుండటమే కాదు. ఆ ధర్మాన్ని అందరికీ అర్థమయ్యేలా చెప్పడం కూడా తల్లి బాధ్యతే – అని ఈ వాక్యార్థం. అయితే, ఈ వాక్యంలో ఒక చమత్కారం గోచరిస్తోంది. "తల్లి ధర్మం చూపించటానికే" అనే చోట "తల్లిధర్మం" అని కలిపి చదివితే, తల్లి యొక్క ధర్మం ఏమిటో చూపించటానికే "అమ్మ" అవతారం అని అర్థం. "తల్లి, ధర్మం చూపించటానికే" అని విడగొట్టి చదివితే, "ధర్మం చూపించడానికే ఈ తల్లి అవతరించింది" అని.మరొక అర్థం. అర్థం ఎలా చెప్పుకున్నా, అంతరార్థం మాత్రం ఒకటే. ధర్మానికి ఆధారమైన ఆ తల్లి (శ్రీమాత), ఆ ధర్మాన్ని మనకు అందించడానికే ఈ "అమ్మ"గా అవనిపై అవతరించింది.

"ధర్మో రక్షతి రక్షితః" అని ఆర్షవాక్యం. ధర్మాన్ని రక్షించే వారిని ధర్మం రక్షిస్తుంది. ఎలా ... ? అంటే, ఆ ధర్మానికి ఆధారం అయిన "అమ్మ" – ధర్మబద్ధమైన జీవితం గడిపే తన బిడ్డలకు వెన్నుదన్నుగా ఉండి, వారిని తప్పక రక్షిస్తుంది. మాధవి–మానవిగా భువిపై అవతరించి, ధర్మమార్గంలో తన మనుగడ సాగించి, ధర్మాధారగా మనకు సాక్షాత్కరించింది. ఆ తల్లి చూపించిన ధర్మపథంలో దారి తప్పకుండా, ప్రయాణంసాగిస్తే, ధర్మాధార అయిన అనసూయమ్మ అండదండలు దండిగా మనకు లభిస్తాయి.



గురుపుంగవులు లేరె, గూఢార్థ విజ్ఞాన
మంజూషఁదెలుచు సామర్థ్యమెద్ది ?
నేర్పుకాండ్రును లేరె, నిఖిల జనానేక
భావనాకర్షణ పటిమ యెద్ది ?
ప్రేమమూర్తులు లేరె, పృథుల వాత్సల్యాబ్ధి
పారంగతత్వ సంపత్తి యెద్ది ?
అన్నదాతలు లేరె, అఖిల భూతాళి బు
భుక్షానివారణాభ్యుదయ మెద్ది ?
మునుపు గుణసంపదలు గన్న ఘనులు లేరె ?
జ్ఞాన నైపుణ్య వాత్సల్య దాన గరిమ
నిన్ను బోలిన వారు లేరెన్నగాను
సకలజన కల్పవల్లి ! యోషామతల్లి !

–డా॥నారపరాజు శ్రీధరరావు

1984 మే 5వ తేదిన "అమ్మ" పెళ్ళిరోజు సందర్భంగా జిల్లెళ్ళమూడి గ్రామప్రజలందరికీ "అమ్మ" బట్టలు పెట్టి, వారందరూ ఆ బట్టలు కట్టుకుని వచ్చాక, అందరికీ విందుభోజనం పెట్టింది. గ్రామస్థులందరూ ఎంతో సంతోషించారు. సంతృప్తి చెందారు. కాని, "అమ్మ"కు మాత్రం తనివి తీరలేదు. ఆ మరునాడు సాయంకాలం "అమ్మ" జిల్లెళ్ళమూడి గ్రామంలోని పశువులన్నింటినీ తన నివాసానికి పడమరగా ఉన్న ఖాళీస్థలంలోకి మందవేయించింది. సంగం జాగర్లమూడి నుంచి ప్రత్యేకంగా తీసుకువచ్చిన దాణా వాటికి మేపడం జరిగింది. అక్కడికి చేర్చిన మందలో గ్రామంలోని గేదెలు, దున్నలు, ఆవులు, మేకలు, గొఱ్ఱెలు వంటివి వెయ్యికి పైగా ఉన్నాయి. అన్ని రకాల పశువులు ఒక్కచోటకు చేరి, మేస్తూ ఉన్న ఆ దృశ్యం కన్నుల పండుగ అయింది. "అమ్మ" ఆ పశువుల వద్దకు వచ్చి, వాటి వాటి యజమానులందరినీ పేరుపేరునా ఆ పశువులు ఎట్లా ఉన్నాయో, వాటి ఆరోగ్యం ఎలా ఉందో, అవి ఎలా మేస్తున్నాయో వివరంగా విచారించింది. వాటివద్ద సన్నాయిమేళం కూడా పెట్టించింది. "శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి గానరసం ఫణిః" అని గుర్తుచేసి, మన కంటే ఎక్కువగా అవి సంగీతాన్ని విని, ఆనందిస్తాయి- అని అక్కడున్న వారికి వివరించింది. గోమాత అయిన "అమ్మ" కు గోవుల హృదయగత భావం అవగతం కావడంలో ఆశ్చర్యమేముంది?

చీరాలలో కీ॥శే॥ డాక్టర్ నారపరాజు శ్రీధరరావు గారి రెండవ కుమార్తె (శ్రీమతి కస్తూరి కుసుమకుమారి) వివాహం జూన్ 14, 1962లో వారి స్వగృహంలో "అమ్మ" దివ్యచరణ సన్నిధిలో, 'అమ్మ' అమృతహస్తాల మీదుగా, 'అమ్మ' దివ్యాశీస్సులతో జరగడం, ఆ పెళ్ళికూతురు చేసుకున్న పూర్వజన్మల పుణ్యఫలం. పెళ్ళికి ముందు "అమ్మ", పెళ్ళి కుమార్తె చేత గోపూజ చేయించింది. పెళ్ళికూతురు ఆవుకు నైవేద్యంగా మామిడిపండును సమర్పించింది. ఆమె ఆ పండును ఆవు నోటిలో పెట్టడానికి భయపడింది. అందువల్ల, ఆ ఆవు పండును స్వీకరించడానికి ముందే తనచేయి తీసేసింది. దాంతో ఆ పండు ఆవునోటి నుంచి జారి క్రింద పడింది. కొద్దిగా కొరకబడిన ఆ పండుకు, క్రింద ఉన్న ఇసుక అతికింది. వెంటనే "అమ్మ" వంగి, ఆ పండును తీసి చేత్తో పట్టుకుని, చిలిపిగా గోపాలకుని వైపు చూస్తూ, కొంటెగా నవ్వుతూ,ఆ పండును తినమని అతని వైపుకు తన చేతిని చాపింది. అతడు చాలా ఇబ్బందిగా ముఖంపెట్టి, వద్దని తిరస్కరించాడు. ఆశ్చర్యం!

అందరం చూస్తూ ఉండగానే రెప్పపాటు కాలంలో గోమాత అయిన "అమ్మ" ఆ పండును తాను కొద్దిగా తిని, వెంటనే ఆవునోటికి అందించింది. ఆవు ఆనందంగా ఆ పండును ఆరగించింది. ఎవ్వరూ ఊహించని ఈ సంఘటనకు అక్కడ ఉన్న అందరి శరీరాలూ గగుర్పొడిచాయి. తల్లి, తన బిడ్డ ఎంగిలిని పట్టించుకోదు కదా! గోమాత అయిన అమ్మకు, ఆ ఆవు ఎంగిలి కాని, భూమాత అంటించిన ఇసుకరేణువులు కాని ఏమాత్రం ఏవగింపును కలిగించలేదు. తన నోటికి అందించిన ముద్దను పసిబిడ్డ తోసివేస్తే, ఎంతో ఇష్టంగా తన నోట్లో వేసుకొని ఆనందించే తల్లి, ఈ సన్నివేశంలో అనసూయమ్మలో గోచరించింది. అప్పుడు "అమ్మ" కళ్ళల్లో కనిపించిన ఆనందానికి అవధులు లేవు. పరమాద్భుతమూ, అనూహ్యమూ అయిన ఈ సంఘటన ఈ నాటికీ నాస్మృతి పథంలో మెదులుతూనే ఉంటుంది. అర్కపురిలో అవతరించిన అనసూయమ్మను గోమాతగా భావించి, దర్శించి, సేవించి, తరిద్దాం.

(కృతజ్ఞతలు - కీ॥శే॥ కొండముది రామకృష్ణ అన్నయ్యకు)



తను వెల్లం బులకాంకితంబయి,
మనః స్థైర్యంబు నీరై, గళం
బున డగ్గుత్తిక భారమై, కనుల
నిర్ముక్తాశ్రు పూరంబు లు
ప్పెనలై, చేతులు సంభ్ర మాతిశయ
నిర్వీర్యంబులై పోవ, నిన్
మనసారం గని మ్రొక్కు భాగ్య మిడు
మమ్మా! జన్మ ధన్యంబగున్.

- డా॥నారపరాజు శ్రీధరరావు

# 5. ఆబ్రహ్మాకీట జననీ

**బ్రహ్మ యైనను, క్రిమియైన భావమందు**
**నెట్టి విధమైన భేదమ్ము నెనయరాని**
**కేవలప్రేమ, ఆబ్రహ్మాకీటజనని**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"బ్రహ్మ మొదలు కీటకం వరకు గల సర్వప్రాణులకూ జనని అయిన లలితాదేవి – ఆబ్రహ్మకీటజనని. సమస్త విశ్వానికీ (అన్నింటికీ, అందరికీ) తల్లి అయిన శ్రీమాత అఖిలాండకోటి బ్రహ్మాండ జనని, విశ్వమాత" – భారతీవ్యాఖ్య.

"అమ్మ" – ఆబ్రహ్మాకీట జనని. ఈ సృష్టిలోని సకల జీవరాసులూ "అమ్మ" ప్రేమను పొంది, ఆనందించిన ధన్యజీవులే. ప్రాణం ఉన్నవే కావు; ప్రాణం లేదని మనం అనుకునే పదార్థాలు కూడా "అమ్మ" సంతానమే. అందువల్లనే, సకల చరాచర జగత్తుకూ "తల్లి" అనే అర్థంలో "విశ్వజనని" అంటున్నాం. "అమ్మ" బాల్యంలోనే ఈ విషయం స్పష్టమవుతోంది. చిన్నప్పుడు గారెలకు పప్పు కడుగుతున్న "అమ్మ" – పప్పులో, పొట్టులో, గిన్నెలో, నీటిలో చైతన్యాన్ని గుర్తించి, వాటితో సంభాషించడం "ఆమె"లోని విశ్వ మాతృత్వాన్ని ప్రకటిస్తోంది. ఆ పసిప్రాయంలోనే – తోటలోని చింతచెట్టు ఎక్కి కూర్చొని, అక్కడ ఉన్న కాకి, కోయిల, గోరువంక, ఉడుతలతో ఈ "బుడుత" కబుర్లు చెబుతూ, వాటిని తన బిడ్డలవలె ఆదరించి, అక్కున చేర్చుకోవడం, అవి కూడా "అమ్మ" ఒడిని విడిచి ఉండలేని స్థితిని పొందడం "అమ్మ"లోని విశ్వజననీత్వానికి ప్రతీక. 'కాకిపిల్ల కాకికి ముద్దు' అని సామెత. అయితే, కాకి పిల్లని కూడా ముద్దులాడిన "అమ్మ" – 'ఆబ్రహ్మాకీట జనని' కాక, మరెవరు?

"అమ్మ"లో ప్రకటితమయ్యే మాతృత్వం మానవులకే పరిమితం కాదని మనం అనుకుంటూనే ఉంటాం. కాని, మనం అసహ్యించుకునే పంది, మనం భయపడే పాము కూడా "అమ్మ"కు ముద్దుబిడ్డలే. అవధుల్లేని "అమ్మ' ప్రేమకు పాత్రమైనవే. ఈ సృష్టిలోని ప్రతిప్రాణీ "అమ్మ"కు ముద్దుబిడ్డే అనడానికి "అమ్మ" పలుకులే మచ్చుతునకలు. "నాకు పందిపిల్ల ముద్దు వస్తుంది. పేను ముద్దు వస్తుంది. పాముపడగ ముద్దుగా ఉంటుంది" – ఇలా "విశ్వమాత" కాక ఈలోకంలో ఇంకెవరైనా అనగలరా?

"అమ్మ" – సకల జీవకోటినీ ప్రేమించడంలో ఆశ్చర్యం లేదు. ఎందుకంటే "ఆమె" విశ్వజనని కనుక. కాని, పశుపక్ష్యాదులు సైతం "అమ్మ" సామీప్యాన్ని కోరుకోవడం విచిత్రం. తిరిగి తమ ప్రేమను ప్రకటించడం అద్భుతం. "అమ్మ" ప్రేమకు హద్దులు లేనప్పుడు, అవి "అమ్మ"ను ప్రేమించడం కూడా కద్దు కదా ! "అమ్మ" సన్నిధిని కోరుకున్న ఎద్దు, "అమ్మ" సన్నిధానంలో నివసించిన కుక్క, "అమ్మ" పైట చెఱగుచాటున ఆటలాడుకున్న పిల్లీ ఎలుకలు, ఒక తుంటరి నుంచి "అమ్మ"ను తప్పించిన గుడ్డి బట్టె... ఇలా ..... ఒకటేమిటి ? ఎన్నో ! ఎన్నెన్నో !.. "అమ్మ"లోని మాతృత్వపు మధురిమను తనివితీరా అనుభవించి, పరవశించాయి. ఆ జంతువులు "అమ్మ"పై చూపించిన ప్రేమను, అవి "అమ్మ" ప్రేమకోసం ఆరాటపడిన తీరును ఈ సన్నివేశాలు 'ఎరుక' పరుస్తున్నాయి. (ఎరుక అంటే జ్ఞానం. అంటే, "అమ్మలోని దైవత్వాన్ని గుర్తించిన 'జ్ఞానం' ఆ పశువులలో గోచరిస్తోంది.)

చీరాలలో కీ॥శే॥ నారపరాజు శ్రీధరరావు డాక్టర్ గారి ఇంట్లో "అమ్మ" కొద్దిరోజులు కొలువుతీరింది. ఆ రోజులు ఆ కుటుంబానికి మరపురానివి. మధురాతి మధురమైనవి. ఆ రోజుల్లో ఒక శుభోదయాన ఆ ఇంటిలోని వారంతా ఒక మహోత్కృష్టమైన అదృష్టానికి నోచుకున్నారు. ఆనాడు "అమ్మ" తన చల్లని చేత్తో ఆ ఇంటిలోని వారికందరికీ నూనెతో తల అంటి, తన అమృతాశీస్సులను వారిపై వర్షించింది. ఆ శుభతరుణంలో, ఆ డాక్టర్ గారి పెంపుడు కుక్క కూడా పుణ్యం చేసుకుంది కాబోలు; అదే ఆప్యాయతానురాగాలతో దానికి కూడా తల అంటి "అమ్మ" ఆశీర్వదించింది. ఆ సమయంలో "అమ్మ" కళ్ళల్లో కనిపించిన వాత్సల్యం మాటలకందనిది. అది చూసి తరించవలసిందే.

ఈ సంఘటన "అమ్మ"లోని విశ్వమాతృత్వాన్ని ఆవిష్కరిస్తోంది. "ఆబ్రహ్మకీటజనని" అయిన అనసూయమ్మకు – మానవులు, పశువులు, పక్షులు, క్రిమికీటకాలు... ఒకటేమిటి ? చరాచర జగత్తులోని సకల ప్రాణికోటీ శిశువులే అనడానికి ఎన్ని దృష్టాంతాలను చూపించినా, ఇంకా ఎన్నో మిగిలే ఉంటాయి. అందుకే, "అందరింటి"లో కొలువుదీరి ఉన్న అనసూయమ్మ "ఆబ్రహ్మకీటజనని".



**"నేను మీకు మీకు మీకు - క్రిమికీటకాదులకు, పశుపక్ష్యాదులకు కూడా తల్లిని" - అమ్మ**

# ౬. ప్రేమ రూపా

**దోమనైనను పుట్టలో చీమనైన**
**కుక్కనైనను చెట్టుపై కోతినైన**
**ప్రీతిమీరగ లాలించు ప్రేమరూప**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"స్నేహం లేదా భక్తి తన రూపంగా గల శ్రీమాత ప్రేమరూప. భగవంతుని యందు పరమప్రేమభావనే భక్తి. అలాంటి భక్తిగలవారి యందు ప్రేమగల శ్రీమాత ప్రేమరూప" – భారతీవ్యాఖ్య.

"ప్రేమ అనే మాట వచ్చు. ఎట్లా వ్రాయాలో తెలుసు. కాని, ప్రేమ అంటే ఏమిటంటే చెప్పలేరు" – 'అమ్మ'.

అసలు ప్రేమ అంటే ఏమిటి ? మనం ఎవరినైతే ప్రేమిస్తున్నామో వారి పట్ల గల సర్వసమర్పణ భావమే ప్రేమ. సత్యం, ధర్మం వలే ప్రేమకు కూడా రూపం లేదు. ప్రేమ అనేది ఒక మధురమైన భావన. రూపం లేని ప్రేమను ఎవరైనా మనసారా అనుభవించి ఆనందించవలసినదే. అయితే, "రామో విగ్రహవాన్ ధర్మః" అన్నట్లు, సత్యమే రూపుదాల్చి హరిశ్చంద్రుడైనట్లు, రూపు కట్టిన ప్రేమయే అర్కపురిలో అవతరించిన అనసూయమ్మ. అందుకే "అమ్మ" – "ప్రేమరూప".

"సృష్టే ప్రేమ మయం. సృష్టంటేనే మాతృత్వం" – "అమ్మ". ఈ వాక్యంలోని అంతరార్థాన్ని అందుకోగలిగితే– "అమ్మ" లోని విశ్వజనీనమైన ప్రేమతత్త్వం విశదమౌతుంది. అది భాషకు అందనిది. భావానికి లొంగనిది. కుల, మత, వర్గ, లింగ భేదాలకు అతీతమైనది. ఈ సృష్టిపై "అమ్మ"కు గల ప్రేమ అనంతమైనది. అపూర్వమైనది. విలక్షణమైనది. విశిష్టమైనది. వినూత్నమైనది. పరమాద్భుతమైనది. అపురూపమైనది. కనుక, రూపం లేని ప్రేమకు ఆకారమే "అమ్మ". అందుకే, "అమ్మ"ను దర్శించడం, స్పృశించడం, ఆమెతో సంభాషించడం వంటివన్నీ

అనుభవైకవేద్యమైన అమరప్రేమకు సంకేతాలే. అవి, ఎవరికి వారు అందుకొని ఆనందించవలసిన దివ్యానుభూతులే. మదిలో నిలుపుకొని మురిసిపోవలసిన మధురస్మృతులే.

"అం, ఆ" అనే "అమ్మ" నామం "అమ్మ" బిడ్డలందరూ నిత్యమూ స్మరించుకునే మంత్రం. "అం" అంటే అంతులేనిది. "ఆ" అంటే ఆధారమైనది. అమ్మ ప్రేమ అంతులేనిది. అమ్మయే అందరికీ ఆధారమైనది. "అమ్మ" దృష్టికి అడ్డుగోడలు లేవు. "అమ్మ" ప్రేమకు ఆనకట్టలు లేవు. ప్రేమరసవాహిని అయిన "అమ్మ" ప్రేమకు ధనిక - పేద, పండిత - పామర, స్త్రీ-పురుష, వృద్ధ - బాల వంటి తారతమ్యాలు లేవు. అవధుల్లేని ఆ "తల్లి" ప్రేమకు స్వ-పర, లోపల-వెలుపల తేడా ల్లేవు.

"సహజప్రేమ అంటే ?" అనే ప్రశ్నకు "దారిన పోయే వాడికీ, సంబంధం లేని వాడికీ సహాయం చేస్తే ఆ ప్రేమ అవ్యాజం. ఆ ప్రేమ సహజం" అని "అమ్మ" సమాధానం. ఇలాంటి "అమ్మ" ప్రేమను పొందిన భాగ్యశాలురు ఎందరో "అమ్మ" జీవిత మహోదధిలో మునకలు వేస్తూ మనకు గోచరిస్తారు. ఈ సృష్టిలోని సకల జీవరాసులూ "అమ్మ" ప్రేమనందుకున్న ధన్యజీవులే. అర్కపురి వీధుల్లో తిరుగాడిన కుక్క, "అమ్మ" భవన ప్రాంగణంలో నడయాడిన కోతీ, ఇదీ - అదీ అని ఏమిటి ? చిన్న చీమ మొదలు బ్రహ్మాండం వరకు గల స్థావర జంగమాత్మకమైన సమస్త సృష్టీ ఆప్రేమమయమూర్తి ప్రేమకు పాత్రమైనదే. అందరికీ తీర్థమిచ్చిన "అమ్మ", తన కెదురుగా ఉన్న కుక్కకు కూడా తీర్థమిచ్చి తన మమతను, సమతను అందరికీ అర్థమయ్యేలా ఆచరణలో చూపించింది. ఒక కోతి చనిపోతే, దానికి అంత్యక్రియలు యథావిధిగా జరిపించి, ఉత్తమగతులను అనుగ్రహించింది. ఈ సంఘటన రామాయణంలోని జటాయువు వృత్తాంతాన్ని స్ఫురింపజేస్తుంది. "అమ్మాయనం"లో ఇలాంటి సంఘటనలు ఎన్నో !

"అమ్మ" ప్రేమకు అంతరాలు, అవరోధాలు లేవు. హద్దులూ, కొలబద్దలూ, లేవు. మంచివాళ్ళ మంచి "అమ్మ"ను ఏడిపిస్తుంది. చెడ్డవాళ్ళలోని చెడు "అమ్మ"కు వారిపై జాలిని పుట్టిస్తుంది. అయితే "అమ్మ' ప్రేమమాత్రం మంచివారిపైన,

చెడ్డవారిపైన ఒకే విధంగా ఉంటుంది. అందులో ఏ తారతమ్యాలూ లేవు. అందుకే "అమ్మ" ప్రేమరూప.

నక్సలైట్లు జిల్లెళ్ళమూడిని అతలాకుతలం చేశారు. కొందరిపైన హత్యాప్రయత్నం కూడా చేశారు. అయితే, అభయప్రదాయిని అయిన "అమ్మ" సన్నిధిలో ప్రాణహాని జరిగే అవకాశమే లేదు కదా ! నక్సలైట్లు ఎలాంటి ఘాతుకమూ చేయకుండానే, వచ్చినపని ముగించుకుని వెళ్ళిపోయారు. "కొందరు పిల్లలు అడిగి తీసుకుంటారు. కొందరు పిల్లలు అడక్కుండా తీసుకుంటారు. మరి కొందరు పిల్లలు అదరగండం చేసి తీసుకుంటారు. వీరు ఈ రకం పిల్లలు" అని "అమ్మ" నక్సలైట్లను గురించి చమత్కారంగా చెప్పింది. వారిపై ఎలాంటి ఆగ్రహాన్నీ ప్రదర్శించలేదు. "తల్లి బిడ్డను ప్రేమిస్తుంది. మనకు అర్థం కాకపోవచ్చుగాని, ఏ పరిస్థితిలోనూ, తల్లిప్రేమలో మార్పుఉండదు. ఉంటే తల్లికాదు" అని నిర్ద్వంద్వంగా చెప్పిన "అమ్మ" ప్రేమ మనందరిపైనా సమానంగా ఉంటుంది.

మానవుల మీద మాత్రమే కాదు. జడపదార్థాలపైన కూడా అమ్మకు మక్కువే. "మాతృశ్రీ" పత్రికను తన పుత్రికగా భావించిందే కాని, ఒక పుస్తకంగా ఎప్పుడూ అనుకోలేదు "అమ్మ". వరదను కూడా ఆడపిల్లగా భావించి, చీర, సారెలతో సాగనంపింది. అంటే, సృష్టిలోని ప్రతిదీ "అమ్మ"కు బిడ్డగానే తప్ప వేరే విధంగా కనిపించదు. అవధుల్లేని "అమ్మ" ప్రేమకు, ఆమె ప్రతి కదలికా ప్రత్యక్ష సాక్ష్యమే. "అమ్మ" మనస్సు నిండా బిడ్డల గురించిన ఆలోచనే. వారికి చేసే పెట్టుపోతలను గురించిన ఆలాపనే. "ప్రేమే తల్లికాని, తల్లిప్రేమ కాదు" అని నిర్వచించిన ప్రేమరూప "అమ్మ". "ఇక్కడివాళ్ళేకాదు, దూరంగా ఉన్నవాళ్ళూ నా బిడ్డలే", "అందరూ నా ఒడిలోనే తిరుగుతున్నారు, ఒడివిడిచి ఎవరూ లేరు" అని ప్రవచించిన విశ్వజనని జిల్లెళ్ళమూడి "అమ్మ".

తాను ఎంత నీరసంగా ఉన్నా, తన బిడ్డల యోగ క్షేమాలు తెలుసుకునే అనసూయమ్మ ప్రేమస్వరూపిణి. పనులు చేసి చేసి, అలసిపోయి, ఆదమరచి నిద్రపోతున్న పిల్లల ఆకలిని గమనించి, ఓపిక లేకపోయినా, లేచి వచ్చి, వారందరికీ చక్కెరకేళీ పండు ఇచ్చి, అక్కడితో తనివి తీరక, సున్నపు పనిచేయటం చేత,

చేతులు పుండ్లు పడిన పిల్లలకు స్వయంగా అన్నం కలిపి ముద్దలు నోట్లో పెట్టి తినిపించిన "అమ్మ" ప్రేమకు సాటి ఏముంది ? "పనులు చేసే పిల్లలకు పకోడీలు చేసి పెడుతున్నారుట. రేపు ఇడ్లీ చేసి పెట్టండి. జబ్బు చేయదు. తోడుపెట్టిన తియ్యటి పెరుగు వెయ్యండి" ఇలా ఎవరనగలరు ? ఒక్క అనసూయమ్మ తప్ప. "కాస్త చల్లార్చి పెట్టమ్మా ! ఆ పసికాయలకు. పెద్దవాళ్ళే ఆ వేడిని చల్లార్చుకుని తింటున్నారు. పసిబిడ్డలు కదూ ! వాళ్ళ బాధ మనకేమి తెలుస్తుంది ? అది తినాలన్న అపేక్షతో నాలుక కాలుతున్నా సహిస్తున్నారు. లేత చేతులు ఆ వేడిని భరించలేవు. చల్చార్చి పెట్టండి". ఇంతలా ఆలోచించి, ఆదరించి, పెట్టేవా రెవరున్నారు ? కన్నతల్లే కంచంలో ఇంత అన్నంపడేసి, ఏ టి.వి.సీరియల్‌లోనో మునిగిపోయే రోజులు వచ్చాయి. మరి "అమ్మ" - ఒకరా, ఇద్దరా ? ఎంతమంది? ఎవరికి, ఎలా పెట్టాలో "అమ్మ"కు తెలిసినంతగా ఇంకెవరికి తెలుస్తుంది ? ఏ వేళప్పుడు, ఎవరు వచ్చినా తనకు పూజకంటే ముందు, వారికి భోజనం ఏర్పాట్లు చూసే "అమ్మ" - ప్రేమకు ప్రతిరూపం.

1950వ సంవత్సరం వరదల్లో ఒక కుక్క కొట్టుకు వస్తే "ఎక్కడో కుక్క అరుపు వినబడుతున్నది. మంత్రాయీ ! చూచిరా" అన్నదట. మంత్రాయి వెళ్ళి చిన్న కుక్కపిల్లను తెస్తే, "అమ్మ" దానిని ప్రేమగా పెంచిందట. ఒకపిల్లి పిల్లలను పెడితే, అవి "అమ్మ"గదిలో అందరికాళ్ళకూ అడ్డుతగులుతూ, అమ్మగదిని, పక్కని, సింహాసనాన్నీ పాడుచేస్తుంటే భరించలేక వాటిని ఒక గోనె సంచిలో మూటగట్టి, తీసుకువెళ్తున్న సోదరుల ప్రయత్నాన్ని వారించి, వాటిని గోనెసంచి నుంచి బైటకు తీయించేసింది "అమ్మ". మానవులనే కాదు, పశుపక్ష్యాదులను సైతం మనతో సమానంగా ప్రేమించిన "అమ్మ" ప్రేమరూప.

'అమ్మ" ప్రేమరస ప్రవాహంలో నిరంతరం ఓలలాడిన బిడ్డలందరూ ఆ ప్రేమామృతాన్ని చవిచూసిన వారే. "అమ్మ" లోని ప్రేమతత్త్వం ఒక వాక్యానికో, ఒక వ్యాసానికో, ఒక గ్రంథానికో పరిమితమైనది కాదు. అది- అంతూ, అదుపూ లేని ఒక ప్రేమరసాంబుధి.

భౌతికంగా "అమ్మ" మనకు దూరమైనా, ఆమె మన కందించిన ప్రేమ శాశ్వతం. అది నిరంతరం మనల్ని వెన్నుతట్టి నడిపిస్తూనే ఉంటుంది. ఆ రోజుల్లో

"అమ్మే సర్వం" అనుకున్నాం. ఈనాడు "విశ్వమే అమ్మ" అనుకుందాం. ఆ "ప్రేమరూప" అడుగుజాడల్లో ఏమరుపాటు లేకుండా అడుగులు వేద్దాం. ఏ పొరపాటూ రాకుండా ఆ తల్లి మన కందించిన ప్రేమను పదిమందికీ పంచుదాం. ఆ విధంగా "అమ్మ"కు దక్షిణ సమర్పిద్దాం. ఆ తల్లిప్రేమకు మరింత పాత్రులమవుదాం. "ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును" అనే ఆధునిక కవి పలుకులను నిజం చేద్దాం.



అల చందమామలో మిల మిల మెఱసెడు
నవ్వ మా యమ్మగా కెవ్వ రగును ?
అల వలిగాడ్పులో కిలకిల నవ్వెడు
నింతి మా యమ్మగా కెవ్వ రగును ?
అల నీలిమబ్బులో జలజల చిలికెడు
యెలనాగ అమ్మగా కెవ్వ రగును ?
అల పైరుపొలములో తళతళ చిందెడు
రవ్వ మా యమ్మగా కెవ్వ రగును ?
కాలకల్పాంత భీకరాకాశ కలిత
దుర్గమారణ్య పథమున నిర్గమించు
పాంథునకు మించు క్రొమ్మించు పడతి యెవరు ?
అమ్మ మాయమ్మ అందాలబొమ్మ గాక.

-డా॥నారపరాజు శ్రీధరరావు

# 7.ప్రియంకరీ

**మదిని నమ్మిన బిడ్డల మనుగడలను**
**కరుణ కురిపించి, మురిపించు కల్పవల్లి,**
**అభ్యుదయముల నొసగు ప్రియంకరి యగు**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు**

"భక్తులకు సకలశుభాలూ కలిగించి, వారి కోరికలు తీర్చి, వారికి ప్రియము చేకూర్చే శ్రీమాత ప్రియంకరి" – భారతీవ్యాఖ్య.

జన్మించిన ప్రతిప్రాణికీ "ఆహార నిద్రాభయమైథునాలు" అనేవి ఉంటాయి అని నీతిశాస్త్రం చెప్తోంది. ఈ నాలుగూ ఉన్నచోట కోరిక సహజంగా ఉంటుంది. ఎందుకంటే కోరిక లేకపోతే ఆహార సంపాదనే ఉండదు. అలాగే, కమ్మగా భోజనం చేసిన తర్వాత సుఖంగా నిద్రపోవాలనుకోవడం కోరికేగా మరి. ప్రతి ప్రాణికీ ప్రాణభయం పట్టి పీడిస్తూనే ఉంటుంది. కనుక, అపాయం నుంచి ఉపాయంగా తప్పించుకుని తన్ను తాను రక్షించుకోవాలనుకోవడం కోరికలోని భాగమేగా ! సృష్టికి కారణమైన దాంపత్యం కోరిక లేకపోతే జరుగదు కదా ! కనుక కోరిక అనేది ప్రతి ప్రాణికీ ఉంటుంది.

అయితే, మానవుడికి మాత్రం కోరికలు అనంతం. అందుకే, పోతన మహాకవి "ఆశాపాశము తా కడున్ నిడుపు, లే దంతంబు" అని విడమరచి చెప్పాడు. ఒక్క కోరిక తీరీ తీరక ముందే మరెన్నో కోరికలు తలలెత్తుతాయి, పుట్టలోని పాములవలె. ఈ కోరికలనే గుఱ్ఱాలను పగ్గాలువేసి పట్టలేం. ఇంక కొంతసేపట్లో ప్రాణం పోతోందని తెలిసినా, మనవరాలి పెళ్ళి చూడాలని, మనవడికి ఉద్యోగం వస్తే బాగుండునని మనసు కోరుకుంటూ ఉంటుంది. ఇది మానవ సహజం. అయితే, ఇతరులకు హానిచేయనంతవరకు మనం ఎలాంటి కోరికలు కోరుకున్నా తప్పులేదు. కాని ప్రక్కవాడి కొంప కూల్చి, మనం పైకి రావాలనుకునే కోరిక మాత్రం కూడనిది. భక్తుల కోరికలను తీర్చి, వారికి శుభాన్ని చేకూర్చిపెట్టే శ్రీమాత ప్రియంకరి.

"అమ్మ" ప్రియంకరి. "అమ్మ" తన బిడ్డల కోరికలను తీర్చి, వారికి సుఖసంతోషాలనూ, శుభాలనూ అనుగ్రహించింది. ప్రియంకరి అయిన "అమ్మ" అనుగ్రహాశీస్సులు అందుకున్న అనేకమంది భాగ్యశాలురలో నేనూ ఒకదాన్ని కావడం నా పూర్వజన్మల పుణ్యఫలం.

1962 వ సంవత్సరంలో "అమ్మ" చీరాల పర్యటనకు రావడానికి కొంచెం ముందుగా మా నాన్నగారు కీ॥శే॥డా॥ నారపరాజు శ్రీధరరావుగారు జిల్లెళ్ళమూడిలో "అమ్మ"ను దర్శించడం జరిగింది. అంతకు పూర్వమే కీ॥శే॥ శ్రీహర్షరావుగారు మా ఇంటికి వచ్చి, "అమ్మ" ప్రసాదం అంటూ పండో, కొబ్బరి చెక్కో కుంకుమపొట్లాలో ఇస్తూండేవారు. అలా "అమ్మ"తో తొలిపరిచయం అయింది. ఆ తర్వాత "అమ్మ" చీరాల, వాడరేవు, ఈపూరుపాలెం వంటి గ్రామాలకు రావడం, ఆ ప్రాంతాల్లో కొంతకాలం గడపడం, ఆ రోజుల్లోనే మా పుట్టింటికి రావడం జరిగింది. ఆ రోజుల్లోనే ఒకనాటి ఉదయం "అమ్మ" దర్శనం కోసం మా నాన్నగారితో వెళ్లాను. అంతకు ముందురోజు రాత్రి అంతా "అమ్మ"నామ సంకీర్తన చేసిన ఒక అమ్మాయిని (10 సంవత్సరాలు) "అమ్మ" దగ్గరగా తీసుకుని, ఆప్యాయంగా ఆదరించడం నా పసిమనస్సులో చెరగని ముద్రవేసింది. ఆ అమ్మాయి ఎంతటి ధన్యాత్మురాలో ! తన కోకిలకంఠంతో "అమ్మ" నామం రాత్రంతా చేసి, "అమ్మ"నే మురిపించింది. అలా నేను కూడా "అమ్మ"ను ఏమైనా చేయగలిగితే, నన్ను కూడా "అమ్మ" దగ్గరకు తీసుకుంటుంది కదా ! అని అమాయకంగా అనుకున్నాను. నా చిన్ననాటి కలని ఈనాటికి నిజం చేసింది "అమ్మ". ప్రియంకరి అయిన "అమ్మ" ఆశీర్బలమే నా జీవితాన్ని ఇప్పటివరకు నడిపిస్తూ ఉంది.

నా జీవితంలోని ప్రతి సన్నివేశంలోనూ "అమ్మ" తన అభయహస్తాన్ని అందించి, అన్ని విషయాల్లో నాకు అండగా ఉన్నదని నా అనుభవం. నాకు వైద్యవృత్తి అంటే చాలా ఇష్టం. దానికి తగ్గట్టుగానే మా బంధువులంతా నా కోరికకు తగినట్లుగానే నన్ను డాక్టరు చదువమని ప్రోత్సహించారు. అయితే, వైద్యవృత్తిలోనే ఉన్న మా నాన్నగారికి అందులోని సాధక బాధకాలు బాగా తెలిసి కాబోలు, నన్ను డాక్టరు చదివించడానికి ఇష్టపడలేదు. "అమ్మ" కూడా మా నాన్నగారితో "దాన్ని డాక్టరు చదివించు నాన్నా!" అన్నది. మా నాన్నగారు విని

ఊరుకున్నారు. తన ఇష్టంప్రకారం తెలుగు(బి.ఏ.)లో చేర్పించారు. "తోలు నోరుకాదు కదా ! తాలుమాట రావటానికి"అని "అమ్మ" అన్నట్లుగా నేను తెలుగులో పి.హెచ్.డి. చేసి 'డాక్టరు శ్రీవల్లి' అయ్యాను.

"అమ్మ" అనుగ్రహబలమే నన్ను డా॥శ్రీవల్లిని చేసింది. నేను రీసెర్చి చేయడానికి విశాఖపట్నం వెళ్ళడానికి ముందు అకస్మాత్తుగా మా అమ్మ (శ్రీమతి ప్రభావతి) తీవ్ర అనారోగ్యానికి గురయింది. మా అమ్మ అనారోగ్యం దృష్ట్యా నన్ను దూరంగా పంపించడం మా నాన్నగారికి ఇష్టం లేకపోయింది. కాని, నాన్నగారి పరిచయస్తులు - ఇవ్వాళ కాకపోతే రేపు అమ్మగారికి ఆరోగ్యం కుదుటపడవచ్చు. కాని, అమ్మాయికి ఇలాంటి (స్కాలర్‌షిప్పుతో సీటు) అవకాశం మళ్ళీ రాదుగా. తప్పకుండా పంపండి. లేకపోతే, తర్వాత మీరెంతో బాధపడవలసి వస్తుంది" అని నచ్చజెప్పి, నన్ను పంపమని ప్రోత్సహించారు. నా రీసెర్చిసీటుకి సంబంధించి యూనివర్సిటీవారు పంపిన ఉత్తర్వులు తీసుకొని నేను జిల్లెళ్ళమూడికి వెళ్ళాను. ఆ కాగితం మీద "అమ్మ" - "అంఆ" అని సంతకం పెట్టి, కుంకుమ పొట్లాలు ఇచ్చి, బొట్టుపెట్టి పంపింది. "అమ్మ"ముద్ర పడినతర్వాత భద్రమేగా అంతా. నేను రీసెర్చిలో చేరిన ఏడాదిలోగా మా అమ్మకు ఆరోగ్యం కుదుటపడటం, నేను నిర్విఘ్నంగా, దిగ్విజయంగా డాక్టరేటు డిగ్రీని అందుకోవడం అంతా ప్రియంకరి అయిన "అమ్మ' దీవన ఫలితమే.

థీసిస్ సబ్మిట్ చేసిన కొద్దికాలానికే వివాహం జరగడం, వివాహం జరిగిన రెండు నెలలకే మా శ్రీవారికి "అమ్మ" సన్నిధిలోనే ఉద్యోగావకాశం రావడం, ఆ తర్వాత కొద్ది నెలలకే నాకూ పొన్నూరులో ఉద్యోగం రావడం, "అమ్మ" అనుమతితో బాపట్లలో కాపురం పెట్టడం, అమ్మ అనుగ్రహం వల్లనే నేను అమ్మను కావడం - ఇలా ఒకదాని వెనుక ఒకటి సినిమారీలు లాగా గిర్రున తిరిగిపోయాయి. ఇలా నా జీవితంలోని ప్రతి సంఘటన వెనుక "అమ్మ" అజ్ఞాతహస్తం, అభయహస్తమై అహరహమూ నన్ను కాపాడుతూ ఉంది.

కొడుకులు లేనందువల్ల మా అమ్మా, నాన్నగారు తమ చివరిదశలో నా దగ్గరే ఉండవలసి వచ్చింది. మావారు అందించిన సహకారం, "అమ్మ" చూపిన

మమకారం తల్లిదండ్రుల ఋణం తీర్చుకునే అదృష్టాన్ని నాకు కలిగించాయి. అయితే, రకరకాల పనుల వత్తిడివల్ల మా వారికి తరచూ ఊరు వదిలి వెళ్ళే అవసరం ఉండేది. అందువల్ల "అమ్మ"ను నేను నిరంతరం ఒక కోరిక కోరుకుంటూ ఉండేదాన్ని. నాతల్లిదండ్రుల మరణ సమయంలో నేను ఒంటరిగా ఉండకూడదని, నా పక్కనే నాకు ధైర్యంగా ఎవరైనా ఉండేలా అనుగ్రహించమని "అమ్మ"ను పదే పదే కోరుకునేదాన్ని. ప్రియంకరి, అభయప్రదాత్రి అయిన "అమ్మ" ఈ విషయంలో కూడా కంటికి రెప్పలా నన్ను కాపాడింది.

మా నాన్నగారి మరణసమయంలో మా శ్రీవారే కాకుండా, శ్రీ విఠాల రామచంద్రమూర్తిగారు, శ్రీమతి శేషుగారు, శ్రీ చాగంటి వెంకట్రావుగారు, కీ॥శే॥ శ్రీ జొన్నలగడ్డ జానకి రామయ్యగారు వంటి పెద్దలను మా ఇంట్లో ఉంచి, జరుగవలసిన కార్యక్రమాన్ని సజావుగా జరిపించింది. మాఅమ్మ అంతిమ ఘడియలలో నా తోబుట్టువులు, మా అమ్మతోబుట్టువులు మా ఇంట్లోనే ఉండడంతో, నా దుఃఖాన్ని పంచుకునేందుకు అయిన వాళ్ళు నావద్దనే ఉన్నారు. ఈ సన్నివేశాల్లో "అమ్మ" నాపట్ల చూపిన కరుణ, ప్రేమ ఇంతింత అనరానివి. సుఖసంతోషాల్లో ఒంటరితనం బాధించదు, కాని కష్టసమయంలో, అందులోనూ కన్నవారిని కోల్పోయిన సమయంలో ఒంటరితనం ఎంతో భయంకరమైనది. ఆ కష్టంనుంచి నన్ను గట్టెక్కించిన "అమ్మ" ప్రియంకరిగా నాకు కనిపించింది. ఎల్లప్పుడూ మనందరిపైనా తన అనుగ్రహవర్షాన్ని కురిపించాలని ప్రియంకరి అయిన "అమ్మ"ను అభ్యర్థిస్తున్నాను.



ఏ ధర్మంబు పవిత్రమై జగము తా నేలున్ వినిర్ద్వంద్వమై
ఏ ధర్మం బొక మాతృపుత్రగతమై సృష్టి ప్రియ స్వప్నమై
ఆధారంబయి, సర్వభూతముల కాహ్లాదంబు చేకూర్చునో
ఆ ధర్మంబగు నమ్మ నెంచెద నవిద్యానాశన ప్రాప్తికై.

-డా॥ నారపరాజు శ్రీధరరావు

# 8. సాధ్వీ

**ఎన్న మంగళసూత్రమ్ములన్న నాన్న**
**గారి పాదయుగ మటంచు గాఢమైన**
**భక్తి భావాన నర్చించు పరమసాధ్వి**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"సాధుస్వభావం కలది సాధ్వి. అంతేకాదు. సాధ్వి అంటే పతివ్రత. పతిని పూజించే వ్రతంగల స్త్రీ పతివ్రత. శ్రీమాత పాతివ్రత్య వైభవం స్త్రీలోకానికి ఆదర్శం.

పాతివ్రత్యమే తన స్వరూపంగా గల శ్రీమాత సతి" – భారతీవ్యాఖ్య.

లోకంలో సర్వసాధారణంగా అనుకూలవతియైన భార్యను మనం పరమసాధ్వి అని అంటూ ఉంటాం. సాధుస్వభావం గల స్త్రీలను కూడా సాధ్వి అనడం వాడుకలో ఉంది. మరి, భర్త శరీరంలోనే అర్థభాగమైన అమ్మవారు పరమసాధ్వీ మతల్లియే కదా ! అందుకే శ్రీమాత సాధ్వి, సతి.

"అమ్మ" సాధ్వి, సతి. అమ్మ జీవితంలోని ప్రతి సన్నివేశమూ ఈ విషయాన్నే విస్పష్టంగా వివరిస్తోంది. "అమ్మ" తన ఆచరణ ద్వారా ప్రతిస్త్రీకి పతిసేవా నిరతిలో ఆదర్శంగా నిలిచిన సతి. మనకందరికీ "అమ్మ" ఆరాధ్యదైవం. "అమ్మ"కు ఆరాధ్యదైవం నాన్నగారే. మనసా, వాచా, కర్మణా "అమ్మ" నాన్నగారి సేవలోనే నిమగ్నమై ఉండేది. సమక్షంలోనే కాదు, పరోక్షంలో కూడా నాన్నగారికి ఎన్నో సూచనలు, సలహాలు, హెచ్చరికలు చేసి, ప్రతిక్షణం పతిధ్యానంలోనే గడిపిన అనసూయమ్మ – సతి. "తల్లి, ధర్మం చూపించటానికే" అని చెప్పిన "అమ్మ" ప్రతి మహిళకూ పతివ్రతా ధర్మాలను "అరటిపం డొలిచి నోటికి అందించినంత" సులభంగా, సుమధురంగా, సులలితంగా ప్రబోధించింది.

తన మెడలోని మంగళసూత్రాలను అభిషేకించి, ఆ నీటిని కళ్ళకు అద్దుకుని, తీర్థంలా మూడుసార్లు స్వీకరించడం "అమ్మ"కు నిత్యకృత్యం. "ఈ తీర్థమే నాన్నా! నన్ను పావనం చేసేది. ఈ తీర్థంతో నేను పావనమైతే మీకు తీర్థం ఇవ్వటానికి

అర్హత కలుగుతుంది” అని “అమ్మ” చెప్పిన మాటలో ప్రతి స్త్రీ భర్తనే దైవంగా ఆరాధించాలనే ప్రబోధం ప్రస్ఫుటంగా వ్యక్తమవుతోంది. ఒకసారి ముడిపడిన తన మంగళ సూత్రాలను సరిచేస్తూ “అందుకే నాన్నగారికి కాళ్ళనొప్పులు” అని “అమ్మ” పలకడంలోని అంతర్యం “భర్తపాదాలే మంగళసూత్రాలు” అని. “భర్త అంటే శరీరం కాదు భావన” అనే “అమ్మ” వాక్యం ఎంతో భావగర్భితమైనది. “అమ్మ”తో ఒకరు “భావబలం” అని అంటే, ‘బావబల్గం’ అని సరిచేసిన “అమ్మ” – సతి. “కళంకరహితమైన మనస్సును కళంకరహితంగా మరొకవ్యక్తికి అర్పణ చేయటమే కల్యాణం” అని, మనస్సుల కలయికయే పరిణయ పరమార్థమని చెప్పిన తల్లి సాధ్వి. “పరధ్యానంగా ఉన్నావా, అమ్మా !” అని ప్రశ్నించిన వారితో, “పరధ్యానం కాదు నాన్నా ! పతిధ్యానమే” అని బదులిచ్చి, తన మనస్సు ఎప్పుడూ నాన్నగారి చింతనలోనే ఉంటుందని స్పష్టం చేసింది “అమ్మ”. నాన్నగారిని తప్ప మరే దైవాన్నీ “అమ్మ” పూజించినట్లు కనిపించదు. “భగవంతుడు భర్తకాదు. భర్తే భగవంతుడు” అని చెప్పిన “అమ్మ” ఆ వాక్యాన్ని తు.చ. తప్పకుండా పాటించింది. ఉగాది పర్వదినంనాడు నాన్నగారికి ముందుగా ఉగాదిపచ్చడి పెట్టి, ఆయన పాదాలకు నమస్కరించిన తర్వాతనే తన మందిరంలోకి మన పూజలు అందుకోవడానికి “అమ్మ” వేంచేయడం ఇందుకు ప్రత్యక్ష నిదర్శనం.

లౌకిక విషయాల్లో కూడా “అమ్మ” నాన్నగారికి ఎంతటి ప్రాధాన్యం ఇచ్చిందో, ప్రతి చిన్నపనిలోనూ ప్రకటితమవుతోంది. కాఫీ తెచ్చి ఇచ్చిన అక్కయ్యతో “ముందు నాన్నగారి కిచ్చి రా” అని ఆదేశించిన సాధ్వి “అమ్మ”. మనకు “అమ్మ” దైవం. అందువల్ల మనం ఏదైనా ముందుగా “అమ్మ”కు సమర్పించుకోవాలనుకుంటాం. కాని, “అమ్మ”కు దైవం నాన్నగారు. అందువల్ల ప్రతిదీ ఆయనప్రసాదంగా, తాను స్వీకరించాలనుకునేది అమ్మ. శుభలేఖను ముందుగా “అమ్మ” చేతికి అందించబోయిన వారితో “ఇది నాన్నగారు చించి చదివిన తర్వాత నేను చదవడం న్యాయం” అని తెలియచెప్పింది. దినపత్రిక తెచ్చి ఇచ్చిన బుద్ధిమంతుడన్నయ్యతో “ముందు నాన్నగారికి ఇవ్వమని” నిర్దేశించిన “అమ్మ” సాధ్వి. హైదరాబాద్ నుంచి తెల్లద్రాక్షపళ్ళు తెచ్చిన శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గారితో “దీన్ని నాన్నగారికి ఇచ్చిరండి” అని ఆదేశించిన అమ్మ – సతి. క్రొత్త

టేప్‌రికార్డర్ తెచ్చి – "మొదట ఏది రికార్డు చెయ్యమంటావమ్మా" అంటే, "నాన్నగారు పద్యాలు చదువుతారేమో కనుక్కోండి" అని కర్తవ్యోపదేశం చేసిన తల్లిఅనసూయ సాధ్వి. "మేనత్త కొడుకూ మొగుడేనా ?" అనే వారితో, "మొగుడని ఎవరనుకుంటున్నారూ ? దేవు డనుకుంటున్నానుగా" అని స్పష్టంగా తన ఆరాధనాభావాన్ని ప్రకటించిన "అమ్మ" సతి. గోపాలకృష్ణమూర్తిగారు వెళ్ళిపోతుంటే "నాన్నగారితో చెప్పారేమో కనుక్కోండి' అని ప్రశ్నించిన "అమ్మ" మనస్సులో నాన్నగారికి గల స్థానం ఎంత ఉత్కృష్టమైనదో మన ఊహకు కూడా అందదు. ఏ చిన్న సంఘటన అయినా సరే, అది నాన్నగారికి తెలియవలసిందే. ఆయన ద్వారా జరుగవలసిందే. సాధారణ స్త్రీలలో కూడా భర్తపట్ల కనిపించని ఈ భక్తిప్రపత్తులు "అమ్మ"కు నాన్నగారిపై ఉన్నాయి. "అమ్మ"ను మనం పూజించినదాని కంటే ఎక్కువగా "అమ్మ" నాన్నగారిని అర్చించింది.

నాన్నగారికి ఏ మాత్రం నలతగా ఉన్నా, "అమ్మ" ఆయన దగ్గరకు వెళ్ళి కాళ్ళు పట్టడమో, మందులు వేయించడమో, నూనె మర్దన చేయడమో, వేడినీళ్ళు కాపు పెట్టడమో, ఇలా ఏదో ఒక సేవ చేస్తూ, ఆయనకు ఉపశమనం కలిగించేది. నాన్నగారికి టెంపరేచర్ వస్తే, ఆయన మంచం ప్రక్కనే ఉండి, రాత్రంతా మేలుకుని సేవచేసేది. నాన్నగారికి వక్కపలుకు కూడా తానే లేచి వెళ్ళి స్వయంగా తెచ్చి ఇచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఎవరూ లేకపోతే తప్పనిసరి కనుక "అమ్మ" వెళ్ళడం కాదు. 'అందరింటి' నిండా నిరంతరం "అమ్మ" సంతానం – ఆడపిల్లలు, మగపిల్లలు తిరుగుతూ, "అమ్మ" కనుసన్నలలో మసలుతూ ఉంటారు. వారితో పెదవి విప్పి "అమ్మ" చెప్పనవసరం లేదు. కళ్ళతో ఒక్కసారి వారి వంక చూస్తే చాలు, వారు తమ జీవితం ధన్యమయిందనుకుని "అమ్మ" ఆదేశంగా ఆ పనిని తక్షణమే చేస్తారు. కాని నాన్నగారికి సేవచేయడంలోని తృప్తిని, ఆనందాన్ని "అమ్మ" తానుగా పొంది, తద్వారా స్త్రీలోకానికి ఆదర్శగృహిణిగా మార్గదర్శకత్వం వహించింది. పతివ్రతా ధర్మాన్ని తాను ఆచరించి, కేవలం మాటలతో మాత్రమే కాక, తన ప్రవర్తనతో ప్రబోధించిన "అమ్మ" సాధ్వి.

"పెనిమిటి అంటే ఏమిటి ?" అని అడిగిన వారికి "పెన్నిధి" అని, "పెన్నిధి అంటే దైవసన్నిధి, సన్నిధి అంటే లక్ష్యం" అని విపులంగా వివరించింది

అమ్మ. స్త్రీకి భర్తే దైవం. ఆయనే లక్ష్యంగా ఉండాలని చెప్పడమే కాక, తన ప్రతికదలికలోనూ ఆ విషయాన్నే స్పష్టం చేసింది "అమ్మ". తన నడవడికద్వారా పతివ్రతాధర్మాలను ప్రపంచానికి ప్రత్యక్షంగా ప్రదర్శించిన "అమ్మ" సాధ్వి. "సర్వాన్నీ స్వాధీనం చేసుకున్నదే సాధ్వి" అని నిర్వచించిన "అమ్మ" సాధ్వి.

సతిగా, సాధ్విగా అవనికి అవతరించిన "అమ్మ" అడుగుజాడల్లో నడచి, భర్తసేవలో జీవితాన్ని పండించుకోవడం కంటె ఏ మహిళకైనా ధన్యత్వం ఏముంటుంది ? అలాంటి బుద్ధిని, మనస్సును అనుగ్రహించమని సాధ్వి, సతి అయిన "అమ్మ"నే వేడుకుందాం.



**నేరిమితోడ ఓరిమిని నేర్తురు కొందరు, వారు గన్న ఆ**
**ఓరిమి ఓర్మియే? సహజ ముట్టిపడంగ తనంత వచ్చు నా**
**ఓరిమి పేర్మి జెప్పవలె; ఉర్వర తాలిమి జూచినాను, నీ**
**ఓరిమి జూచినాను, మఱి యొండుకడన్ గనిపింప దయ్యెడున్.**

**వినగా సత్యము తిక్తమౌ; నన్నృతముల్ ప్రీతి ప్రసాదంబులై**
**వినసొంపే నిది నైజమో, నిజమొ, నీ విన్నాణమో, కర్మమో**
**ఘనరత్నంబుల ద్రోసి పెంకులకునై కష్టింప కాత్మార్తినో**
**మనసా ! అమ్మ పదాబ్జముల్ హృదయసీమన్ నిల్పి పూజింపుమా!**

**-డా॥నారపరాజు శ్రీధరరావు**

# 9. స్వభావ మధురా

**తనువు, హృదయమ్ము గాయమై, తప్తమైన,**
**బిడ్డలకు నెల్లవేళల ప్రేమ యొకటె**
**పంచి యిచ్చుచు నుండు స్వభావమధుర**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"స్వభావం చేతనే అందరికీ సంతుష్టిని కలిగించే దేవి కనుక స్వభావ మధుర. సహజంగానే అందరి చేతా కోరదగిన శ్రీమాత స్వభావ మధుర. ఆత్మతత్త్వజ్ఞులైన వారిపై తన అనుగ్రహాన్ని ప్రసరించే తల్లి స్వభావమధుర. అమంగళకరమైన రాగద్వేషాది భావాలను తొలగించి, తన భక్తుల యందు సదా నివసించే శ్రీమాత స్వభావ మధుర" – భారతీవ్యాఖ్య.

**"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖః క్షమీ ॥**
**సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢ నిశ్చయః**
**మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః॥"**

అని గీతాచార్యుని ఉపదేశం. భక్తులు ఎలా ఉంటే భగవంతుడికి ప్రీతిపాత్రులవుతారో ఈ శ్లోకద్వయం స్పష్టం చేస్తోంది. ఈ లక్షణాలన్నీ భగవంతుడివి. కనుక, ఆ లక్షణాలు కలిగిన భక్తులు భగవంతుడి ప్రేమకు పాత్రులవుతారు. పరమాత్ముడు ప్రబోధించిన ఈ సత్యాన్నే పరమాప్తయై ఆచరణాత్మకంగా నిరూపించింది "అమ్మ". "అపకారికి నుపకారము నెప మెన్నక చేయువాడు నేర్పరి" అని కదా ! బద్దెనకవి సందేశం.

"అమ్మ" స్వభావ మధుర. మహోదధిలోని ఒక్కొక్క తరంగం "అమ్మ"లోని మధుర స్వభావపు తుంపరలను వెదజల్లుతుంది. పశుపక్ష్యాదులనుగాని, తన్ను ద్వేషించేవారిని కాని, ఎవరినైనా సరే క్షమించి, తన ఒడిలోకి తీసుకుని లాలించే మధుర స్వభావ అమ్మ. పసితనంలోనే కన్నతల్లిని కోల్పోయిన "అమ్మ" ఎన్ని బాధలకు లోనైందో – ఎంత ఓర్పుతో, నేర్పుతో ఆయా సంఘటనల్లో ప్రవర్తించిందో

తలచుకుంటే, ఆమె స్వభావంలోని మాధుర్యం మనకు సుస్పష్టమవుతుంది. చిన్నప్పుడు భారతమ్మగారు జడపట్టుకుని లాగి క్రిందకు పడతోస్తే, తానే క్రిందకు పడిపోయానని చెప్పి, తన బిడ్డతప్పును కప్పిపుచ్చిన పసిడితల్లి "అమ్మ". చనిపోయినబిడ్డ తల్లి కడుపులో మూడురోజులపాటు ఉండిపోయినా, లోపల అంత బాధ ననుభవిస్తూ కూడా పైకి పొక్కని చక్కని తల్లి. బిడ్డనొప్పులు వస్తున్నా, పైకి తెలియనివ్వక, వైద్యులకే విభ్రాంతిని కలిగించిన "అమ్మ" స్వభావమధుర.

ఎంత ఎంత దూరాలనుంచో వచ్చిన భక్తులకు తన దర్శనభాగ్యం కలిగించడానికి, తన అనారోగ్యాన్ని కూడా లెక్క చేయకుండా, ఒక్క స్నానంతో తన బాధను ప్రక్కకు నెట్టిన 'అమ్మ" స్వభావమధుర. మండువేసవిలో గంపలకొద్దీ పూలతో, గుట్టలు గుట్టలుగా కుంకుమతో, భక్తులు చేసే పూజల్లో తన శరీరం ఆ పూలలో నుంచి వచ్చిన ఆవిరికి కగ్గిపోతున్నా, ఆ కుంకుమ వేడికి మండిపోతున్నా కదలకుండా, మెదలకుండా విగ్రహమై నిలిచి, భక్త జనసందోహాలకు అలౌకికానందానుభూతులను పంచి ఇచ్చిన "అమ్మ" స్వభావ మధుర. భక్తులు ప్రేమతో అలంకరించిన గజమాలలతో భుజాలు కుంగిపోయినా, శరీరం కందిపోయినా వారి ఆనందం కోసం వీసమెత్తు బాధనైనా ముఖంలో కనపడనీయని "అమ్మ" స్వభావ మధుర. పూలతో, ఆకులతో, కుంకుమతో - ఇలా భక్తులు దేనితో పూజ చేసినా - అది వేసవికాలమైనా, ఆ సమయానికి తనశరీరం సహకరించకపోయినా, చెరగని చిరునవ్వుతో భక్తులను అలరించిన "అమ్మ" స్వభావ మధుర. భక్తి వెర్రితలలు వేసిన ఒక భక్తుడు దురదగుంట ఆకుతో పూజించినా మారుమాటాడక, మౌనంగా ఆ బాధను అనుభవించి, ఆ భక్తుని మూర్ఖత్వాన్ని మనసారా క్షమించిన తల్లి అనసూయమ్మ స్వభావ మధుర.

శరీరధారులయిన అవతారమూర్తులకు కూడా శారీరక రుగ్మతలు తప్పవనే సత్యాన్ని ప్రత్యక్షంగా చూపి, ఆ రోగాలు కూడా తన బిడ్డలేనని, ఒక బిడ్డ వెళ్ళిపోతే, మరొక బిడ్డ వచ్చి, ఆనందింప జేసినట్లు, ఒక రోగం పోయి, మరొక రోగం రావడాన్ని కూడా ఆనందంగా ఆహ్వానించిన "అమ్మ" స్వభావంలోని మధురిమను గురించి చెప్పాలంటే - ఎన్ని, ఎన్నెన్ని సంఘటనలను గుట్టగా పోసినా, ఇంకా ఎన్నెన్నో సన్నివేశాలు రాసులుగా మిగిలిపోతూనే ఉంటాయి. "అందరింటి"కి

వచ్చిన అందరినీ, భోజనం చేసి వెళ్ళమని ఆదరంగా చెప్పే "అమ్మ", నక్సలైట్లను కూడా శత్రువులుగా భావించలేదు. శిక్షించమని తన ముందు నిలబెట్టిన వారిని ఆప్యాయంగా చూసి, "ఎంత ఆకలిగా ఉన్నారో, ముందు అన్నం పెట్టమ"ని వారి ఆకలిని తీర్చిన (వారిని తీర్చిదిద్దిన) "అమ్మ" స్వభావ మధుర.

మనలోపాలనూ, పాపాలనూ పట్టించుకోకుండా, మనలో పసిపాపలనే చూసిన మాతృశ్రీ అనసూయా మహాదేవి స్వభావ మధుర. "భావం మారేది, స్వభావం మారనిది, స్వభావం మార్చలేనిది, స్వభావమంటే పుట్టుకతో వచ్చింది" – అన్నది "అమ్మ". అందువల్లనే పొగాకు బేరన్‌లో ఉండిపోయి కాలినా, శరీరం వసివాడిందే కానీ, "అమ్మ" లోని మృదుమధుర స్వభావం మచ్చుకైనా మసిబారలేదు. అవాఙ్మానసగోచరమైన "అమ్మ" స్వభావంలోని మాధుర్యాన్ని చెప్పడానికి భాష చాలదు. స్వభావ మధుర అయిన "అమ్మ" స్వభావంలోని మాధుర్యలేశంలో సహస్రాంశమైనా మనం అలవరచుకునేలా అనుగ్రహించమని "అమ్మ"ను ప్రార్థిస్తూ, "అమ్మ" చరణారవిందాలకు శతసహస్రాధిక ప్రణామాలు సమర్పించుకుంటున్నాను.



కానుక నీయ నీ కొకటి గల్గునె ? నా హృదయంబు కంటె లో
కాన సముజ్జ్వలంబయిన కమ్మని వస్తువు, దాని కోసమే
నేను తపించి నాతనువు నిత్యము చూచిన నెట్టి తావులన్
దా నగుపింప దాయె, నెటు తాళుదు, నేమిటి సేయబోవుదున్ ?

నమ్మితి నీ పదాబ్జములు, నమ్మితి నీదగు సూక్తి సత్యమున్
నమ్మితి నీ యనుగ్రహము, నమ్మితి నిన్ కడచేర్చు తల్లిగా
నమ్మితి నెమ్మనమ్మునను నమ్మినవానిని వీడవంచు; నా
నమ్మికలన్ని వమ్మగునె ? నన్ గనిపెంచెడి తల్లియుండగన్.

–డా॥నారపరాజు శ్రీధరరావు

# 10. నామపారాయణ ప్రీతా

**అన్ని నామమ్ములందున అవతరించు**
**నామపారాయణ ప్రీత; నామ రూప**
**ములకతీతమై జగతిని వెలయు తల్లి**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

“అకారం మొదలు క్షకారం వరకు గల అన్ని వర్ణాలూ దేవీ నామాలే. నామపారాయణంచేత ప్రీతి చెందే శ్రీమాత నామపారాయణప్రీత” – భారతీవ్యాఖ్య.

వర్ణమాలలోని అక్షరాలతో ఏర్పడేవే భాషలోని పదాలన్నీ. అక్షరాలతో ఏర్పడింది కనుకనే “నామం” అక్షరమైనది. క్షరమంటే నాశనం. అక్షరమంటే నాశనం లేనిది. అఖిలమై, అక్షయమై, అఖండమైన నామస్మరణ శ్రీమాతకు ప్రీతిని కలిగిస్తుంది. కనుక, లలితాదేవి నామపారాయణ ప్రీత.

“అమ్మ” నామపారాయణ ప్రీత. “అమ్మ” నామం “జయహోమాత ! శ్రీ అనసూయ ! రాజరాజేశ్వరి ! శ్రీ పరాత్పరి!” ఈ నామం హైమమందిరంలో అఖండంగా, అహోరాత్రమూ వినిపిస్తూనే ఉంటుంది. ఎందుకంటే, హైమక్క “అమ్మ నామస్మరణ ప్రీత”. హైమక్క చీరాలలో కీ॥శే॥ డాక్టర్ నారపరాజు శ్రీధరరావు గారింట్లో ఉండే రోజుల్లో ఎప్పుడూ “అమ్మ” నామం చేసుకుంటూ ఉండేది. అంఆ కోటి నామజప పుస్తకంలో “అంఆ” అని వ్రాస్తూ ఉండేది. హైమక్కకు ‘అంఆ’ మంత్రాక్షరాలే ఉచ్ఛ్వాస నిశ్వాసాలు – (సోహం). హైమ మనసెరిగిన “అమ్మ” – హైమాలయ ప్రాంగణంలో, అఖండ నామ సంకీర్తనను ఏర్పాటు చేసి, హైమక్కకు ఆత్మానందాన్ని కలిగిస్తూనే, తనకు గల నామపారాయణ ప్రియత్వాన్ని ప్రకటించింది.

“అమ్మ”కు ఏ నామమైనా ఒక్కటే. అది “జయహోమాత” కావచ్చు, “హరే రామ హరే కృష్ణ” కావచ్చు. “శ్రీరాజరాజేశ్వరీ” నామం కావచ్చు. ఏ నామసంకీర్తననైనా ఆనందంగా ఆలకిస్తుంది. “ఏ నామమైతే ఏమి నాన్నా ! మీ కిష్టమయిన నామం చేసికొనండి. నాకేమీ అభ్యంతరం లేదు. నా కన్ని నామాలూ ఒక్కటే. ‘జయహోమాతా’ అంటేనేనా ‘అమ్మ’ ? “హరే హరే” అంటే “అమ్మ”

కాదూ?" అని స్పష్టం చేసింది "అమ్మ". సకల దేవతా స్వరూపిణిగా "అమ్మ"ను భావించిన మనం - దేవీ నవరాత్రుల్లో అమ్మవారి రూపంలో, వైకుంఠ ఏకాదశిరోజు శ్రీ మహావిష్ణువుగా, శ్రీకృష్ణాష్టమినాడు చిన్ని కృష్ణునిగా, శ్రీరామనవమి పర్వదినంలో శ్రీరామచంద్ర మూర్తిగా ఇలా ఎన్నో రూపాలలో ఆరాధించి, ఆనందపరవశుల మయ్యాం. "ఏకం సత్ విప్రాః బహుధా వదన్తి" అని ఆర్షవాక్యం. "అన్ని రూపాలూ ఆయనవే కనుక రూపరహితుడు, అన్ని గుణాలూ ఆయనవే కనుక గుణరహితుడు. అన్ని నామాలూ ఆయనవే కనుక నామరహితుడు" - "అమ్మ". అన్నిరూపాలూ, నామాలూ "అమ్మవే" కనుక, ఏ నామస్మరణమైనా, పారాయణమైనా, సంకీర్తనమైనా "అమ్మ" కు ఆనందదాయకమే.

కృష్ణనామ సంకీర్తన బృందం వారు గానం చేసిన కృష్ణనామం అమ్మను ఆనందపరవశురాల్ని చేసింది. అవును మరి. "అమ్మ" - వైష్ణవీ, విష్ణురూపిణీ, ముకుందా, గోవిందరూపిణీ కదా ! చెప్తున్న నామం, చేస్తున్న నోరూ కాదు. నామం చేసే వారి మనస్సులోని ఆర్తి "అమ్మ"ను కదిలించి వేస్తుంది. ఆ భక్తుల ఆర్తికి ఆ "భక్తప్రియ" హృదయం ఆర్ద్రమై, ఆనందబాష్పాలుగా వర్షించింది కూడా. (మాతృ సంహిత - నామసంకీర్తన ప్రీత) జిల్లెళ్ళమూడిలో, "అమ్మ" సన్నిధిలో ఒక్కరోజూ, రెండు రోజులూ కాదు, ఏకంగా 47 రోజులు "రామనామ సప్తసప్తాహం" దిగ్విజయంగా కొనసాగింది. ఆ 47 రోజులూ అర్కపురి - అయోధ్యాపురి అయింది. ఆ ప్రదేశమంతా రామనామగానంతో ప్రతిధ్వనించింది. రామలీలా నాటక ప్రదర్శనలతో పులకించింది. ఆనాటి "అమ్మ" ఆనందాతిరేకం వర్ణనాతీతం.

జిల్లెళ్ళమూడిలో వైభవంగా జరిగిన యజ్ఞం "గాయత్రీ యాగం". ఈ యాగానికి ముందుగా ఆవరణలో ఒక కోటి ఇరవైరెండులక్షల గాయత్రీ మంత్రజపం జరిగింది. గానం చేసే వారిని రక్షించే తల్లి గాయత్రి. "అమ్మ" - గాయత్రి. ఎందుకంటే - అమ్మ నామగాన సంకీర్తన ఆమె బిడ్డలకు సంపూర్ణ రక్షణ. అందుకే, "అమ్మ" గాయత్రీ యాగానికి తన అనుమతిని అనుగ్రహించి, ఆశీర్వదించింది. ఆ యాగం జరిగినన్ని రోజులూ ఆవరణలోని ప్రతి అణువులోనూ, ప్రతి క్షణమూ "అమ్మ" నామం ప్రతిధ్వనించింది. ఔను, మరి. "అమ్మ" నామ మహిమ తెలియని బిడ్డలెవరు ? అందుకే "అమ్మ" - "నామికంటే నామమే బలమైంది. దాన్ని

ఆశ్రయించడమే మంచిది," అన్నది. నిజమే. రామనామమహిమవల్లనే కదా! హనుమ సముద్రతరణం చేసింది. సీతాసందర్శన భాగ్యం కూడా రామనామమహిమ చేతనే హనుమకు సంప్రాప్తించింది.

"అమ్మ" నామ మహిమ గ్రహించిన "అమ్మ" బిడ్డలందరూ గాయత్రీ యాగానంతరం, అరవై రెండు కోట్లు "అమ్మ" నామ జపం చేయాలని సంకల్పించారు. ఆ సంగతిని "అమ్మ"కు నివేదించారు. వెంటనే "అమ్మ" తన సమ్మతిని తెలియజేసి, తన బిడ్డలకు అంతులేని ఆనందాన్ని కలిగించింది. ఆర్తభక్తజనత్రాత అయిన "అమ్మ" నామ పారాయణ ప్రీత. "నామంతో గుండెలో గుడి కట్టుకో నాన్నా!" అన్నది. ఇది "అమ్మ" సందేశమా ? ఆదేశమా ? ఏదైనా సరే. లాలనతో చెప్పడమే "అమ్మ" పాలనా రహస్యం. ఈ వాక్యాన్ని నిశితంగా పరిశీలించి చూస్తే – నోటితో కోట్లకొలదిగా నామజపం చేయడం ఒక్కటే కాదు. ఆ చేస్తున్న నామాన్ని మనస్సంతా నింపుకోవాలి అనే సూచన కూడా ఈ వాక్యంలో తొంగి చూస్తోంది. త్రికరణ శుద్ధిగా చేసే నామమే అమ్మకు అత్యంత ప్రీతిదాయకం. అందులోనూ – "అమ్మ" నామం – "జయహో మాత ! శ్రీ అనసూయ!" అని కదా! గుండెలోపల అనసూయ నామం నిండుగా ఉంటే – అసూయకు తావేదీ ? "అసూయ లేని తత్త్వమే అనసూయత్వం" – అదే "అమ్మ" తత్త్వం. అనసూయ బిడ్డలమయిన మనం "అమ్మ" తత్త్వాన్ని అలవరచుకుందాం. "మీరు కానిది నే నేదీ కాదు నాన్నా!" అనే "అమ్మ" వాక్యాన్ని కొంచెం మార్చుకుని "అమ్మ కాని దేదీ మనం కాదు, కారాదు" అనుకుని, "అమ్మ" నామజపం చేస్తే, పరమ ప్రయోజనం సిద్ధిస్తుంది. మన మందరం, అనసూయలుగా (అసూయలేని వారుగా) "అమ్మ" నామాన్ని జపించడమే "నామపారాయణ ప్రీత" అయిన "అమ్మ"కు మనం సమర్పించుకునే వసివాడని పూజాపుష్పం.

*(రామకృష్ణన్నయ్యకు కృతజ్ఞతలతో)*



**"మానవుని నడక నవగ్రహాల మీద ఆధారపడి లేదు. రాగద్వేషాలనే రెండే గ్రహాల మీద......" అమ్మ**

# 11. కావ్యాలాప వినోదినీ

**కావ్య మన్నను, సుమధుర గానమన్న**
**ముచ్చటగ నాలకించుచు ముదము గాంచు;**
**నన్ని తన రూపమేయైన కన్నతల్లి**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

“కావ్య శ్రవణం చేత ఆనందించే శ్రీమాత కావ్యాలాపవినోదిని. కావ్యం రసాత్మకం. కావ్యానందం అంటే రసానందం. అది బ్రహ్మానంద సబ్రహ్మచారి. “రసోవై సః” అనే ఉపనిషద్వాక్యం రసం దేవీ స్వరూపమే అని ప్రబోధిస్తోంది. బిడ్డను చూసి తల్లి ఆనందించినట్లు, తననుంచి ఆవిర్భవించిన కావ్యరస సంబంధమైన ఆలాపాలచేత లలితాంబిక వినోదిస్తోంది” – భారతీవ్యాఖ్య.

సంగీతసాహిత్యాలు సరస్వతీ స్వరూపం. అందులో సంగీతం ఆపాతమధురం కాగా, సాహిత్యం ఆలోచనామృతం. ఒక గొప్ప సంగీత కళాకారుని లేదా సాహితీవేత్తని చూసినపుడు మనం సర్వసాధారణంగా అనే మాట “పుంభావసరస్వతి” అని. అంటే, సరస్వతీదేవికి పురుషరూపమే వీరు – అని అర్థం. సంగీతం భాషతో, భావంతో సంబంధం లేకుండా ఎవ్వరినైనా అలరిస్తుంది. “శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః” అన్నారు కదా ! పెద్దలు. కాని, సాహిత్యం అలా కాదు. ఒక కావ్యాన్ని ఒక్కసారి చదివితే అర్థం కావచ్చు, కాని ఒక్కసారి చదవడంతో ఆపకుండా, పదే పదే చదువుతూ ఉంటే, ఆ గ్రంథంలోని విషయాలు అర్థం కావడంతో పాటు వాటిలోని అంతరార్థాలు ఒక్కొక్కటీ అవగతమవుతూ, పాఠకునికి రసానందానుభూతిని కలిగిస్తాయి. ఆ రసానందం బ్రహ్మానంద సదృశం. ఎందుకంటే రసం దేవీ స్వరూపం కనుక. దివ్యానుభూతికి లోనైన కవి, ఒక మంచి కావ్యాన్ని రచించి, అంతులేని ఆనందాన్ని అనుభవిస్తాడు. అతని కవిత్వాన్ని ఆస్వాదించిన సహృదయులయిన పాఠకులు/ శ్రోతలు కూడా అంతటి రసానందానుభూతిని పొంది తన్మయులౌతారు. ఆ రచన భగవత్పరమైనది కూడా అయితే అది సాక్షాత్తూ

బ్రహ్మానందాన్నే అందిస్తుంది. అలాంటి ఆధ్యాత్మిక రచనలు చేసి, ధన్యులయిన మహాకవులెందరో మన తెలుగు సాహిత్య వినీలాకాశంలో దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉన్నారు. వారి కావ్యరసపానం చేసిన సహృదయ పాఠకులు కూడా, అంతటి రసానుభూతినీ చవిచూసి ఆనందిస్తూనే ఉన్నారు.

"అమ్మ" కావ్యాలాపవినోదిని. "అమ్మ" సన్నిధిలో ఎందరో మహాకవులు, గాయకులు - ఎన్నో కావ్యాలూ, గేయాలూ రచించి, ఆలపించి "అమ్మ"కు ఆనందాన్ని కలిగించారు. "అమ్మ" అనుగ్రహం చేత ఎందరో, ఎందరెందరో "అమ్మ"ను గురించి ఎన్నో పుస్తకాలు రచించారు. అలాంటి వాటిల్లో - వచనగ్రంథాలూ, పద్యకావ్యాలూ, గేయాలూ, వచన కవితలూ, వంటి కావ్య ప్రక్రియలెన్నో ఉన్నాయి. వాటి రచయితలు వాటిని చదువుతుంటే, కావ్యాలాప వినోదిని అయిన "అమ్మ" వింటూ ఆనందించేది. "అమ్మ"సన్నిధిలో ఎన్నో పుస్తకావిష్కరణలు జరిగాయి. ఆయాపుస్తకాలలోని విశేషాలు సమీక్షిస్తుంటే, "అమ్మ" దరహాసవదనంతో వాటిని వింటూ ఆనందించేది.

కీ॥శే॥డా॥ నారపరాజు శ్రీధరరావుగారికి "అమ్మ" అనుగ్రహంతో కవిత్వం అలవడింది. ఆ "తల్లి" ప్రసాదం చేత తనకు సంప్రాప్తించిన కవితాసరస్వతిని ఆ "అమ్మ" కీర్తనకే వినియోగించి, వారు - "అమ్మ", "వ్యాకృతి", "నివేదన", "అలంకృతి" అనే చిన్నచిన్న పద్యకావ్యాలు రచించారు. వారి "నివేదన" కావ్యావిష్కరణ సభ ఒక మధురస్మృతి. అది జనవరి 1970 -14వ తేది అర్ధరాత్రి. ఆ సమయంలో శ్రీధరరావుగారి దంపతులు "అమ్మ"కు పూజ చేసుకున్నారు. తరువాత "అమ్మ" శ్రీధరరావుగారి పద్యకావ్యం "నివేదన"ను ఆవిష్కరించింది. ఆవిష్కరణ సభ ప్రారంభ సమయం అర్ధరాత్రి అయితే, ముగింపు తెల్లవారుజామున 4.30-5.00 గంటల మధ్య, అంతసేపూ "కావ్యాలాపవినోదిని" అయిన "అమ్మ" ఆ కావ్యాన్ని గురించి వివిధ స్వరాలలో విని ఆనందించింది.

కావ్యాలాపవినోదిని అయిన "అమ్మ" - కీ॥శే॥ శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావుగారి చేత లలితాసహస్రనామాలలోని అర్థాలను, అంతరార్థాలను, విశేషార్థాలను, పరమార్థాన్ని చెప్పించి, ఆ ప్రవచనం జరుగుతున్నంతసేపూ అక్కడే

తన బుల్లిమంచం మీద కూర్చొని, ఓపికలేనపుడు పడుకుని వింటూ, పరమానందభరితురాలై ఆ వ్యాఖ్యాతను ఆశీర్వదించింది.

నేనూ, మా శ్రీవారూ జిల్లెళ్ళమూడిలో మెయిన్ బిల్డింగులో వాత్సల్యాలయానికి వెళ్ళే మెట్ల పక్క గదిలో ఉండేవారం. ఆయన కాలేజి నుంచి రాగానే, ఇద్దరం, "అమ్మ" సన్నిధికి చేరుకునేవాళ్ళం. ఆ చల్లని సాయంసమయాల్లో ఎన్నోసార్లు 'కావ్యాలాపవినోదిని' అయిన "అమ్మ" – "పోతన భాగవతంలోని పద్యాలు చదువు నాన్నా!" అని అడిగి, మావారిచేత చదివించుకొని విని, ఆనందించేది.

ఇవి నేను ప్రత్యక్షంగా చూసి, అనుభూతి చెందిన సంఘటనలు. ఇలా ఎందరో కవుల కావ్యాలను, గ్రంథాలను, పాటలను విని ఆనందించిన "అమ్మ" కావ్యాలాపవినోదిని. అలా తమ తమ గ్రంథాలను "అమ్మ"కు చదివి, వినిపించిన రచయితలు అందరూ "అమ్మ"ను కావ్యాలాపవినోదినిగా దర్శించి, తరించినవారే.



నిను నిత్యంబు స్తుతించినన్ కయితలన్ నిత్యంబు కీర్తించినన్
నిను నిత్యంబును కొల్చినన్ చరితలన్ నిత్యంబు విన్నన్ మనం
బున సంతృప్తి జనింప కే తిరిగి నిన్ పూర్వప్రకారంబులన్
వినుతింతున్ రచియింతు గొల్తు వినుదున్ విన్పింతు నశ్రాంతమున్.

అమ్మే దైవము నాకు, అమ్మ నుడులే ఆనంద మార్గమ్ము; లా
అమ్మన్ గూర్చిన మాటలే సకల విద్యాభ్యాసముల్, మాతృ నా
మమ్మున్ మానసమందు నిల్పుటయె సన్మంత్రంబు, తత్పాద ప
ద్మమ్ముల్ పూజ యొనర్చుటే వ్రతము, జన్మాంతంబు దా కెంచగన్.

–డా॥ నారపరాజు శ్రీధరరావు

# 12. అన్నదా

**అన్నపూర్ణాలయమ్మున అహరహమ్ము**
**రమ్యముగ మ్రోగు గంటల రవళులందు**
**తనదు గుండె చప్పుళ్ళను దాచుకొన్న**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"శ్రీమాత కదా ! లలితాదేవి. అందరికీ అన్నింటికీ తల్లి. ఏ ఇంట్లో అయినా అమ్మ చేసేపని అన్నం పెట్టడమే కదా ! జీవులకు అన్నం పెడుతోంది ఆమె. అన్నం ప్రసాదిస్తోంది కనుక శ్రీమాత అన్నద" - భారతీవ్యాఖ్య.

లలితాదేవి విశ్వమాత. మాత అంటే తల్లి. తల్లి ప్రధాన కర్తవ్యం, ప్రథమ బాధ్యత తన బిడ్డలకు అన్నం పెట్టడం. విశ్వమాతయైన శ్రీమాతకు సకలజీవకోటీ సంతానమే కదా ! అఖిలాండకోటి బ్రహ్మాండజనని, ఆబ్రహ్మకీటజననియైన లలితాదేవి సకలజీవరాశికీ ఆహారాన్ని సమకూరుస్తోంది. చిన్నచీమ మొదలుగా మానవుని వరకు గల సమస్త జంతుకోటికీ ఆహారం అందించి, పోషిస్తోంది లలితాంబిక. ప్రాణులకు జీవనాధారమైన ఆహారాన్ని అమర్చి పెట్టే తల్లి కనుక శ్రీమాత - అన్నద.

ప్రతిప్రాణికీ నిత్యావసరాల్లో అత్యంతం ప్రధానమైనది ఆహారం. జీవికి ఆహారం లేకపోతే, మనుగడే లేదు. జంతుజాలానికే కాదు, చెట్టూ, చేమకు కూడా జీవనాధారమైనది ఆహారమే. నాలుగురోజులు నీరుపెట్టకపోతే చెట్టు వాడిపోతుంది. కొన్నాళ్ళలా కొనసాగితే చచ్చిపోతుంది. దీన్ని బట్టి ప్రాణం ఉంది అనుకునే ప్రతిదానికీ ముందుగా కావలసింది ఆహారమే. అందుకే "అన్నం పరబ్రహ్మ స్వరూపం", "అన్ని దానాల కంటే అన్నదానం మిన్న", "కోటి విద్యలూ కూటి కొఱకే" అనే నానుడులు ప్రచారంలో ఉన్నాయి.

"అమ్మ" అన్నద. చిన్నతనం నుంచీ "అమ్మ" తన చుట్టూ ఉన్న పశుపక్ష్యాదులకూ, మానవులకూ అన్నం పెట్టడమే తన ముఖ్యమైన పనిగా పెట్టుకుంది. తన ఆహారాన్ని ఇతరులకు పెట్టి, తాను తృప్తిగా త్రేన్చేది. "మీరు తింటే నేను తిన్నట్టే", "మీకు పెట్టుకోకపోతే నేను చిక్కిపోతాను" అని పలికిన

"అమ్మ" "అడగకుండా పెట్టేదే అమ్మ" అనే కొత్త నిర్వచనాన్ని చెప్పింది. "అన్నం పెట్టడానికి ఆకలే అర్హత"గా స్పష్టం చేసింది. "మనిషికి అన్ని బాధలకంటే ఆకలి బాధే ఎక్కువ అనిపిస్తుంది నాకు" అని చెప్తూ, "ఈ కలిలో నా కాకలి లేదు" అని ప్రకటించిన మాధవి. "అమ్మ"ను దర్శించడానికని ఎక్కడెక్కడి నుంచో వచ్చి, "అమ్మ"ను ఎప్పుడెప్పుడు చూస్తామా అనే ఆరాటంతో ఉన్న భక్తులకు (బిడ్డలకు), తన దర్శనం కంటే ముందుగా అన్నం పెట్టించి, వారి ఆకలిని తీర్చి, తరువాత తన దర్శన భాగ్యాన్ని అనుగ్రహించిన అనసూయమ్మ అన్నద.

"మీరు దేన్ని గురించి ఆలోచిస్తారూ ?" అనే ప్రశ్నకు "భోజనాన్ని గురించి" అనే "అమ్మ" మాటల్లోని అంతరార్థం తన బిడ్డల భోజనం గురించి. మనం ఎప్పుడైనా ఎక్కడికైనా విందుకు వెళ్ళినపుడు, భోజనం వేళదాటితే" ఏమిటీ ? ఇంకా భోజనం పెట్టరూ !" అని మనకు భోజనం ఆలస్యమైనందుకు తహతహలాడిపోతాం. పక్కవారిని పట్టించుకోకుండా మొదటిబంతిలో కూర్చుంటాం. కాని, "అమ్మ" నిరంతరం మనకు చేసే పెట్టుపోతలను గురించే ఆరాటపడుతూ ఉండేది. లక్షమంది తిన్నప్పటికీ, ఒక్కడు తినకపోతే "అమ్మ" మనసు గిలగిల్లాడి పోయేది. "ఒక్కడు చాలదూ, తినకుండా వెళితే" అని వాపోయేది ఆ మాతృహృదయం. "ఇంత సొమ్ము ఈ నగలకు పెట్టేకంటే, దీనితో ఎంతమంది తింటారూ !" అని ఆలోచించే అమ్మ అన్నద. "మీకు వచ్చే ఆలోచనలు ఎటువంటివి" అనే వారితో - "మీకు పెట్టుకోవాలని పించేటటువంటివి"అని, "మీకు కోరికలు లేవా ?" అని అడిగితే, "ఎందుకు లేవూ? మీకు పెట్టుకోవాలనుకోవడం కోరికే కదా!" అని, "నీ కేమనిపిస్తోం దమ్మా" అనే భక్తునితో (బిడ్డతో) - "నాకు, నువ్వుఅన్నం తినలేదు. తినాలనిపిస్తోంది" అని సమాధానాలు చెప్పడంలో - అహరహమూ తన బిడ్డల ఆకలిని గురించి ఆలోచిస్తూ, ఆవేదన చెందే "అమ్మ" ఆంతర్యం అవగతమవుతోంది.

తన స్వర్ణోత్సవంలో తన కోరికగా లక్షమంది ఒకే పంక్తిలో భోజనం చేస్తుంటే చూడాలని ఉంది - అని పలికిన "అమ్మ" అన్నద. ఒక లక్షమందికి పెట్టాలనుకుంటే, లక్షకు పైగా భోజనాలు చేసినా, ఇంకా పదార్థాలు మిగిలి ఉంటే, పశుపక్ష్యాదులకు పంచిపెట్టి, తనివి నొందిన తల్లి అనసూయమ్మ అన్నద. "వచ్చేవారందరికీ "ఆదరణ" అనుపాకం చేసి పెట్టాలి. గుండిగ దిగితే గుండిగ ఎక్కాలి. ఎప్పుడు వచ్చిన వాడికైనా తీరిక లేదనకుండా అన్నం పెట్టాలి",

"నిత్యాన్నదానం అంటే రోజూ అన్నం పెడుతున్నామని కాదుగా ? ఎప్పుడూ అన్నం పెట్టాలని" అని పలికిన అనసూయమ్మ అన్నద. "అమ్మ" గుండె అన్నపూర్ణాలయం. ఆ గుండె చప్పుడే అన్నపూర్ణాలయంలోని ఘంటారావం. ఆ అన్నపూర్ణాలయంలో నిరతాన్నదానం జరగడం కోసం శాశ్వతంగా ఏర్పాటు చేసిన విధానమే ఈనాటికీ కొనసాగుతున్న ధాన్యాభిషేక కార్యక్రమం. "అమ్మ"కు అత్యంతం ఇష్టమైన అర్చన ధాన్యాభిషేకం. "నా రాశి బియ్యపు రాశి" అని స్పష్టం చేసిన "అమ్మ" అవతార పరమ ప్రయోజనం తన బిడ్డలకు (పశుపక్ష్యాదులు కూడా) ఎప్పుడూ ఆహారం అందిస్తూ ఆనందించడమే. "నీకున్నది తృప్తిగా తిని, ఇతరులకు ఆదరంగా పెట్టుకో" అనేదే "అమ్మ" మనకు అందించిన సందేశం. "అమ్మ" అవతారమే అన్నావతారం. అంటే అన్నపూర్ణావతారమే. కనుక అర్కపురిలో వెలసిన అనసూయమ్మ – అన్నద.



తీర్థోపయోగ సందేహి విద్వాంసుండు
పదవారి బెదవార బదునుబెట్టు
భీషణ దారిద్ర్య శోషిత హృదయుండు
కలిమినెలంత సంకెలల నలగు
కాంతా దృగంత లగ్నాంతరంగ విలాసి
జడదారి కడదారి కడల నేగు
భాషాపరిజ్ఞాన పండితమ్మన్యుండు
తొలిపల్కులలవోక బలుక నేర్చు
రుగ్జరా శత్రుభార నిర్భగ్న దేహి
చివురు సవురులు చిన్నారి చెలువు మెఱయు
నమ్మప్రాంగణమందు శుభమ్ము లెల్ల
జూఱగొందురు లోకులు శూరులగుచు.

-డా॥నారపరాజు శ్రీధరరావు

# 13. ప్రాణదాత్రీ

**ప్రాణికోటికి అసలైన ప్రాణమగుచు**
**సృష్టికథ నెల్ల నడిపించు చిద్విలాస,**
**ప్రాణశక్తి స్వరూపిణి, ప్రాణదాత్రి**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"ప్రాణమంటే చైతన్యం, శక్తి. ఐదు కర్మేంద్రియాలూ, ఐదు జ్ఞానేంద్రియాలూ, మనస్సులతో కలసి అది పని చేస్తుంది. అలాంటి ప్రాణశక్తిని ఇచ్చే లలితాదేవి ప్రాణద.

ప్రాణాలను ప్రసాదిస్తుంది కనుక శ్రీమాత ప్రాణదాత్రి" – భారతీవ్యాఖ్య.

ప్రతిప్రాణికీ అన్నిటికంటే ప్రాణం చాలా విలువైనది. చిన్న చీమ కూడా తనకు ప్రాణాపాయం కలుగుతోంది అని తెలిసిన మరుక్షణం ఆ ప్రదేశం విడిచి వెళ్ళిపోతుంది. దేన్ని పోగొట్టుకున్నా తిరిగి సంపాదించుకోగలమేమో గాని, ప్రాణం కోల్పోతే తిరిగి పొందడం అసాధ్యం.

"అమ్మ" ప్రాణద, ప్రాణదాత్రి.

1967 ఆగష్టు 17న జిల్లెళ్ళమూడిలో జరిగిన సంఘటన ప్రాణద అయిన "అమ్మ"ను ఆవిష్కరిస్తోంది. నరసింహారావు మాస్టరుగారు యాంప్లిఫైర్‌లో నుంచి మైకుకు సంబంధించిన ప్లగ్‌ని తీయబోయారు. దురదృష్టవశాత్తూ ఆ ప్లగ్ పిన్నులు మాస్టరు గారి కుడిచేతి బొటనవ్రేలికి అతుక్కుపోయాయి. ఆయన "అమ్మా" అని కేకపెట్టి పడిపోయారు. ఆవరణంతా అల్లకల్లోలమయింది. అందరూ ఏం చేయాలో పాలుపోక అటూ ఇటూ పరిగెత్తుతున్నారు. ఇంత గందరగోళంలోనూ, "అమ్మ" మాత్రం నిశ్చలంగా ఉంది. ఆ మాస్టారు గారి తల్లి "అమ్మ" పాదాలపై బడి "ఇదేమిటమ్మా!" అంటూ బావురుమంది. అప్పటివరకూ బొమ్మలా ఉన్న "అమ్మ" ఆ వృద్ధురాలి తల నిమురుతూ, "ఏముందీ, చూడు, అబ్బాయి లేస్తున్నాడు" అని అన్నదో, లేదో మాస్టరుగారు లేచి కూర్చుని "అమ్మ"ను చూసి నవ్వుతూ, "మళ్ళీ సృష్టించావా అమ్మా!" అంటూ వెళ్ళి "అమ్మ" పాదాలకు ప్రణమిల్లారు.

1978 డిసెంబరు 31వ తేదీ రాత్రి గం.11-45ని.లకు "అమ్మ" నామసంకీర్తన కోసం సోదరుడు జేమ్సు మైకు ఏర్పాట్లు చూస్తున్నారు. ఒక్కొక్క వైరునీ కనెక్టు చేస్తున్నారు. అంతలోనే దభీమంటూ పడిపోయారు. కరెంటు వైరు అతని చేతిలో మంటలు విరజిమ్ముతోంది. ఆ ప్రదేశమంతా ఒకటే కోలాహలం. ఎవరికీ ఏంచేయాలో తోచక అన్ని ప్రక్కలకూ పరుగులు తీస్తున్నారు. ఇంతలో సోదరులు శ్రీ ప్రసాద్ (ఎలక్ట్రికల్ ఇంజనీరు, మచిలీపట్నం) ఆ వైరుకు మూలంలో ఉన్న ప్లగ్‌ను డిస్‌కనెక్టు చేశారు. ఇలా అందరూ ఆందోళనతో ఎవరికి తోచిన ప్రయత్నాలు వారు చేస్తూ హడావుడిగా ఉంటే, సోదరుడు జేమ్సు మాత్రం ఎలాంటి భయానికి లోను కాకుండా "అమ్మా అమ్మా" అంటూ "అమ్మ" నామాన్ని విడిచిపెట్టకుండా చేస్తూనే ఉన్నారు. ఇంచుమించుగా రెండు నిమిషాలపాటు అతని శరీరంలో విద్యుత్ప్రసారం జరిగినా, అతడు మామూలుగానే ఉన్నారు. అంతసేపు విద్యుత్ప్రసారం జరిగితే బ్రతకడం అసాధ్యం. కాని "అమ్మ" నామం చేస్తూ ఉన్న సోదరుడు జేమ్సుకు మాత్రం ఏ ప్రాణాపాయమూ కలుగలేదు. మానసిక పరిస్థితిలోనూ మార్పురాలేదు. "అమ్మ" - గోపాలన్నయ్యను రక్షించింది, బుద్ధిమంతుడన్నయ్యకు ప్రాణదానం చేసిందీ - అని వింటుంటే అదేమిటో నాకు అర్థమయ్యేది కాదు. ఇవ్వాళ నాకు అనుభవపూర్వకంగా తెలిసింది. "అమ్మ" కరుణామయి. "అమ్మ" ప్రాణదాత్రి" అని చెప్పిన సోదరుడు జేమ్సు మాటలు ప్రత్యక్షర సత్యాలు.

ఒక గోపాలన్నయ్య, ఒక బుద్ధిమంతుడన్నయ్య, డాక్టర్ శ్రీ పన్నాల రాధాకృష్ణశర్మగారి కుమారుడు ఇలా చెప్పుకుంటే - కోల్పోతామనుకున్న ప్రాణాలను "అమ్మ" అనుగ్రహం వల్ల తిరిగి చేజిక్కించుకున్న ధన్యజీవులు ఎందరో . "శివుడాజ్ఞ లేనిదే చీమయినా కుట్టదు". "అమ్మ" అనుజ్ఞ లేకపోతే మృత్యుదేవతే అయినా దరిచేరలేదు. అందువల్లనే అర్కపురిలో అలరారుతున్న అనసూయమ్మ ప్రాణద, ప్రాణదాత్రి.

**(సోదరులు శ్రీ కొండముది రామకృష్ణ, సోదరి శ్రీమతి భవానీకుమారి గార్లకు కృతజ్ఞతలతో....)**



**"పుట్టాడని సంతోషం, పోయాడని దుఃఖమూ లేకపోవడం అమృతత్వం" - అమ్మ**

# 14. ముక్తిదా

**దేహ విభ్రాంతి తొలగించి, దివ్య ధామ**
**మిచ్చి, తన యొడి జేర్చి, లాలించు తల్లి**
**ముక్తిరూపిణి; ఆరాధ్యమూర్తి యైన**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"శివాత్మకమైన లలితాదేవిని ప్రార్థిస్తే, మోక్షం లభిస్తుంది. పరాశక్తిని పూజించినవారు సంసార బంధాల నుంచి విముక్తులవుతారు. మోక్షప్రదాత్రి అయిన శ్రీమాత ముక్తిద".

"ఆత్మతాదాత్మ్యాన్ని గుర్తించడమే ముక్తి. గురూపదేశం చేత స్వస్వరూపజ్ఞానం పొందిన సాధకునికి భవం బంధం కాదు. అలాంటి స్థితే ముక్తి. ఆ ముక్తిని ప్రసాదించే తల్లి ముక్తిరూపిణి" – భారతీవ్యాఖ్య.

సామాన్యమానవులమైన మనకు మోక్షం గురించి ఏదో కొంత తెలుసు అని అనుకున్నా, ఆ తెలిసిన కొంచెం కూడా ఆచరణలో మాత్రం అసాధ్యమే అవుతోంది. "భవం బంధం కారాదు" అనే భావం మనస్సులో ఉన్నా, మనుగడలో మాత్రం ఆ భావానికి తగినట్లు ప్రవర్తించలేకపోతున్నాం. భవసాగరంలో పడి, తలమునక లవుతూ, పెనవేసుకున్న బంధాలను తెంచుకోలేక సతమత మవుతూ, మోక్షాన్ని చేరుకోలేకపోతున్నాం. మన కర్మ పరిపక్వం చెందాక, ప్రారబ్ధం పరిసమాప్తమయ్యాక, ఎవరికి ఎప్పుడు ప్రాప్తమో, అప్పుడు వారికి మోక్షం లభిస్తుంది. "అందరికీ సుగతే" అని చెప్పిన "అమ్మ" – "ముందు వెనుకలుగా" అని కూడా చెప్పింది కదా ! శ్రీమాత అనుగ్రహం వల్ల భవబంధ మోక్షణం జరిగి, మోక్షం లభిస్తుంది. అంతవరకు సముద్రం లోని అలలవలె, ఈ జనన మరణ చక్రభ్రమణంలో కొట్టు మిట్టాడుతుండవలసిందే కదా !

"జాతస్య హి ధ్రువో మృత్యుః" అనే గీతావాక్యం మనకు అందరికీ తెలిసిందే. అయితే, 'మరణం' అనే ఆలోచన కలిగితే చాలు, నిలువెల్లా వణికిపోతాం. మనలో ఏదో తెలియని భయం చోటు చేసుకుంటుంది. మనకేమిటి? దిక్పాలురను సైతం

గడగడలాడించి ముల్లోకాలనూ జయించిన రాక్షసేశ్వరులకు కూడా మృత్యుభయం తప్పలేదు. అందుకే, వారు మృత్యువే లేకుండా వరాలు కోరుకున్నారు. కాని, అది సాధ్యం కాదని తెలిశాక, అసాధ్యమైన పద్ధతిలో మృత్యువును అంగీకరించారు. మృత్యుభయం చేతనే కదా! కంసుడు దేవకీదేవి సంతానాన్ని పసికందులని కూడా చూడకుండా, పురిటిలోనే హతమార్చాడు. తనను చంపేవాడు ఎక్కడో పెరుగుతున్నాడని తెలిసి, తన చెల్లెలి పిల్లలనే కాదు; తన రాజ్యంలోని పసిపిల్లలందరి చావుకూ కారకుడైనాడు. ఇలా, సామూహిక శిశుహత్యలకు పాల్పడడం, అతనికి గల మృత్యుభయంవల్లనే కదా ! లోకాలన్నింటినీ గడగడ లాడించినా,తాను మాత్రం మృత్యువంటే భయంతో వణికిపోయాడు. అందుకనే "అమ్మ" – "మృత్యుంజయత్వ మంటే మృత్యుభయం లేకపోవడమే" అన్నది.

"అమ్మ" ముక్తిద, ముక్తిరూపిణి. "అమ్మ" సన్నిధానంలో అసువులు బాసిన వారెందరో ఉన్నారు. అలాంటి వారిలో కోన వెంకాయమ్మగారు ఒకరు. ఆమె ధన్యురాలు. ఎందుకంటే బ్రహ్మాండ భాండోదరి అయిన "అమ్మ"కు అత్తగారు అయినందుకు, "అమ్మ" చేతుల మీదుగా భవసాగరాన్ని దాటి ఆవలిగట్టు చేరినందుకు. ధనుర్మాస శుభసమయంలో "అమ్మ" సన్నిధిలో "అమ్మ"తో సంభాషిస్తూ శరీరాన్ని వదలడం కంటే అదృష్ట మేముంటుంది ? చివరి ఊర్పువరకూ "అమ్మ"కు నమస్కరించుకోగల భాగ్యం ఆమెకు "అమ్మ" ఇచ్చిన వరం.

కోన వెంకాయమ్మగారికి తాను ఇంకాసేపట్లో మరణిస్తున్నట్లు "అమ్మ" మాటల వల్ల తెలుస్తూనే ఉంది. ఎందుకంటే, తుదిశ్వాస వరకు ఆమెకు తెలివి తప్పలేదు. అయినా, ఆమెలో తాను చనిపోతున్నాననే భయం ఏ కోశానా కనిపించలేదు. సరికదా! "నీ దగ్గరకు వస్తున్నాను. ఇప్పటికంటే ఇంకా దగ్గరగా ఉంటాను అనిపిస్తున్నది" అన్నది. అలా ప్రశాంతంగా, నిర్భయంగా చెప్పగలిగిన మనోధైర్యం ఆమెకు "అమ్మ" అనుగ్రహ ప్రసాదమే. అంతిమ ఘడియలలో కూడా ముక్తిరూపిణి అయిన "అమ్మ"కు పూజ చేసుకోగలిగిన పుణ్యాత్మురాలు వెంకాయమ్మగారు (1.1.1968).

ఆమె పెద్దకుమారుడు డాక్టర్ సత్యంఅన్నయ్యతో పాటు "అమ్మ" కూడా ఆమెకు అంత్యక్రియలను నిర్వహించడం ఆమె చేసుకున్న మహద్భాగ్యం. "అమ్మ"

తన దివ్యహస్తాలతో ఆమెశిరస్సుకు కర్పూరజ్వాలతో నిప్పుపెట్టి, నేతి దీపారాధనలోని వత్తిని ఆమె తలక్రిందపెట్టి, మూకుడులోని నేతిని ఆమెమీద పోసి, వెంటనే చకచకా పసుపు, కుంకుమ, పూలు, కర్పూరపుపొడి ఆ ముత్తైదువపై చల్లి, కొబ్బరికాయ కొట్టి, ఆమె అంతిమయాత్రను నిర్విఘ్నంగా పూర్తిచేసింది.

భగవతి అయిన "అమ్మ" కోన వెంకాయమ్మగారికి తన చేతులమీదుగా అంత్యక్రియలు నిర్వర్తించి ఆమెను పరలోకానికి సాగనంపింది. ముక్తిద అయిన "అమ్మ" ఆమెకు మోక్షాన్ని ప్రసాదించింది. వెంకాయమ్మగారి చివరిదశలో ఆమెకు భవబంధ మోక్షణం కలిగించిన "అమ్మ" ముక్తిరూపిణిగా భాసించింది. అర్కపురిలోని అందరింట్లో అలరారుతున్న అనసూయమ్మను ముక్తిదగా, ముక్తిరూపిణిగా దర్శించి, స్మరించి, సేవించి తరిద్దాం.

('అర్కపురి లేఖలు' రచయిత్రికి కృతజ్ఞతలతో...)



నీపై నమ్మిక నాకు నిచ్చుగద శాంతిన్ దాంతి నానందమున్
నీపై ప్రేమ యొసంగు గాదె విమల స్నిగ్ధానురాగంబునున్
నీపై భక్తి యిడుం గదా సకలమున్ నీ వన్న సద్భావమున్
నీపై రక్తి విముక్తి నీక యితర స్నేహంబులన్ గూర్చునే.

శరణము సొచ్చినాడ, నొక సారియ కా దొక వేయిసార్లు నీ
చరణము లంటినాడ, ననిశంబును నీ శుభనామవర్ణముల్
కరము జపించినాడ, కరకంజములన్ ముకుళించి మన్ననో
భర మెఱిగించినాడ, నిక పాలన సేయవె జాగు సేయకే.

నాదగు జీవయాత్ర ఒక నాటిద ? ఎన్నియుగాల నుండియో
నీదరి జేరగా సలుపు నిశ్చితమైన ప్రయత్న ! మందులో
నాదు విపశ్చితత్వమును నా యిహలోక ఘనత్వ మంతయున్
సోదికి రావు నీదరికి జొచ్చిననా డతి పేలవంబులై.

-డా॥నారపరాజు శ్రీధరరావు

# 15. నిర్వాణ సుఖదాయినీ

**ఎట్టి వైకల్యములు లేక, యెవ్వరైన**
**బ్రతుకు బాటను చరియించు భాగ్య మొసగు**
**నిత్య నిర్వాణ సుఖదాయి, నిగమవేద్య**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"నిర్వాణమంటే మోక్షం. మోక్షసుఖాన్ని ప్రసాదించే లలితాదేవి నిర్వాణ సుఖదాయిని" – భారతీవ్యాఖ్య.

ధర్మార్థ కామమోక్షాలు అనేవి పురుషార్థాలు. ధర్మబద్ధమైన జీవితం గడుపుతూ, మనుగడ కోసం అర్థాన్ని (డబ్బు) సంపాదించుకుంటూ, సక్రమమయిన పద్ధతిలో కామాన్ని నెరవేర్చుకుంటూ, ఏ వ్యక్తి జీవిస్తాడో, అతడు తురీయ పురుషార్థమైన మోక్షాన్ని శ్రీమాత అనుగ్రహంతో అవలీలగా పొందగలుగుతాడు. అంటే – మంచి నడవడికతో, పరోపకారబుద్ధితో, భగవచ్చింతనతో జీవనయానం సాగించేవారి నిర్యాణం – నిర్వాణ మౌతుంది. జైన, బౌద్ధ మతాలు ప్రశాంత మానసిక స్థితినే మోక్షం అన్నాయి. "అమ్మ" కూడా "వైకల్యం లేనిదే కైవల్యం" అని చెప్పింది. అందువల్ల – మొదటి మూడు పురుషార్థాల విషయంలో అప్రమత్తంగా ఉంటే, నాలుగవ పురుషార్థాన్ని సాధించడం నల్లేరు మీద బండి నడక అవుతుంది. అలాంటి మోక్షాన్ని ప్రసాదించే లలితాదేవి నిర్వాణ సుఖదాయిని.

శ్రీరామచంద్రుడు – జటాయువు, శబరి వంటివారికి మోక్షం ప్రసాదించాడు. భాగవతంలోని శ్రీకృష్ణలీలలు అవాఙ్మానస గోచరమైనవి. బాల్యంలోనే తన్ను చంపడానికి వచ్చిన పూత–న (పూతన) అనే రక్కసిని చంపడంతో (పరిపూతగా మారింది) ప్రారంభమైన రాక్షస సంహార కార్యక్రమం ఎందరో రాక్షసులను పరిమార్చడంతో పరిసమాప్తమయింది. దుష్టశిక్షణ కార్యక్రమంలో భాగంగా వారిని చంపి, ఆగ్రహరూపంలో వారిని అనుగ్రహించాడు శ్రీకృష్ణపరమాత్మ. భగవంతుని చేతిలో మరణించడమూ మోక్షమే. అందువల్లనే రామాయణంలో మారీచుడు ఎలాగైనా తనకు చావు తప్పదు – అని గ్రహించి, దుర్మార్గుడైన రావణుని చేతిలో చావడం కంటే, శ్రీరాముని చేతిలో మరణించడం మేలు – అనుకున్నాడు.

"అమ్మ" నిర్వాణ సుఖదాయిని. "అమ్మ"సన్నిధిలో ప్రాణాలు కోల్పోయిన వారెందరో అమరజీవులైనారు. అలాంటివారిలో పోతుకూచి రవీంద్రనాథ్ ఒకడు. అతడు అమ్మ దివ్యకరస్పర్శానుభూతిని తుది శ్వాసవరకు పొందుతూ, ఆ తల్లి చల్లని ఒడిలో శాశ్వతనిద్ర పొంది తరించాడు. పోతుకూచి రవి 1962లో ప్రాణాపాయస్థితి నుంచి తప్పించుకున్నాడు. అప్పటినుంచీ "అమ్మ" అనుగ్రహమే తన్ను బ్రతికించింది అని త్రికరణశుద్ధిగా నమ్మి, "అమ్మ" ఇచ్చిన జీవితాన్ని "అమ్మ" సేవకే అంకితం చేయాలనుకున్న పరమభక్తశిఖామణి. గుండెజబ్బు అతని కార్యదీక్షకు, కర్తవ్యనిష్ఠకు ఎలాంటి భంగం కలిగించలేదు. తన ఆరోగ్యం, ఆహారంపై కాక, ఆవరణ సౌభాగ్యం, పరిశుభ్రతలపై అతని ఆలోచనలు నిరంతరం పరిభ్రమిస్తూ ఉండేవి. అతని మనస్సంతా "అమ్మ" నామంతో నిండి ఉండేది. "అమ్మ" ధ్యానం అతనికి అవిశ్రాంతంగా అభ్యాసంలో ఉండేది. "అమ్మ" పాటలు అతని ఆధ్యాత్మిక జీవన గమనానికి రాచబాటలయినాయి. అందువల్లనే అతడు భౌతికంగా అమ్మకు దూరంగా ఉన్నా, "అమ్మ" మాత్రం ఎప్పుడూ అతని చెంతనే ఉండేది. వేదికమీదో, మంచంపైనో అందరూ దర్శించే "అమ్మ", అదే వేషధారణతో అతనికి పొలంగట్టునో, కాలువ ఒడ్డునో కనిపించేది. "అమ్మ" కరస్పర్శలోని హాయిని తనివితీరా అనుభవించి, ఆనందించేవాడు. అతని అంతిమ ఘడియల్లో "అమ్మ" అతని వద్దనే ఉండి, తీర్థం ఇచ్చి, తన ఒడిలోకి తీసుకుని, ప్రేమగా లాలిస్తూ, తనలో కలుపుకుంది. (25. 2. 1967). తానే స్వయంగా అతని భౌతికకాయానికి కర్పూరహారతితో నిప్పు అంటించి, అతనికి నిర్వాణపదాన్ని అనుగ్రహించింది "అమ్మ".

తన అంతిమ ఘడియను ముందుగానే "అమ్మ" ద్వారా తెలుసుకుని కూడా రవి ఏ మాత్రమూ భయపడలేదు. బాధపడలేదు. రోజురోజుకీ, గంటగంటకీ ఆరోగ్యం క్షీణిస్తున్నా, శరీరం శుష్కిస్తున్నా అతని ముఖంలో కాంతి ఏమాత్రం తగ్గలేదు. అమ్మను చేరుకుంటున్నాననే తృప్తి మనస్సు నిండా ఉంటే, ఇక మరణభయం ఏముంటుంది? అందరింటి ఆవరణలో "అమ్మ" కార్యక్రమాలకు తన మనస్సునూ, శరీరాన్ని ఎప్పుడో సమర్పించుకున్నాడు. ఇప్పుడు శిథిలావస్థలో ఉన్న దేహాన్ని వదలి, జీవాత్మ, పరమాత్మతో ఐక్యం కాబోతున్న శుభసమయం ఆసన్నమవుతూ ఉంటే, "అమ్మ"ను చేరుకోవాలనే కోరిక తొందరపెడుతూ ఉంటే, "అమ్మ" చరణసన్నిధిలోనే ఉన్న అతనికి దేనికి బాధ ? ఎందుకు భయం?

అతని మరణానికి దుఃఖిస్తున్న వారితో – "వాడు ఎక్కడికి పోయాడని బాధపడుతున్నారు ? వాడు నా దగ్గరే ఉన్నాడు" అని "అమ్మ" అనడం కంటే జీవితానికి ధన్యత్వ మేముంది ? అతని జన్మ చరితార్థ మయింది. అలా అతనికి నిర్వాణపదాన్ని అనుగ్రహించిన "అమ్మ" నిర్వాణ సుఖదాయిని. మనకు కూడా ప్రశాంత మానసిక స్థితిని ప్రసాదించమని ఆ "అమ్మ"ను ప్రార్థించుకుందాం.

("అర్కపురిలేఖలు" – రచయిత్రికి – కృతజ్ఞతలతో)



నునుసోగ కన్నుల పెను సోయగంబును
చాటునే హరిణాక్షు లోట లేక
నెన్నుదురు మిసిమి చిన్నెల వన్నెలం
బోలునే చంద్రుండు పొల్లువోక
నడలోని యడుగులం బడి నల్గు బెడగులం
జూపునే రాయంచ తీపులేక
మాటల సూటిలో గోటి కెత్తెడు తీపి
వెలయించునే చిల్కవెలితి లేక
యిన్నిటిం ద్రోసి మెఱసెడు నింతితోడ
కలిమి లేములు ననిశంబు గలతపడెడు
పద్మగర్భుని సృష్టి యేపాటి సాటి
ఆమె కామెయె సాటి, కాకేమి యగును.

-డా॥నారపరాజు శ్రీధరరావు

# 16. అనర్ఘ్య కైవల్యపదదాయినీ

**అంకితమ్మైన భక్తుల నాదరించి**
**సత్త్వమున నిల్పి, నిశ్చల తత్త్వ మొసగి**
**ప్రథిత కైవల్యపదమును పంచి యిచ్చు**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"వేదాంత శాస్త్రం ప్రకారం ముక్తి నాలుగు విధాలు. 1. సాలోక్యం - తాను కొలిచే దేవుని లోకానికి చేరుకోవడం. 2. సామీప్యం - తన ఆరాధ్య దైవానికి సమీపంలో ఉండడం. 3. సారూప్యం - తాను ఆరాధించే దేవుని రూపాన్ని పొందడం. 4. సాయుజ్యం - అఖండమైన పరమాత్మతో ఐక్యం కావడం. అయితే, ఈ నాలుగూ పునరావృత్తిని కలిగించేవే. అంటే, చేసుకున్న పుణ్యం పరిసమాప్తం కాగానే మళ్ళీ జన్మని ఇచ్చేవే. కైవల్య పదం చేరినవారికి పునర్జన్మ లేదు. అలాంటి కైవల్యాన్ని ప్రసాదించి, భక్తులకు ఆనందాన్ని కలిగించే శ్రీమాత కైవల్య పదదాయిని. అంటే, భక్తులలోని భక్తి స్థాయిని బట్టి, ఆయా రకాల మోక్షాలను అనుగ్రహిస్తూ, భక్తిలో పరాకాష్ఠను చేరుకున్న భక్తులకు అనర్ఘ్య (అమూల్య)మైన కైవల్యపదాన్ని ప్రసాదిస్తుంది శ్రీమాత. సర్వవ్యాపకమైన ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవడమే కైవల్యం. ఆ కైవల్య పదం లలితాదేవి అనుగ్రహం వల్ల సంప్రాప్తమౌతుంది. కనుక, శ్రీమాత అనర్ఘ్య కైవల్య పదదాయిని" - భారతీ వ్యాఖ్య.

"శ్రీకైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్" అని బమ్మెర పోతనామాత్యుడు ప్రకటించాడు. మనలో ప్రతి ఒక్కరికీ ఆ కోరిక అంతో ఇంతో ఉంటూనే ఉంటుంది. అయితే, సామాన్య మానవులమైన మనకు, పైన పేర్కొన్న మోక్షాలలో ఏ ఒక్కటీకూడా, వేల వేల జన్మలకు గాని సాధ్యంకాదు. ఎంతో తపస్సు, సంబుద్ధి కల ఏ కొద్దిమందికో అమ్మ దయవల్ల ఈ నాలుగు రకాల మోక్షాల్లో - వారి వారి స్థాయిని బట్టి, ఏ ఒక్కటో లభిస్తుంది. ఇక, కైవల్యపదం అందుకోవాలంటే, అది

మన ఊహకు కూడా అందని విషయం. అంతటి ఉత్కృష్టమైన కైవల్య పదాన్ని లలితాదేవి అనుగ్రహ విశేషంతో చేరుకున్న ధన్యజీవులు - ఇంతటి సృష్టిలో కోటికొక్కరు ఉంటారు అనడం కూడా ఆలోచించాల్సిన విషయమే.

"అమ్మ" అనర్ఘ్య కైవల్య పదదాయిని. "అమ్మ" అనుగ్రహంతో ఆ అనర్ఘ్య కైవల్య పదాన్ని చేరుకున్న హైమక్క అదృష్టం ఇంతింత అని చెప్పలేం. "అమ్మ"కు పుట్టడమే హైమక్క పూర్వపుణ్యఫలం. అంతేకాదు. ప్రేమ, దయ, శాంతం, సహనం వంటి "అమ్మ"గుణాలను పుణికిపుచ్చుకుని, కొన్ని కొన్నిసార్లయితే, "అమ్మ" కంటే ఎక్కువగా వాటికి వశమై ప్రవర్తించిన హైమక్క కైవల్య పదాన్ని పొందడానికి సంపూర్ణమైన అర్హతను సంపాదించుకుంది. హైమక్క అర్హతను గుర్తించింది కనుకనే, "అమ్మ" - మనతో తిరుగుతూ, మనలో ఒకతెగా మసలుతూ ఉన్న హైమక్కలోని అత్మతత్త్వజ్ఞానాన్ని పరిశీలించి తత్ఫలితంగా ఆమెకు స్వస్వరూపాన్ని అనుగ్రహించి, మనకు ఆరాధ్యదేవతగా ఆలయంలో ప్రతిష్ఠించింది. అంటే, హైమక్కకు అనర్ఘ్య కైవల్య పదాన్ని ప్రసాదించింది. అలా అనర్ఘ్య కైవల్య పదదాయినిగా మనకు సాక్షాత్కరించింది "అమ్మ".

హైమక్కతో నాకు పరిచయం కొంచెమే. అయితే, ఆ కొద్దికాలంలోనే ఆమెలో గల ఆత్మతత్త్వజ్ఞానాన్ని తెలుసుకోగల అదృష్టం నన్ను వరించింది. "అమ్మ" హైమక్కను వైద్యం కోసం చీరాలలో మా నాన్నగారి వద్ద కొంతకాలం ఉంచింది. అది పైకి కనిపించే కారణం. అయితే, హైమక్కను అలా మా ఇంట్లో ఉంచి, ఆమెతో సాన్నిహిత్యం మాకు కలిగించడం - మేము చేసుకున్న పుణ్యం. మా నాన్నగారు చేసిన వైద్య చికిత్సలు నిజంగా ఫలించి ఉంటే, హైమక్క అంత తొందరగా మనకు దూరమయ్యేది కాదు కదా! "అమ్మ" సంకల్పం వేరు. అందుకే ఈ వైద్య పరీక్షలు, చికిత్సలు హైమక్క ప్రాణం నిలపడానికి ఏమీ పనిచేయలేక పోయాయి. అంతటా "తానే" నిండి ఉన్నాననే జ్ఞానాన్ని, పరిపక్వ స్థితిని హైమక్కకు కలిగించడానికి, ఆమె ద్వారా సర్వవ్యాపకమైన ఆత్మతత్త్వాన్ని గుర్తించమని మనకు తెలియజేయడానికి, "అమ్మ" ఆడించిన నాటకంలోని భాగాలే ఈ సంఘటనలన్నీ.

కాబట్టే, ఎందరో వైద్యులు ఎన్నో రకాలుగా ప్రయత్నించినా హైమక్కకు గల వ్యాధిని ఏమాత్రమూ తగ్గించలేక పోయారు. "అమ్మ" నిర్ణయమే అమలు జరిగింది.

"చీమలో దోమలో కాదు. చీమగా దోమగా ఉన్నది నేనే" - అని "అమ్మ" చెప్పిన మాటను మనమందరం విన్నాం. కాని, దాన్ని ఆచరణాత్మకంగా అనుభవంలోకి తెచ్చుకున్న మహామనీషి హైమక్క. ఆమెలోని ఆత్మతత్త్వజ్ఞానం ఎన్నో సందర్భాల్లో, ఎన్నో రకాలుగా వ్యక్తమయింది. పంచదారలోని తీపికి ఆశపడిన చీమ, అందులో ఉండి, దాన్ని కాఫీలో వేయగానే, ఆ వేడికి చనిపోతే, బాధపడుతూ, కాఫీ తాగలేకపోయిన హైమక్క, ఆ చిన్న చీమలోని ఆత్మ తత్త్వాన్ని - గ్రహించింది. దొంగతనాలు, దోపిడీలు చేసినవారు పొరపాటువల్లనో, గ్రహపాటు వల్లనో పోలీసులకు చిక్కి, పోలీసు స్టేషనులో లాఠీ దెబ్బలు తింటూ, బాధతో అరుస్తుంటే, ఆ అరుపులకు వ్యధ చెందిన హైమక్కలోని అవ్యాజకరుణ ఆమెలోని ఆత్మతత్త్వ జ్ఞానానికి ప్రత్యక్ష నిదర్శనం. తాను చావు బతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్న సమయంలో, మా నాన్నగారితో పాటు నేనూ హైమక్కను చూడాలనే కోరికతో జిల్లెళ్ళమూడికి వెళ్ళాను. నన్ను చూస్తూనే, తనకున్న కొద్దిపాటి జీవశక్తిని కూడదీసుకుని, అప్పటి నా పబ్లిక్ పరీక్షను గురించి - "పరీక్షకు వెళుతున్నావా ? బాగా చదివావా ?" అని అడుగుతుంటే, బాధపడుతున్న హైమక్కను చూడలేక, కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరుగుతుంటే, నోటమాట రాక, మౌనంగా తల ఊపడం నా వంతయింది (నా 'వంత' అయింది). అంత బాధలోనూ, నా పరీక్షను గుర్తుపెట్టుకుని ప్రశ్నించిన హైమక్క - సహనానికి మరో పేరా ? అనిపించింది.

చావు బతుకుల మధ్య పోరాటం తనది. గెలుపు ఎటో ? ఎవరికీ అర్థం కాని అయోమయ పరిస్థితి. "అమ్మ"కు మాత్రమే తెలిసిన హైమక్క నిజస్థితి. ఆ సమయంలో హైమక్క ప్రదర్శించిన సంయమనం యోగి పుంగవులకు, జ్ఞానులకు మాత్రమే సాధ్యం. మామూలు మానవులకు అసాధ్యం. అది "అమ్మ" ఆమెకు పెట్టిన ఆఖరి పరీక్ష. అంతకుముందు "అమ్మ" పెట్టిన అన్ని పరీక్షల్లోనూ ప్రప్రథమ స్థానాన్ని సంపాదించుకున్న హైమక్క ఈ 'ఫైనల్ ఎగ్జామ్' లో కూడా తన స్థాయిని ఏమాత్రం తగ్గించుకోలేదు. అత్యున్నత స్థానంలో నిలిచి, జగమంతా

"అమ్మ"మయంగా, అంతటా "అమ్మ"నే దర్శిస్తూ, "వస్తున్నానమ్మా !" అంటూ "అమ్మ"లో ఐక్యమయింది. "అమ్మ" అనుగ్రహాన్ని సంపూర్ణంగా పొంది, అసాధ్యమైన అనర్ఘ్య కైవల్య పదాన్ని కరతలామలకం చేసుకున్న భాగ్యశాలిని హైమక్క. ఆమెకు అనర్ఘ్య కైవల్య పదాన్ని అనుగ్రహించిన "అమ్మ" అనర్ఘ్య కైవల్య పదదాయిని.

హైమమ్మ సన్నిధి అదే మనకు పెన్నిధి

కనిపించని దైవమే కనిపించెను హైమలో.



జిలుగంచు తెలిచీర చెలువంబునకు జోక
యెట్లు ధూసరమైన యీ శిరంబు
చిగురుటాకుల చెల్వు నగు పదంబుల కుద్ది
యెట్లు కర్కశమైన యీ శిరంబు
పగడంబులకు దియ్య మగు కరంబుల కెన
యెట్లు మృణ్మయమైన యీ శిరంబు
వెలుగుబాటల జూపగలుగు ప్రజ్ఞకు బోల్కి
యెట్లు కాసిలమైన యీ శిరంబు
హస్తి మశకాంతర న్యాయ మనుట లెస్స
తల్లి బోలని సుతు దుప్పతిల్లినాడు
వీని దరిజేర్చి ప్రోచుటే పెద్ద వింత
వింతలకు వింత మన పొత్తు విశ్వమంత

-డా॥నారపరాజు శ్రీధరరావు

# 17. వాంఛితార్థప్రదాయినీ

**లేదనెడు మాట తనయొద్ద లేదు గాన,**
**బిడ్డ లేమేమొ కోరిన, ప్రేమ మీఱ**
**వాంఛితార్థమ్ము లొసగుచు 'వరద' యైన**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"భక్తుల కోరికలను నెరవేర్చే శ్రీమాత వాంఛితార్థ ప్రదాయిని. భక్తుల కోరికలు పలురకాలు. అన్నిరకాల భక్తుల కోరికలను తీర్చే తల్లి కనుక శ్రీ లలితాపరమేశ్వరి వాంఛితార్థప్రదాయిని" – భారతీవ్యాఖ్య.

"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ"– భగవద్గీత. ఆర్తుడు అంటే ఆపదల్లో భగవంతుని అర్చించేవాడు. జిజ్ఞాసువు అంటే పరతత్త్వాన్ని తెలుసు కోవాలనే కోరికతో ప్రార్థించేవాడు. అర్థార్థి అంటే ధనాన్ని కోరి దేవదేవుని పూజించేవాడు. జ్ఞాని అంటే ఆత్మజ్ఞానం పొంది, పరమాత్మను ధ్యానించేవాడు – అని భక్తులను గురించి గీత ప్రవచిస్తోంది.

"అమ్మ" వాంఛితార్థ ప్రదాయిని. "అమ్మ" మనందరినీ భక్తులుగానో, శిష్యులుగానో అంగీకరించలేదు, తన బిడ్డలుగా భావించింది. తన బిడ్డల కోరికలను తీర్చడం తల్లిగా తన కర్తవ్యం అనుకున్నది "అమ్మ". లోకంలో సామాన్యమైన తల్లి కూడా తన పిల్లల కోరికల్లో ఉచితమని తనకు తోచిన వాటినే నెరవేర్చడానికి ఇష్టపడుతుంది. తన బిడ్డకు హానికలిగించేవి, వాడికి అనవసరమైనవి అని తాను అనుకున్నవాటిని తీర్చే ప్రయత్నం చేయదు; సరికదా ! తన బిడ్డ మనస్సును అటువంటివాటి నుంచి మరల్చడానికి తీవ్ర కృషి చేస్తుంది. "అమ్మ" కూడా మన యిష్టా యిష్టాలకు ప్రాధాన్య మీయకుండా, ఎప్పటి కేది ఉచితమో, అప్పటికి అది తీరుస్తూ, వాంఛితార్థప్రదాయినిగా ప్రకాశించింది.

విశ్వజనని అయిన "అమ్మ"కు ఆమెరక్తం పంచుకు పుట్టిన బిడ్డలలో మనమందరమూ ఆరాధ్యదేవతగా ఈనాడు ఎవరిని పూజిస్తున్నామో ఆ హైమక్క ఒకతె. "అమ్మ"ను హైమక్క, తల్లిగా కంటె కూడా దైవంగా ఆరాధించింది. "ఏ పూర్వ పుణ్యమో నీ పొందుగా మారి" అని, తాను "అమ్మ"కు బిడ్డగా పుట్టడం తన

పూర్వజన్మ పుణ్యమని ఎన్నోసార్లు తలపోసింది. "అమ్మ"కు సేవచేసుకుంటూ "అమ్మ"సన్నిధిలో ఎక్కువగా కాలం గడపాలని కోరుకునేది. అలా గడుపుతున్న వసుంధర అక్కయ్యలాంటి వారి అదృష్టానికి "వారెంత పుణ్యం చేసుకున్నారో" అని భావించేది. అనారోగ్య కారణంగా హైమక్కను వైద్యం నిమిత్తం ఎక్కడెక్కడికో పంపించేది "అమ్మ". అందుకు బాధపడే హైమక్క "అందుకోజాలనీ ఆనందమే నీవు, ఎందుకో చేరువై దూరమౌతావు" అని పాడుకునేది. "అమ్మ"కు ఎంత సన్నిహితంగా ఉండాలనుకుంటున్నానో అంత దూరంగా ఉంచుతోంది "అమ్మ" నన్ను –అని బాధపడేది. అయితే, హైమక్క బాధ గ్రహించినా, "అమ్మ"మాత్రం హైమక్క ఆరోగ్యంపై దృష్టిపెట్టి, వైద్యం కోసం వేరే ఊళ్ళల్లో ఉంచుతుండేది. "నీలిమేఘాలలో గాలికెరటాలలో నీవు పాడే (జోల) పాట వినిపించు నీ వేళ" అని శారీరకంగా దూరంగా ఉన్నా, మనస్సంతా "అమ్మ" భావనతో "అమ్మ" లాలనలో కాలం గడిపే హైమక్క ఎంతో గొప్ప "మిస్టిక్". (నీలిమేఘాలలో .. పాట హైమక్కకు చాల ఇష్టం. దాన్ని అమ్మ పరంగా అన్వయించుకుని ఆ పాట పాడుకుని పరవశించేది).

"అమ్మ"కు సన్నిహితంగా ఉండాలనే కోరికతో పాటు, హైమక్కలో షిరిడీసాయిని దర్శించాలనే కోరిక బలంగా ఉండేది. అయితే అంత దూరాన ఉన్న సాయినాథుణ్ణి చూడటానికి, అనారోగ్యం కారణంగా తాను వెళ్ళడం చాలకష్టమని, తన కోరిక తీరదేమో అని అనుకునేది. 'అమ్మ'పై అపరిమితమైన భక్తిగల హైమక్క, ఆ కోరిక తీర్చే పూర్తి బాధ్యత "అమ్మ"దే అనే సంపూర్ణ విశ్వాసంతో ఉండేది. భక్తుల నమ్మకాన్ని భగవంతుడు వమ్ము చేయడు కదా ! అందుకే, షిరిడీనాథుని చూడాలనే హైమక్క కోరికను నెరవేర్చి, ఆమెకు ఎంతో ఆనందాన్ని కలిగించింది వాంఛితార్థప్రదాయిని అయిన "అమ్మ". ఆ తర్వాత కొద్దికాలానికి హైమక్క కోరికపైనే ఆమెను ఇహలోక కష్టాల నుంచి దూరం చేస్తూ, తనలోకి లీనం చేసుకుంది "అమ్మ". తనకు దూరంగా ఉండలేని హైమను తనలో కలుపుకుని, (5.4.1968) హైమక్క కోరికను నెరవేర్చిన "అమ్మ" వాంఛితార్థప్రదాయిని. అర్కపురిలో అవతరించిన వాంఛితార్థప్రదాయిని అనసూయమ్మకు అంజలి ఘటిస్తూ–



"నాది తెలిసీ తెలియని స్థితి" - అమ్మ

# 18. పుణ్యాపుణ్య ఫలప్రదా

**పుణ్య మొనరింప నెంతయో పులకరించు**
**పాపఫలమును ప్రక్కనే పాదుకొలుపు**
**సకల జీవుల కర్మల సాక్షియైన**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"ధర్మకార్యాచరణ పుణ్యం. అధర్మప్రవృత్తి పాపం. పుణ్యపాపాలను ఆచరించే వారికి – పుణ్యానికి పుణ్యఫలం, పాపానికి పాపఫలం ప్రసాదించే శ్రీమాత పుణ్యాపుణ్యఫలప్రద" – భారతీవ్యాఖ్య.

నిత్యజీవితంలో ఎన్నోరకాల ప్రవృత్తుల వారిని మనం చూస్తూ ఉంటాం. వారిలో కొందరు అతిమంచివారైతే, మరి కొందరు దుర్మార్గులు. ఇంకొందరు తటస్థులు., ఇలా రకరకాల వారు ఈ లోకంలో మనకు తారసపడుతూ ఉంటారు. అయితే దుర్మార్గులుగా మనం భావిస్తూ, భయపడుతున్న వ్యక్తులు పరమసుఖాల్లో మునిగితేలుతూ సుఖసంతోషాలతో హాయిగా కాలంగడుపుతూ కనిపిస్తారు. ఎవరినైతే మనం మంచివారు, సాధుస్వభావులు అని అనుకుంటామో వారు అన్నీ కష్టాలనే అనుభవిస్తూ, దుఃఖనిమగ్నులై దుర్భరజీవితాన్ని గడుపుతూ కనిపిస్తారు. ఇదేమిటీ? అది అంతే. ఈ జన్మలోని సుఖదుఃఖాలు ఈనాటివి కావు. "చేసుకున్నవారికి చేసుకున్నంత", "పెట్టిపుట్టాడు" వంటి సామెతలు ఊరికే పుట్టలేదు. ఎందరి జీవితాలనో కాచి వడబోసిన పెద్దలు జీవితానుభవంతో చెప్పిన ఆణిముత్యాలు ఈ సామెతలు. ఈ జన్మలోని సుఖదుఃఖాలకు పూర్వం మనం చేసుకున్న కర్మలు కారణమవుతూ ఉంటాయి. అందుకే, ప్రారబ్ధం, సంచితం, ఆగామి – కర్మలని చెప్పుకుంటూ ఉంటాం. శ్రీ లలితాదేవి మనం చేసుకున్న పుణ్యకర్మలకు పుణ్యఫలాన్ని, పాపపు చేష్టలకు పాపఫలితాన్ని నిష్పక్షపాతంగా అనుభవించేలా చేస్తుంది. కనుక ఆమె పుణ్యాపుణ్యఫలప్రద.

"అమ్మ" పుణ్యాపుణ్యఫలప్రద. "అమ్మ" బిడ్డలలో ఒకరైన కీ॥శే॥డా॥ నారపరాజు శ్రీధరరావుగారిని పుణ్యాపుణ్య ఫలప్రదగా "అమ్మ" అనుగ్రహించిన తీరు ఒక విచిత్రోదతం.

కీ॥శే॥ నారపరాజు శ్రీధరరావుగారు చీరాలలో గొప్ప వైద్యులుగా పేరు పొందారు. ఏ డాక్టరుకూ లొంగని మొండి జబ్బులు కూడా వారి వైద్యచికిత్సలో తగ్గి, పేషంట్లకు ఆరోగ్యాన్ని, ఆనందాన్ని కలిగించాయి. వైద్యవృత్తిలో ఉన్నా, ఆయన సాహిత్యాధ్యయనం చేసి, బహుగ్రంథకర్తలుగా ప్రసిద్ధికెక్కారు. “అమ్మ” అనుగ్రహం వల్ల తమకు కవిత్వం అలవడినట్లు వారే స్పష్టంగా చెప్పుకున్నారు. తనలో పెల్లుబికిన కవితాధారతో “అమ్మ”నే అభిషేకించిన ధన్యులు శ్రీధరరావుగారు. ఇదంతా వారి పూర్వ పుణ్యఫలం. పుణ్యఫలప్రదాయిని అయిన “అమ్మ” శ్రీధరరావుగారిని ఒక గొప్పరచయితగా తీర్చిదిద్ది, మహాకవుల సరసన కూర్చోబెట్టింది. ఘనంగా సత్కరించింది.

1986-1992 సంవత్సరాలు శ్రీధరరావుగారి జీవితంలోని చీకటిరాత్రులు. ఈ ఆరేళ్ళూ వారు మంచానికే పరిమితమైనారు. శరీరంలోని అన్ని అవయవాలూ క్షీణించి, పనిచేయడానికి మొరాయించాయి. ఇది ఏనాటి అపుణ్యఫలితమో ఇలా వారు అనుభవించడం జరిగింది. అయితే విచిత్రమేమిటంటే, ఇంతటి శారీరక బాధల్లోనూ వారి మనస్సు సాహిత్యాధ్యయనం నుంచి మరలలేదు. మంచం చుట్టూ పుస్తకాల బల్లలు. ఎప్పుడూ చదువుకుంటూ ఉండేవారు. అంతేనా ! జీవిత చరమాంకంలో పరిపక్వ మానసికస్థితిలో వారు “యోగసంగ్రహము” అనే గ్రంథాన్ని రచించారు. ఆ గ్రంథావిష్కరణ 1992 ఆగష్టు 8న పొన్నూరులో వైభవంగా జరిగింది. 1992 డిసెంబరు 9న వారు “అమ్మ” సన్నిధికి చేరుకున్నారు. చివరిక్షణంలో “అమ్మ” నామ స్మరణతో గాఢనిద్రలోనే దీర్ఘనిద్రలోకి జారుకున్నారు. ఆరేళ్ళుగా ఎంతబాధను అనుభవించినా, ఆఖరిక్షణంలో అనాయాసంగా “అమ్మ”ఒడిని చేరుకున్నారు. ఇది వారికి “అమ్మ” ఇచ్చిన వరం, వారికి దక్కిన పుణ్యఫలం.

పుణ్యాపుణ్యఫలప్రద అయిన “అమ్మ” – శ్రీధరరావుగారికి శారీరక రుగ్మతను కలిగించి, శరీరాన్ని బాధకు గురిచేసినా, మానసికంగా చివరిక్షణం వరకు వారికి మంచి ధారణా పటిమను, ఆలోచనాశక్తిని, కవితాసక్తిని అనుగ్రహించింది. 1992 డిసెంబరు 8వ తేది రాత్రి కూడా వారు ఒక శతకాన్ని వ్రాయాలనే కోరికను వ్యక్తం చేశారు. అంతటి రచనాసక్తి వారిది. వారి శారీరక బాధను, మనస్సుకు సోకకుండా చేసిన మహిమాన్విత మూర్తి “అమ్మ”. వీరి జీవితానుభవాలలో “అమ్మ” పుణ్యాపుణ్య ఫలప్రదగా కనిపించింది. “అమ్మ” అనుగ్రహ వీక్షణం మనందరిపై నిరంతరం ప్రసరించాలని అర్థిస్తున్నాను.



**“అనుకున్నది జరగదు, తనకున్నది తప్పదు” అమ్మ**

# 19. సద్గతిప్రదా

**సర్వమంగళమూర్తియై, యుర్వి మీద**
**తన్ను నెఱనమ్మి సేవించు తనయులకును**
**సద్గతిని గూర్చి, యెనలేని శాంతి నొసగు**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"అమ్మను నమ్మినవారికి ఆత్మజ్ఞానం కలుగుతుంది. ప్రాపంచిక వ్యామోహం పటాపంచలవుతుంది. దేవిని ఆరాధించడంవల్ల పాపప్రవృత్తితొలగి, సత్కర్మాచరణ ఏర్పడుతుంది. అలా సాధకునికి సన్మార్గం చూపించి, స్వర్గం నుంచి మోక్షం వరకు గల సమస్త సద్గతులనూ ప్రసాదించే శ్రీమాత సద్గతిప్రద."

"అపవర్గమంటే మోక్షం. స్వర్గసుఖాన్ని మాత్రమే కాక, శాశ్వతమైన మోక్షసుఖాన్నీ అనుగ్రహించే శ్రీమాత స్వర్గాపవర్గద" – భారతీవ్యాఖ్య.

ఎన్నో జన్మల పుణ్యఫలితంగా ఏర్పడేది మానవజన్మ. సమస్త సృష్టిలో మానవజన్మ ప్రత్యేకమైనది. ఏ ప్రాణికీ లేని యుక్తాయుక్త విచక్షణజ్ఞానాన్ని భగవంతుడు మానవునికి అనుగ్రహించాడు. అయితే, బుద్ధిహీనులమయిన మనం ఆ వివేచన లేకుండా ప్రవర్తించి మనమే మనం చేసే కర్మలకారణంగా మళ్ళీ జన్మకు కారకులమవుతున్నాం. ఇలా ఈ జననమరణ చక్రభ్రమణంలో కొన్నివేల జన్మలు గడిపేస్తూ ఉంటాం. "అమ్మ" అనుగ్రహానికి పాత్రులమైనప్పుడు మాత్రమే మనలోని అజ్ఞానం నశించి, ఆత్మజ్ఞానం ఆవిర్భవిస్తుంది. అప్పటినుంచి ప్రయత్నిస్తూ ఉంటే, ఎన్నిజన్మలకో సద్గతి లభిస్తుంది. ఆ సద్గతి పొందాలంటే "అమ్మ" అనుగ్రహం ఉండాలి.

"అందరికీ సుగతే. కాస్త ముందు వెనుకల తేడా గాని" అని ప్రకటించిన "అమ్మ" సద్గతి ప్రద. స్వర్గాపవర్గద.

అమ్మ బిడ్డలమైన మనమంతా అమ్మను ఆరాధిస్తున్నాం. అయితే, మనలో కొద్దిమంది మాత్రం అమ్మ తత్త్వం లోని అమృతత్వాన్ని దర్శించి, స్మరించి, ఆచరించి తరించారు. వారికి సద్గతిని ప్రసాదించింది "అమ్మ".

అలాంటివారిలో ఒకరు వేటపాలెం నివాసి శ్రీరాజుపాలెం రామచంద్రయ్య గారు. "అమ్మ"ను దర్శించటానికి ముందే వీరు - శ్రీరమణమహర్షి, శ్రీ అరవిందయోగి, శ్రీ మెహర్‌బాబా, శ్రీ ఉపాసనీబాబా, శ్రీ లక్ష్మీకాంతయోగి, శ్రీ మౌనస్వామి, శ్రీ కంచికామకోటిపీఠాధిపతి, మాలపిచ్చమ్మ వంటి ఎందరో మహాత్ముల దర్శన భాగ్యంతో పునీతులై ఉన్నారు. వీరు మొదటిసారిగా "అమ్మ"ను 1957 నవంబరులో దర్శించారు. అప్పటికే బాగా దోరగా, పండుగా మారడానికి సిద్ధంగా ఉన్న రామచంద్రయ్యగారి హృదయ ఫలం "అమ్మ" దర్శనంతో పూర్తిగా పరిపక్వమై, తన్ను తాను "అమ్మ"కు సమర్పించుకున్నది. "అమ్మ"ను రకరకాల కోణాల్లో పరిశీలించి, పరిశోధించి, పరీక్షించిన వీరు ఎన్నోసార్లు "అమ్మ"ను దర్శించుకున్నారు. చివరకు సర్వసమర్పణ భావంతో "అమ్మ"కు ప్రణమిల్లారు. "అమ్మ" సంపూర్ణానుగ్రహానికి పాత్రులైనారు. "అమ్మ" బోధనలు విన్నారు, ఆచరించారు, అక్షరబద్ధం చేశారు. తద్వారా తమ జన్మ ధన్యం చేసుకున్నారు. 1980 జనవరి 30వ తేదీన అనాయాసంగా "అమ్మ"లో లీనమైనారు శ్రీ రాజుపాలెపు రామచంద్రయ్యగారు.

జొన్నాభట్ల వెంకట్రామయ్యగారు గుంటూరు వాస్తవ్యులు. వీరు మొదటిసారిగా 1961 జనవరి 14 ఉత్తరాయణ పుణ్యకాల ప్రారంభదినం నాడు "అమ్మ"ను దర్శించుకున్నారు. వారి జీవితంలో కూడా ఆరోజు ఎంతో పుణ్యదినం. మొదటి దర్శనంలోనే వారిని "అమ్మ" చాలా ప్రభావితం చేసింది. అప్పటివరకు లౌకిక విషయాసక్తిగల వీరు, "అమ్మ" దర్శనంతో పూర్తిగా మారిపోయారు. మోక్షసాధన కోసం - వేదాలూ, పురాణాలూ చదువనవసరం లేదని, పుణ్యతీర్థాల్లో స్నానమాడనక్కర లేదని, "అమ్మ" పాదసేవచేస్తూ, "అమ్మ" అనుగ్రహం పొందితే చాలని ప్రకటించారు. "అదే నా జీవితలక్ష్యం" అని 'మాతృశ్రీ' మాసపత్రికలో అక్షరరూపంలో ప్రకటించారు. అంతేకాదు, "అమ్మ" చెప్పిన సూక్తి "నీకున్నది తృప్తిగా తిని, ఇతరులకు ఆదరంగా పెట్టు." ఇందులోని ప్రతి అక్షరానికీ ప్రత్యక్షసాక్షిగా వీరు ప్రకాశించారు. వీరు 1980 జనవరి 18న జిల్లెళ్ళమూడిలో "ఐయామ్ వెరీ హేపీ" అంటూ తమ అంతిమఘడియలను గమనిస్తూ, మృత్యుదేవతను ఆనందంగా ఆహ్వానిస్తూ "అమ్మ"లో ఐక్యమైనారు.

వీరిరువురినీ గురించి ఫిబ్రవరి 1980 మాతృశ్రీలో "ఆదర్శమూర్తులయిన ఇద్దరు సోదరులు హఠాత్తుగా మననుండి దూరం అయినందుకు విచారిస్తూ - వారికి ఎలాగూ సుగతే...." అంటూ కీ॥శే॥ శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య సంపాదకీయంలో వెల్లడించారు. వీరు తమ జీవిత చరమాంకంలో ఆత్మజ్ఞానం పొంది, ప్రాపంచిక వ్యామోహాలను వదిలి, "అమ్మ"ను చేరడం ఎంత అదృష్టమో! వారికి అలాంటి స్థితిని అనుగ్రహించిన "అమ్మ" సద్గతిప్రద.

కీ॥శే॥ శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్యకు కృతజ్ఞతలు



సంతరించిన నిండు జవ్వనం బెడబాసి

బాలగా నొకమాఱు బాగు గూర్చు

సవదరించిన యొక్క జాము సేపటిలోన

రకరకంబుల పోల్కి రవణ జూపు

అర్చితంబైన బ్రహ్మాధిపత్యము వీడి

ముగ్ధగా నొక మాఱు మురిపె మిచ్చు

సామాన్య నారీ ప్రసంగ సందర్భమం

దాదిమదేవిగా నభినయించు

కప్పురం బైన జీవితాక్రాంత కాంతి

నించుమించుగ గ్రొమ్మించు మించునట్లు

చిత్రలీలల జూపఱ నేత్రములకు

సతము చూపించు నమ్మ, ఆశ్చర్యమేమి ?

- డా॥నారపరాజు శ్రీధరరావు

# ౨౦. అవ్యాజకరుణామూర్తిః

**కారణమ్ములు చూడని కరుణతోడ**
**ప్రతిఫలమ్మును కోరని వ్రతముతోడ**
**అఖిల జీవుల నెంతయు నాదరించు**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

“శ్రీమాత, కరుణాసాగర, దయామూర్తి. ఆమె కారుణ్యం అనంతమే కాదు. అవ్యాజం. ఆమె ప్రేమకు పెన్నిధి. కరుణకు కాణాచి. ఆమె కారుణ్యానికి కారణం లేదు. అవ్యాజకరుణ ఆమెరూపం. ఆమె అవ్యాజకరుణామూర్తి. లోకంలోని అవ్యాజకరుణ దేవిస్వరూపం”.

“దయాగుణమే తన స్వరూపంగా గల శ్రీమాత దయామూర్తి. బిడ్డలపట్ల తల్లికి వాత్సల్యం, దయ, అధికం. జగత్తులోని సర్వప్రాణులయందు దయగలది కనుక ఆమె దయామూర్తి.”

“కరుణారసానికి సాగరం శ్రీమాత. మానవుల కరుణ పరిమితం. దేవి కరుణ సాగరంవలె అనంతం. ఆమె కరుణారససాగర”.

“కరుణారసస్వరూపిణి శ్రీమాత. ఆమె కరుణ అపారం, అనంతం, ఆమె సాంద్రకరుణ. దేశ, కాల, వర్ణ, వర్గ, భేదాలు లేకుండా అందరినీ దయతో అనుగ్రహించే శ్రీమాత అనంత దయాస్వరూపిణి. ఎంతమందికి తన దయను పంచిపెట్టినా ఆమెలోని దయాగుణం తరుగులేనిది” – భారతీవ్యాఖ్య.

“అమ్మ” అవ్యాజ కరుణామూర్తి. “అవ్యాజం” అంటే అర్థం ఏమిటి ? వ్యాజం లేనిది. వ్యాజమనే సంస్కృతపదానికి అర్థాలు ఎన్నో ఉన్నాయి. అయితే ఇక్కడ మనం “అవ్యాజ” శబ్దానికి ‘కారణరహితమైన’ అనే అర్థాన్ని స్వీకరించాలి. లోకంలోని సాధారణ స్త్రీలకే మాతృత్వం సిద్ధించగానే, తమ సంతానం పట్ల ఫలాపేక్ష లేని ప్రేమ కలుగుతోంది. ఆ ప్రేమను వారు వాత్సల్యరూపంలో, సేవాభావంతో తమ పిల్లలకందించి, ఆనందిస్తున్నారు. అలాంటిది, జగజ్జనని ప్రేమకు గాని, కరుణకు కాని కారణమెలా ఉంటుంది? అది అవ్యాజం.

"కరుణ" అనే సంస్కృత పదానికి దయ, కనికరమనే అర్థాలు నిఘంటువుల్లో మనకు కనిపిస్తాయి. అయితే, "అమ్మ" విషయంలో ఇతరుల మనస్సు నొప్పించని సున్నితమైన, సునిశితమైన ప్రవర్తనగా మనం భావించాలి. ఎందుకంటే, తన మాటలతో గాని, చేతలతో గాని ఎవ్వరినీ నొప్పించక, వారి వారి మనస్తత్వాలకు అనుగుణంగా ప్రవర్తించడం చిన్నతనం నుంచే "అమ్మ"లో ద్యోతకమవుతోంది.

"పువ్వు పుట్టగానే పరిమళించినట్లు" అమ్మ లోని విశ్వజననీతత్వం పసితనం నుంచే ప్రస్ఫుట మవుతోంది. 4 సంవత్సరాల పసివయస్సులో, ఒకనాటి రాత్రి "అమ్మ" నగలతో ఒంటరిగా సముద్రతీరంలో విహరిస్తోంది. రాత్రి అంటేనే భయపడే వయస్సులో, సముద్రం అంటేనే "అమ్మో" అనుకునే బాల్యంలో "అమ్మ" లోని మాతృత్వం అవధులు దాటిన సంఘటన ఇది. ఒంటరిగా తిరుగాడుతున్న "అమ్మ"ను చూసిన పల్లెవాడొకడు "దారితప్పిన పిల్ల" అనుకున్నాడే తప్ప, "దారి చూపవచ్చిన తల్లి"గా, "దరిచేర్చే అమ్మ"గా గుర్తించలేకపోయాడు. దుష్టబుద్ధితో "అమ్మ" నగలన్నీ అపహరించడంతో ఆగక పసిపిల్ల అనైనా చూడకుండా, సముద్రంలోకి విసిరేశాడు. అయితే "అమ్మ"ను సముద్రం ఏమి చేస్తుంది? తన తరంగ హస్తాలతో జాగ్రత్తగా ఒడ్డుకు చేర్చింది. రెట్టించిన కోపంతో అతడు "అమ్మ"ను లోపలికల్లా తీసుకెళ్ళి పడవేయాలనుకొని, తానే సముద్రం పాలయ్యాడు. ఇక్కడే, "అమ్మ"లోని "అవ్యాజకరుణ" కట్టలు తెంచుకుంది. తన బిడ్డను ఆ తల్లి నీటిపాలు చేస్తుందా ? మెల్లగా దరి చేర్చింది. తన ప్రాణం కాపాడిందనే కృతజ్ఞతతో ఆ పల్లెవాడు "అమ్మ" నగలను "అమ్మ"కే ఇవ్వబోయాడు. కాని అమ్మ అతణ్ణి వారిస్తూ, "నీవు ఒలిచింది నీ సొమ్మే నాయనా. నీవు బ్రతికి వచ్చావు. అదే నాకు సొమ్ము. తల్లికి బిడ్డ సొమ్ము. బిడ్డకు డబ్బు సొమ్ము" అని తన అవ్యాజకరుణామృతాన్ని అతనిపై వర్షించింది.

అమ్మ దయామూర్తి. దయాగుణానికే ఒక రూపం ఉంటే అది "అమ్మే". మూర్తీభవించిన దయే "అమ్మ". ఆ దయ కేవలం మానవుల మీద మాత్రమే కాదు, పశుపక్ష్యాదులపైన కూడా ప్రసరించింది అనడానికి ఎన్నో సంఘటనలు అమ్మ జీవితచరిత్రలో మనకు లభ్యమవుతున్నాయి. అలాంటి సంఘటనలలో ఒకటి పెద్దకుక్క ఉదంతం.

1950వ సంవత్సరంలో ఏడేళ్ళ వయస్సుగల ఈ కుక్క అమ్మను ఆశ్రయించింది. కుక్కలను తలపై కొట్టి ఊరికి దూరంగా పారవేస్తున్న రోజుల్లో ఈ కుక్క, దీనితోపాటు మరో కుక్క దెబ్బలుతిని కూడా ప్రాణంపోక, తప్పించుకుని, ఓపిక కూడదీసుకుని, మజ్జిగ చిలుకుతున్న "అమ్మ" పాదాలపై వాలిపోయాయి. అందులో ఒకటి వెంటనే చచ్చిపోయింది. ఈ కుక్క మాత్రం చిందిపడిన మజ్జిగ చుక్కలు నాకి, సేదతేరింది. మజ్జిగ చుక్కలు నాకి తేరుకునే పరిస్థితి కాదు దానిది. కాని, "అమ్మ" చిందించిన మజ్జిగ చుక్కలు కదా ! అవి. అందువల్ల, దాని పాలిట అమృతధారలై దానికి పునర్జన్మను ప్రసాదించాయి. అప్పటినుంచి దానికి "అమ్మ" చరణాలే శరణ్యమయినాయి. అది కూడా తనకు చేతనైన సాయం "అమ్మ"కు చేసేది. అమ్మ పనిలో నుంచి వచ్చేవరకు పిల్లల రక్షణభారం వహించేది. ఎవరైనా క్రొత్తవారు ఇంటికి వస్తే, వారిపై అరవడంకాని, వారిని కరవడం కాని చేసేదికాదు. "అమ్మ" దగ్గరకు వచ్చి, తాకి, సంజ్ఞ చేసి చెప్పేది."అమ్మ"కు నమ్మినబంటులా ప్రవర్తించేది. ఎంతో విలక్షణంగా ఉండేది. రోజూ "అమ్మ" దర్శనం చేసుకునేది.

1964 ఆగష్టు 3వ తేదీన అది రోజులాగా "అమ్మ" దర్శనానికి రాలేదు. "అమ్మ" స్నానం చేసి, మందిరంలోకి వచ్చి, వెంటనే దాని సంగతి ఆరా తీసింది. ఆ రోజు వాతావరణం వానగా, చల్లగా ఉంది. ఆ కుక్కకు జబ్బు చేసిన కారణం చేత అది "అమ్మ" దర్శనానికి రాలేక పోస్టాఫీసులో పడుకుని ఉంది. ఈ విషయం తెలియగానే "అమ్మ" అక్కడయితే వర్షంపడినా ఇబ్బంది ఉండదు కనుక దాన్ని అక్కడే పడుకోనివ్వమంది. ఆ తర్వాత దాన్ని గురించి ఎవరూ పట్టించుకోలేదు. ఆ కుక్క, శరీరానికి కలిగిన తాపం వల్ల కాబోలు డాబాలవైపున ఉన్న ఇసుక కుప్పల మీద పడుకుంది. ఈ వార్త తెలిసిన వెంటనే "అమ్మ" దాన్ని చూడడానికి బయలుదేరింది. అసలే రేగడినేల, అందులో వాన, ఒకటే జారుడుగా ఉంది. అందువల్ల కాత్యాయనిఅక్కయ్య, రామకృష్ణఅన్నయ్య వద్దని "అమ్మ"ను వారించారు. దాన్నే "అమ్మ"వద్దకు తీసుకువస్తామన్నారు. "దాన్ని మీరు ఇక్కడికి తీసుకు వచ్చేది నాకోసం. కాని దానికోసం కాదుగా నాన్నా! నాకేం ఫర్వాలేదు. నేను వెళ్ళాల్సిందే" అని "అమ్మ" బయలుదేరింది. "ఓపిక ఉన్నన్నాళ్ళూ నా కోసం వచ్చేది అది. ఈవేళ దానికోసం నేను వెళ్తాను" అని దయామూర్తి అయిన అమ్మ నడకసాగించింది.

మరణావస్థలో ఉన్న ఆ కుక్క తన మనస్సులో చివరిసారిగా "అమ్మ" దర్శనభాగ్యాన్ని కోరుకున్నదేమో! భక్తపరాధీన, దయామూర్తి అయిన అమ్మ, దాని ప్రార్థనను ఆలకించి, దాని సమీపానికి తానే వెళ్ళింది. ఆ కుక్కను సమీపించిన "అమ్మ" అక్కడ ఉన్న అక్కయ్యను దాని క్షేమాన్ని గురించి ప్రశ్నించింది."అన్నం తినలేదా ?" అని ఎంతో ఆప్యాయంగా అడిగింది. ఎంతో ప్రేమగా దాన్ని చూస్తూ, "జల్లుపడుతోంది కదా ! ఇక్కడే ఉంచారేం. పంచలో పడుకోబెట్టక పోయారా?" అంటూ, దాని ప్రక్కనే ఆ ఇసుకలో తాను కూర్చొని, దాన్ని చేత్తో రాస్తూ పాలల్లో తులసీదళం వేయించి, ఆ పాలు పట్టమని అక్కయ్యకు చెప్పింది. "అమ్మ" అమృతకరస్పర్శకు ఆకుక్క ఆనందంతో పరవశించింది. అంత హీనస్థితిలోనూ దాని కళ్ళల్లో ఆనందం తళుక్కున మెరిసింది. దాని శరీరం పులకించింది. అయినా పాలుమాత్రం త్రాగలేదు. దాని మనస్సు గ్రహించిన "అమ్మ" చిరునవ్వుతో గిన్నెను తాను పట్టుకుని పాలు త్రాగించింది. తులసిదళంతో సహా ఒక్క చుక్కపాలు లేకుండా మొత్తం త్రాగేసింది ఆ కుక్క."అమ్మ" దాని మూతి కడిగి, శరీరమంతా నీళ్లు జల్లి, తోకవైపు భాగం కడిగి, "కురుపు ఎక్కడుందీ" అంటూ దాని చెవిపట్టుకుని చూసింది. అది పాపం, బాధగా మిులిగింది. "అమ్మ" దాని చెవికడిగి, శరీరమంతా ప్రేమగా నిమిరి, వెచ్చని ప్రదేశంలో పడుకోబెట్టమని చెప్పి బయలుదేరింది.

నాన్నగారు ఆ కుక్కను గురించి "అమ్మ"ను అడిగారు. "దాని పని అయిపోయింది పాపం" అని దయామూర్తి అయిన "అమ్మ" జాలిగా చెప్పింది. నాన్నగారు ఆ కుక్క ఎలా ఉండేదీ వివరిస్తూ, 'కుక్కజాతి విశ్వాసానికి మారుపేరు' అంటే, వెంటనే "అమ్మ" - "మనకు తక్కిన వాటితో పరిచయం లేదు కనుక అనుకుంటున్నాము. అన్నింటిలోనూ విశ్వాసం ఉంది" అన్నది. విశ్వజనని అయిన "అమ్మ"కు తన సంతానమంతా సమానమే కదా! ఏ బిడ్డను ఏమన్నా ఆ తల్లి మనస్సు సహించలేదు. ఆ కుక్క చనిపోయిన తర్వాత గోయి తీయించి, అందులో దాన్ని పూడ్చి పెట్టించి, దానికి అంతిమ సంస్కారాన్ని చేయించింది దయామూర్తి అయిన అనసూయమ్మ. (అర్కపురిలేఖలు - భవానీకుమారి)

"అమ్మ" కరుణారససాగర. మన ప్రేమ, కరుణ మన కుటుంబం వరకే పరిమితమై ఉంటాయి. కాని అందరి "అమ్మ" అనసూయమ్మ కరుణారససాగర.

ఆమె కరుణ పెద్ద సముద్రం వంటిది. కరుణారససాగర అయిన "అమ్మ" కరుణాకటాక్షవీక్షణాలకు విచక్షణ లేదు. ఆబ్రహ్మకీటజనని అయిన "అమ్మ" కరుణకు సమస్తప్రాణికోటీ సమానమైన హక్కుదారులే. ఆ కరుణారస ప్రవాహంలో తలమునకలుగా తేలియాడుతున్న "అమ్మ" బిడ్డలందరూ ఆ కరుణారసామృతాన్ని కుత్తుకబంటిగా ఆస్వాదించి ఆనందించిన వారే.

1962వ సంవత్సరంలో అమ్మ చీరాల పర్యటనలో ఉన్న రోజుల్లో కొన్నాళ్ళు వాడరేవులో ఉంది. ఆ రోజుల్లో "అమ్మ" దర్శనానికి వెళ్ళిన కీ॥శే॥ నారపరాజు శ్రీధరరావుగారితో పూరీలు చేయించి, తీసుకురమ్మని "అమ్మ" చెప్పింది. "అమ్మ" అడగడమే అరుదుకదా ! అందువల్ల అడిగిందే తడవుగా శ్రీధరరావుగారు పూరీలు చేయించి, వాడరేవులో "అమ్మ" ఉన్న ఇంటికి వెళ్ళారు. అయితే, "అమ్మ" ఆయనకు దర్శనం ఇవ్వలేదు. ఒకటికాదు, రెండు కాదు, కొన్ని గంటలు ఆమె దర్శనం కోసం వేచి చూశారా దంపతులు. పట్టుకొని వెళ్ళిన పూరీలు చప్పగా చల్లారిపోయాయి. శ్రీధరరావుగారికి పిలవకుండానే కోపం వచ్చేసేది. "అమ్మ" విషయం కాబట్టి ఎంతో ఓర్పుగా చాలాసేపు ఎదురుచూశారు. ఇక ఆయనలో సహనం నశించింది. ఆ పూరీలు అన్నీ తీసుకొని సముద్రతీరానికి వెళ్ళి, అక్కడ ఉన్న కుక్కలు, పందులు లాంటి జంతువులకు, జాలరివాళ్ళకు ఆ పూరీలన్నింటినీ పంచి పెట్టేసి, ఖాళీచేతులతో తిరిగి వెళ్తూ, మళ్ళీ ఒకసారి "అమ్మ" దర్శనం కోసం ప్రయత్నిద్దాం అని వచ్చారు. ఈసారి వెంటనే "అమ్మ" దర్శనం లభించింది. ఆయన, తనకంఠంలో కొంచెం నిష్ఠూరాన్ని ధ్వనింప జేస్తూ జరిగినదంతా "అమ్మ"కు నివేదించారు. చిరునవ్వుతో "అమ్మ", "పోనీలే నాన్నా ! అక్కడ ఉన్నవాటికి మాత్రం ఎవరు పెడతారు ? ఎవరు తింటే ఏమిటి ?" అన్నది. అంటే కరుణారససాగర అయిన "అమ్మ" పూరీలు తీసుకురమ్మన్నది, తనకోసం కాదు. సముద్రతీరం లోని జంతువుల కోసం, జాలర్ల కోసం. అవును మరి. మనమే కాదు. అవి కూడా "అమ్మ" సంతానమేగా మరి. వాటి ఆకలి తీర్చడం కూడా "అమ్మ" బాధ్యతేగా. అందువల్ల కరుణారససాగర అయిన అమ్మ సముద్రతీరంలోని వాళ్ళ కోసం ప్రత్యేకంగా పూరీలు చేయించి, అవి వాళ్ళకే అందేలా చేసింది. వాటికోసం చేయమంటే చేసేటంత మనస్సు మనకు లేదు కదా! అందువల్లనే కరుణారససాగర అయిన "అమ్మ" తనకు పూరీలు చేసి తీసుకు రమ్మని శ్రీధరరావుగారిని ఆదేశించింది, ఆ పూరీలు అందవలసిన వాటికి అందేలా చేసింది.

"అమ్మ" సాంద్రకరుణ. అందరి "అమ్మ" అయిన అనసూయమ్మ అర్కపురిలో నెలకొల్పిన అందరింట్లో వర్ణ వర్గ లింగ వయోభేదాలు కనిపించవు. విచక్షణ లేని "అమ్మ" కరుణామృత వీక్షణం ఒక్క జిల్లెళ్ళమూడిలో ఉన్న సోదరీసోదరులకు మాత్రమే పరిమితం కాలేదు. విశ్వకుటుంబిని అయిన 'అమ్మ'కు ఎక్కడ ఉన్నవారైనా తన ఒడిలోనివారే. అందరినీ తన కరుణామృతవర్షధారలతో పునీతులను చేసిన తల్లి సాంద్రకరుణగా మనకు సాక్షాత్కరించింది.

రచయిత కీ॥శే॥ శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావుగారు – 'సాంద్రకరుణా' నామాన్ని వ్యాఖ్యానిస్తూ, "అర్కపురిలోని "అమ్మ"ను దర్శిస్తే, 'సాంద్రకరుణా' నామంలోని లలితాతత్వం ప్రత్యక్షంగా అనుభవంలోకి వస్తుంద"ని ప్రకటించారు. "అమ్మ" మనపై చూపే కరుణ అవ్యాజమూ, అపారమూ, అతులమూ, ఆనందదాయకమూ. అత్యంత అపురూపం అయిన కరుణతో మనలను "అమ్మ" ఆదరించే తీరు ప్రపంచంలో మరెక్కడా కనిపించదు. అది అర్కపురిలో వెలసిన అనసూయమ్మకు మాత్రమే సొంతం. ఎందుకంటే "అమ్మ" సాంద్రకరుణ కనుక. సాంద్రకరుణ అయిన "అమ్మ" తన్ను చూడవచ్చిన వారిపై కరుణను వర్షించడమే కాదు, తనకు దూరంగా ఉన్నవారిపైనా, తన్ను ద్వేషించేవారిపైనా, తనపై ఆగ్రహించినవారిపైనా, వీరూ వారూ అని ప్రశ్నే లేదు. అందరినీ తన కరుణాపాంగదృష్టి ప్రసారంతో పునీతులను చేస్తుంది.

బాపట్ల పర్యటనలో ఉన్న "అమ్మ" – బాపట్ల పురప్రజలను తన దర్శన భాగ్యంతో ధన్యుల్ని చేయటంతో ఆగలేదు. బాపట్లకు దూరంగా, గ్రామం నుంచి వెలివేయబడినట్లుగా ఉన్న కుష్ఠురోగుల ఆసుపత్రికి తాను స్వయంగా వెళ్ళి, సందర్శించింది. అక్కడ దీనావస్థలో, హీనస్థితిలో ఉన్న కుష్ఠురోగులను ప్రేమనురాగాలతో పలుకరించి, వారందరికీ తాను తీసుకువెళ్ళిన పులిహోర ప్రసాదాన్ని పంచి, వారిపై తన అపారకరుణను వ్యక్తం చేసింది. "అమ్మ" కరుణకు వారు అంతులేని ఆనందాన్ని పొందారు. తన చల్లనిచూపుతో వారికి మానసిక ప్రశాంతతను, తన మృదుకర స్పర్శతో వారికి శారీరక ఉపశాంతిని కలిగించిన "అమ్మ" సాంద్రకరుణ.

పెద్ద పెద్ద నగరాల్లోని పురప్రజలకు తన దర్శన భాగ్యాన్ని అనుగ్రహించిన "అమ్మ" – తన దగ్గరకు రాలేక, తన రాకను కోరుకుంటూ, ఆర్తితో నిరీక్షిస్తూ, పిలవాలనే కోరిక మనస్సులో సందడి చేస్తున్నా, తమ స్థితిని బట్టి పిలవడానికి సాహసించలేక బాధపడుతున్న నిరుపేదల ఇళ్ళకు తానే వెళ్ళి, తనకు పెట్టడానికి వారి వద్ద ఏమీ ఉండవు కాబట్టి, తనతో పాటు పళ్ళనో, పదార్థాలనో తానే తీసుకు వెళ్ళి, వారికి అంతులేని ఆనందాన్ని కలిగించింది. "అమ్మ" కరుణ నిరుపమానం. "కూలీనాలీ చేసుకునేవాళ్ళూ, చెంచులవాళ్ళూ, పాకీవాళ్ళూ, అందరిళ్ళకూ వెళ్ళి అందర్నీ చూసి రాగలగాలి. అప్పుడే ఈ పర్యటనకు అర్థం" అని తన పర్యటనలోని పరమార్థాన్ని ప్రకటించింది "అమ్మ". ఇలా ఎవ్వరనగలరు? సాంద్రకరుణ అయిన ఒక్క "అమ్మ" తప్ప.

అవ్యాజకరుణామూర్తి, దయామూర్తి, కరుణారససాగర అయిన "అమ్మ" కరుణకటాక్షవీక్షణాలు మనపై అనుక్షణం ప్రసరించాలని "అమ్మ"ను వేడుకుందాం. సాంద్రకరుణ అయిన "అమ్మ" దృష్టిప్రసారం మన జీవితాలను చరితార్థం చేయుగాత!

అర్కపురి లేఖలు రచయిత్రికి – కృతజ్ఞతలు



**నీ దయ ఎంత గొప్పదియొ ఎట్టుల నాకెఱుగంగ వచ్చు, నా**
**మాదిరి వారు, నీ దయిన మన్నన లొందినవారు, కష్టమం**
**దాదుకొనంగ సౌఖ్యముల నందిన వారలు, నిన్ను గూర్చి తా**
**రేది వచింతురో వినవె; ఎంతటి దానవొ తెల్ల మయ్యెడిన్.**

**ఎవ్వరి తోడ జెప్పెద సహింపగ రాని మదీయ బాధ, నా**
**కెవ్వరు దిక్కు; బీద మొగ మెవ్వరు చూచి సహించి బాధలన్**
**దివ్వగ బోదు, రెక్కడికి దియ్యని పల్కులకై గమింత్రు; నో**
**యవ్వ ! నిజంపు టమ్మవని ఆర్తిని నీకడ చెప్ప వచ్చితిన్.**

**–డా॥నారపరాజు శ్రీధరరావు**

# 21. సర్వవ్యాధి ప్రశమనీ

**ఆధివ్యాధుల తొలగించి, ఆర్తి బాప**
**రోగపర్వత దంభోళిరూప మెత్తి**
**సకల జీవులకును సుఖశాంతు లొసగు**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"దంభోళి అంటే వజ్రాయుధం. రోగాలనే పర్వతాలకు వజ్రాయుధం వంటిది కనుక శ్రీలలిత రోగపర్వత దంభోళి."

"సమస్తమైన వ్యాధులనూ ఉపశమింపజేసి, ఆనందాన్ని ఇచ్చే తల్లి లలితాదేవి. వ్యాధి అంటే శరీరసంబంధమైన బాధ. ఆధి అంటే మానసిక క్లేశం. సమస్తమైన శారీరక, మానసిక వ్యాధులను పోగొట్టే తల్లి సర్వవ్యాధిప్రశమని" – భారతీవ్యాఖ్య.

చిన్న చీమ మొదలు మానవుని వరకు గల ఈ సమస్త జీవరాశిలో శారీరక బాధ తప్పనిసరి. పశువులకు మనస్సు ఉంటుందో, ఉండదో, ఒకవేళ మనస్సు ఉన్నా, వాటికి మానసిక బాధలు ఉంటాయో, ఉండవో మనకు తెలియదు. కాని, శారీరక బాధమాత్రం ప్రతిప్రాణికీ ఉంటుంది. మానవశరీరమంతటిలో మనస్సు ఎక్కడ ఉంటుంది ? అంటే చెప్పలేం. కాని, ప్రతిమానవుని మనస్సూ అతణ్ణి రకరకాలుగా వేధిస్తూ ఉంటుంది. మనస్సుకు తృప్తి అనేది లేదు. అందువల్ల తరచుగా మనకు అందరికీ మనస్సు బాగుండకపోవడం జరుగుతూ ఉంటుంది. శ్రీమాతను కొలిచేవారికి శారీరక, మానసిక రుగ్మతలు తొలగిపోతాయి. ఆమె సర్వవ్యాధి ప్రశమని. రోగం పెద్ద పర్వతమంత అయితే, అంతకంటే శక్తిమంతమయిన వజ్రాయుధం శ్రీలలిత. వజ్రాయుధం పర్వతాల రెక్కలు నరికినట్లు, లలితాదేవి మన రోగాలను నాశనం చేస్తుంది. కనుక ఆమె రోగపర్వత దంభోళి.

"అమ్మ" రోగపర్వత దంభోళి; సర్వవ్యాధి ప్రశమని. అందరింటి సోదరీ సోదరులకందరికీ "అమ్మ" అనుగ్రహం అనుభవైక వేద్యమే. అవి "అమ్మ" పర్యటన చేసే రోజులు. "అమ్మ" పాదస్పర్శతో పునీతమైన ప్రదేశాల్లో ఒకటి మందపాడు

గ్రామం. అక్కడ హరిజనవాడలో ఒక అమ్మాయి మతిభ్రమణంతో బాధపడుతూ, ఆహారం కూడా స్వీకరించకుండా మృత్యువును సమీపిస్తోంది. ఆమెకు ఎందరో,ఎన్ని రకాలుగానో వైద్యం చేస్తున్నా ఫలితం శూన్యం. సర్వవ్యాధి ప్రశమని అయిన "అమ్మ" ఆ అమ్మాయి వద్దకు వెళ్ళి, ఆమె చేయిపట్టుకుని నాడి చూసింది. ప్రేమతో తల నిమిరింది. ఆమె "అమ్మ"ను నిర్లిప్తంగా చూసి, కళ్ళు వాల్చుకుంది. "అమ్మ" తన కార్యక్రమాల్లో నిమగ్నమైంది. ఆశ్చర్యం. ఎవ్వరూ ఊహించని విధంగా ఆ మరునాటికి ఆ అమ్మాయి శారీరక, మానసిక ఆరోగ్యాన్ని పొందింది.

డా॥నారపరాజు శ్రీధరరావుగారు చీరాలలో పేరుపొందిన వైద్యులు. ఎక్కడెక్కడి నుంచో ఎందరెందరో వచ్చి, వారి వైద్యంతో ఆరోగ్యవంతులై హాయిగా వెళ్ళిపోయేవారు. పెరటిచెట్టు మందులాగా వారి కుటుంబసభ్యుల అనారోగ్య పరిస్థితులకు వారు ఏమీ చేతకాని వారు అయ్యారు. ఆయా సందర్భాల్లో రోగపర్వత దంభోళి "అమ్మ" వారి కుటుంబసభ్యులకు తన నిండైన, మెండైన అండదండలందించి, వెన్నుదన్నుగా నిలిచి రక్షించింది.

శ్రీధరరావుగారి గృహిణి నారపరాజు ప్రభావతి. ఆమెకి 'మెనోపాస్' సమయంలో ప్రతిరోజూ అధిక రక్తస్రావమౌతూ వైద్యానికి అంతుచిక్కని ప్రశ్నగా డాక్టర్‌గారిని విసిగించింది. ఆమె ఆరోగ్యపరిస్థితివల్ల కావచ్చు, లేదా, ఆనాటికి ప్రతిచిన్నదానికి కత్తి, కత్తెర ఉపయోగించే ఈనాటి విధానం అంతగా అమలులో లేకపోవడంకావచ్చు, ఏదైతేనేం ఆమెకు శస్త్రచికిత్స చేయించాలనే ఆలోచన కూడా శ్రీధరరావుగారికి స్ఫురించలేదు. ఎన్ని రకాల మందులు మార్చిమార్చి ఇచ్చినా ఫలితం శూన్యం. చాలామందికి సత్ఫలితాలను చూపించిన మందులు కూడా ఈమె మీద ఏ ప్రభావం చూపలేదు. ఆరోజుల్లో "అమ్మ" చీరాలలో పర్యటిస్తోంది. "అమ్మ" డాక్టరుగారింటికి వస్తానన్న రోజున కూడా డాక్టర్‌గారి భార్య పరిస్థితి ఏమీ బాగాలేదు. "అమ్మ"కు హారతి ఇచ్చి లోపలికి ఆహ్వానించడానికి కూడా ఆమె రాలేక, బాధతో మెలికలు తిరిగిపోతూ, లోపలి గదిలోనే ఉంది. "అమ్మ" ఆమె ఉన్న గదిలోకి తానే వెళ్ళింది. ఆమెను సమీపించింది. తన అమృతహస్తంతో ఆ ఇల్లాలి పొత్తికడుపును ఆదరంగా నిమురుతూ "ఇక్కడేనా అమ్మా ! నొప్పి" అని ఆప్యాయంగా పలకరించింది. ఆ ఇల్లాలు బాధతో ఔనని తల ఊపింది. అంతే.

తగ్గించమని ఆమె "అమ్మ"ను అడగలేదు. తగ్గుతుందని "అమ్మ" చెప్పలేదు. అయితేనేం ! ఆ రోజు తర్వాత ఆమె ఆ బాధనుంచి విముక్తి పొందింది. 'బాధ చేత్తో తీసేసినట్లు మాయమయ్యింది' అంటే ఇదేనేమో! ఆ తర్వాత కూడ రెండుమూడుసార్లు డాక్టరు గారికి అంతు చిక్కని మాయరోగాలు ఆమెను బాధించాయి. డాక్టరుగారిని వేధించాయి. రోగపర్వతదంభోళి "అమ్మ" అనుగ్రహంతో అవి మటుమాయమై, ఆమె యథాపూర్వంగా ఆరోగ్యవంతురాలైంది.

శ్రీధరరావుగారు ప్రసిద్ధవైద్యులే అయినా, వారి మూడవ కుమార్తె బాధకు సంబంధించిన వ్యాధిని కనిపెట్టలేకపోయారు. ఆమెకు అన్నం ఇమడక అదేపనిగా వాంతులు అవుతూ, కడుపునొప్పితో నరకయాతన అనుభవించేది. ఎన్నిమందులు వాడినా, తాత్కాలిక ఉపశమనమే కాని రోగం తగ్గలేదు. ఆ రోజుల్లో "అమ్మ" మద్రాసుకు వెళ్తూ, తనతో పాటు శ్రీధరరావుగారిని కూడా రమ్మన్నది. ఇల్లు కదిలి వేరే ఊరు వెళ్ళడం అంటే శ్రీధరరావుగారికి అంతగా ఇష్టం ఉండేదికాదు. అయినా "అమ్మ" పట్టుబట్టడంతో మద్రాసుకు వెళ్ళక తప్పింది కాదు. ఆయన లేని సమయంలో వారి అమ్మాయికి ఎప్పటిలాగానే కడుపునొప్పి విపరీతంగా వచ్చి, వాంతులు అయ్యాయి. ఇంట్లో వాళ్ళు భయపడి, శ్రీధరరావుగారి మిత్రులు డాక్టర్ ప్రతాప్ కుమార్ గారిని పిలిపించి, ఆ అమ్మాయిని చూపించారు. ఇంకేముంది? రోగం గుట్టురట్టయింది. ఆ అమ్మాయి 24 గంటల కడుపునొప్పితో (ఎపెండిసైటిస్) బాధపడుతోందని, వెంటనే ఆపరేషన్ చేయించకపోతే ప్రమాదమని, శ్రీధరరావుగారిని పిలిపించమని చెప్పారు డాక్టర్ ప్రతాప్‌కుమార్‌గారు. శ్రీధరరావుగారు మద్రాసులో ఎక్కడ ఉన్నారని పిలిపించడం? ఆ రోజుల్లో ఫోన్లుకూడా లేవు. టెలిగ్రాం ఏ అడ్రసుకని ఇవ్వాలి? ఇంట్లోని వారంతా ఎంతో ఆందోళనపడుతున్నారు. అక్కడ "అమ్మ", వెంటనే బయలుదేరి చీరాలకు వెళ్ళమని డాక్టరుగారిని ఆజ్ఞాపించిందట, ఆయన మరునాటి ఉదయానికి చీరాల వచ్చేశారు. ఎంత ఆశ్చర్యం ! ఆయన రావడం, పరిస్థితినిబట్టి వెంటనే ఆ అమ్మాయిని డాక్టర్ జోసఫ్‌గారి హాస్పిటల్లో చేర్పించడం, ఆపరేషన్ చేయించడం వెంటవెంటనే జరిగిపోయాయి. ఏ మాత్రం ఆలస్యం జరిగినా, అది లోపలే పగిలిపోయి ప్రాణాపాయం ఏర్పడేదని డాక్టర్ జోసఫ్‌గారు చెప్పారు. ఇది నిజంగా

సర్వరోగప్రశమని "అమ్మ" అనుగ్రహమే. ఎందుకంటే శ్రీధరరావుగారు చీరాలలోనే ఉంటే, వేరే డాక్టరుకు చూపించడం జరిగేది కాదు. వారు ఎప్పటిలాగే ఏదో ఒక మందు వేసి ఉండేవారు. కనుక, వారిని ఆ సమయంలో అక్కడ లేకుండా చేయడం, ఆ తర్వాత వారు రాకపోతే ఆపరేషన్ చేయించడం కష్టం కనుక, వెంటనే వారిని చీరాలకు పంపించడం - అంతా "అమ్మ" చూపిన లీల. ఎందుకంటే, మద్రాసులో శ్రీధరరావుగారు ఉన్నరోజులు చాలా తక్కువ. అదీగాక, "ఉంటానమ్మా" అంటున్నా, వినకుండా తొందరపెట్టి వారిని పంపించిన "అమ్మ" రోగపర్వతదంభోళి. "అందరి అమ్మ" అనసూయమ్మకు కృతజ్ఞతాంజలులు. సర్వవ్యాధిప్రశమని, రోగపర్వత దంభోళి అయిన "అమ్మ" మనలను అనుగ్రహించుగాక !



అమ్మా! కొందరు దుఃఖపీడితులరై అత్యంత దూరస్థులై
రమ్మా! యన్నను వారి పాలిటికి శీఘ్రంబేగి ప్రత్యక్షమై
లెమ్మా నాయన! యంచు వారి యిడుముల్ వేగంబ పోకార్పవే!
అమ్మా! అంతటి భాగ్య మొక్కపరి యిమ్మా! నాకు నా అమ్మవై".

రావా, నీ వొక మాట దీను నొకనిన్ రాగంబుతో జూడగా;
రావా, ఒక్క మహార్తి పీడితుని గారా మొప్ప నోదార్పగా;
రావా, నమ్మిన బంటు చక్కటికి దద్రక్షావిధిం గూర్పగా;
రావా, ఒక్క కుపుత్రునింటి కతనిన్ రాకొట్టి ప్రేమింపగా.

నాలుక మీద "అమ్మ", చెవి నాళమునందున "అమ్మ", అంతరం
గాలయమందు "అమ్మ", చెలువారెడు చేతలలోన "అమ్మ", సౌ
ఖ్యాలను బాధలందు మమతాన్వితయై వసియించి ప్రోవగా
బోలదె నన్ను; నే నడుగ బోలదె యీ వర మెక్కుడార్తితోన్.

-డా॥నారపరాజు శ్రీధరరావు

# 22. సర్వమృత్యునివారిణీ

**మరణభీతిని పోద్రోలి, కరుణజూపి**
**నిత్య నిరవద్య సుఖములు నెగడ జేయు**
**మృత్యు దారు కుఠారిక, మృత్యుమథని**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"అపమృత్యువు, అకాలమృత్యువు వంటి అన్నిరకాల మృత్యువులనూ నివారించే శ్రీమాత సర్వమృత్యునివారిణి."

"దారువు అంటే కొయ్య, కుఠారిక అంటే గొడ్డలి. చెక్కను గొడ్డలి చీల్చినట్లు మృత్యువును నాశనం చేసే లలితాంబిక మృత్యుదారు కుఠారిక."

"సంసారనిర్మగ్నులైన సామాన్యమానవులు మృత్యువుకు లోబడి ఉండవల సిందే. తన్ను కొలిచేవారికి అమృతత్వాన్ని అనుగ్రహించి, శాశ్వతానందాన్ని ప్రసాదించే లలితాదేవి మృత్యుమథని" – భారతీవ్యాఖ్య.

అవతారమూర్తులే అయినా, మానవశరీరం ధరించాక, మృత్యువు బారిన పడక తప్పదు. అవతారమూర్తులయిన శ్రీరాముడు, శ్రీకృష్ణుడు కూడా ఈ శరీరాన్ని వదలి, వైకుంఠాన్ని చేరుకున్నట్లు పురాణాలు వివరిస్తున్నాయి. ఈ కలియుగంలో మనం సాక్షాత్తూ దేవతా స్వరూపులుగా భావించి, అర్చించిన మహాత్ములు షిరిడీసాయి, మెహర్‌బాబా, హరనాథ్‌బాబా, రమణమహర్షి, రామకృష్ణపరమహంస వంటివారు కూడా దేహత్యాగం చేసి, మృత్యుదేవత ఒడిని చేరుకున్నవారే. "జాతస్య హి ధ్రువో మృత్యుః" కనుక, శరీరధారులకు మృత్యువు తప్పదు.

"అమ్మ" సర్వమృత్యునివారిణి. "అమ్మ" జీవిత మహోదధిలో పైకి లేచిన ఎన్నో అలలు, "అమ్మ" ప్రేమరసవాహినిలో మనల్ని తడుపుతూ,ఎప్పటికప్పుడు "అమ్మ"ను సర్వమృత్యునివారిణిగా సాక్షాత్కరింపజేస్తాయి. ఈనాడు మాతృశ్రీ ఓరియంటల్ కళాశాలలో సంస్కృతశాఖలో రీడర్‌గా ఉన్న డా॥రఘూన్నీ లక్ష్మీబాయిగారు ఆ కళాశాల విద్యార్థినిగా ఉన్న రోజుల్లో, తిరుగుతూ ఉన్న నీళ్ళు నింపే మోటారుచక్రంలో ఆమె శిరోజాలు పడి, తలంతా చెక్కుకుపోయింది.

తలకు అంత పెద్దగాయమైనందువల్ల ఆవరణలోని అందరూ భయభ్రాంతులైనారు. ఆందోళన చెందారు. అయితే, "అమ్మ" అనుగ్రహబలం వరమై, ఆమెకు సంపూర్ణారోగ్యం చేకూరింది. అంతేకాదు, విద్యాభ్యాసం పూర్తయి డాక్టరేటు డిగ్రీ, గౌరవప్రదమైన ఉద్యోగమూ కూడా లభించాయి. ఇలాంటి ఎన్నో సంఘటనల్లో అపమృత్యువు, అకాలమృత్యువులనుంచి "అమ్మ" తనబిడ్డలను ఎక్కడికక్కడ రక్షిస్తూ సర్వమృత్యు నివారిణిగా ప్రత్యక్షమైంది.

"అమ్మ" మృత్యుదారు కుఠారిక. చిన్నతనం నుంచీ విషసదృశమైన మూలికలూ, ద్రావకాలూ తీసుకున్నా, అవి "అమ్మ"కు ఎలాంటి ప్రాణహానీ కలిగించలేకపోయాయి. ఒకసారి "అమ్మ" అనారోగ్యంతో బాధపడుతోంది. "అమ్మ"కు త్వరగా ఆరోగ్యం చేకూరాలని, "అమ్మ" మీద అంతులేని ప్రేమతో, "అమ్మ"సేవకే అంకితమైన అక్కయ్య ఒకరు "అమ్మ"కు ఎక్కువ మోతాదులో మందు ఇచ్చారు. అయితే, ఆ మందులో ఎక్కువశాతం విషం కలిసి ఉంటుందని పాపం ఆ అక్కయ్యకు తెలీదు. ఇంకేముంది? త్వరగా కోలుకోవడానికి బదులు, "అమ్మ" శరీరం క్షణంలో కొయ్యబారిపోయింది. చర్మం స్పర్శను కోల్పోయింది. అందరూ భయభ్రాంతులైనారు. "అమ్మ" మాత్రం "ఏమీ భయపడవద్దు. అదే తగ్గుతుంది" అని అభయమిచ్చింది. గరళాన్ని స్వీకరించినా "అమ్మ"కేమీ హాని జరుగలేదు,ఇది ఒక్కటే కాదు. "అమ్మ" జీవితంలో మృత్యువాతనుంచి బయటపడిన సంఘటనలు ఎన్నో. మృత్యువు "అమ్మ"ను కబళించలేదు. "అమ్మ" మృత్యుదారు కుఠారిక. అయితే, "అమ్మే" చెప్పింది - "నిర్ణయానికి నిర్ణయించిన వాడూ బద్ధుడే" అని. అందువల్లనే తన నిర్ణయం ప్రకారం 1985 జూన్ 12న "అమ్మ" తన అవతారాన్ని చాలించి, ఆలయ ప్రవేశం చేసింది.

"అమ్మ" మృత్యుమథని. జిల్లెళ్ళమూడి సోదరులందరికీ డా॥శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి గురించి తెలిసే ఉంటుంది. వారు బహుముఖప్రజ్ఞాశాలి. ఎన్నోవిషయాల్లో పరిశోధనలు చేసి, తాను తెలుసుకున్న విషయాలు, వ్యాసాలరూపం లోనూ, ఉపన్యాసాలద్వారానూ, లోకానికి అందించిన మేధాసంపన్నులు వారు. "అమ్మ"ను దర్శించడం వారి జీవితంలో ఊహించని మలుపు. "అమ్మ"వాక్కులలోని ప్రత్యేకత వారిని "అమ్మ"కు దగ్గరగా చేరిస్తే, "అమ్మ"జీవితంలోని సంఘటనలు

వారి మనస్సుపై ఎంతో ప్రభావం చూపాయి. "అమ్మ"ప్రేమ వారిని కరిగించి వేసింది. "అమ్మ"కు సంబంధించిన ఎన్నో విషయాలు వారు గ్రంథస్థం చేశారు. "అమ్మ"ను గురించి లోకానికి తెలియజేయడమే తన సాధనగా, తపస్సుగా భావించారు. ఆ మార్గంలోనే సిద్ధిపొందాలనుకున్నారు. "అమ్మ" ఆశీస్సులు అందుకొన్నారు. వారి మరణానంతరం "తపించాడు, తరించాడు, తానంతా "అమ్మే" అయినాడు" అని వారిని గురించి తక్కిన బిడ్డలకు వివరించింది మృత్యుమథనిగా దర్శనమిచ్చిన "అమ్మ". శ్రీపాదవారు ఆశ్రయించి, తరించిన మాతృశ్రీ చరణాలు మనందరికీ నిత్యసంస్మరణీయాలు, ఆవశ్య శరణ్యాలు.

(కీ॥శే॥ కొండముది రామకృష్ణ అన్నయ్యకు కృతజ్ఞతలతో)



కంటిని 'అర్కపత్తనము', కంటిని నీదు కుటీరభాగమున్
కంటిని నీదు రూపమును, కంటిని నీదగు వత్సలత్వమున్
కంటిని నీ చరిత్రమును, కంటిని నాదగు జీవితంబు ని
ష్కంటకమై తనర్ప, నొక కమ్మని సీమను లోకమందునన్.

మంగళ మాతృరూప, మతి మంగళ మాతృ చరిత్ర, సర్వతో
మంగళ మాతృభావనము, మంగళ మాతృవచోవిభూతి, స
న్మంగళ శాసనంబులు సమంచిత వీక్షణ పంక్తు, లిట్టి నీ
ముంగల, నా కమంగళము మూడునె ? యెంతటి వాడనైననున్.

నిను దర్శింపగ నేను వచ్చుటయు నిన్ సేవింపగా బూను టె
న్నిన నాశ్చర్యము లేదె, యీ పతితునిన్, విశ్వాసహీనున్, దురం
త నికృష్టాత్మ చరిత్రునిన్ దరికి ప్రీతస్వాంతవై చేర్చి పు
త్రునిగా నెన్ని, సమాదరం బొసగు టెంతో అద్భుతం బారయన్.

-డా॥నారపరాజు శ్రీధరరావు

# 23. నిర్భేదా, భేదనాశినీ

**ఎన్న డే భేద మెఱుగక, యెల్లజనుల**
**అంతరంగాల భేదమ్ము నంతరింప**
**జేసి, వాత్సల్యమును పంచు చిత్స్వరూప**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"శివశక్తి సమైక్యరూపిణియైన లలితాదేవి భేదరూపం లేనిది. అంటే, శివునితో అభేదం కలది శ్రీమాత. కనుకనే, శ్రీలలిత భేదరహిత. అంటే నిర్భేద".

"స్వ, పర భేదభావం అజ్ఞానం నుంచి పుట్టిన ఒక లక్షణం. భక్తుల అజ్ఞానాన్ని తొలగించే అజ్ఞానధ్వాంత దీపిక లలితాంబిక. అజ్ఞానం ఎప్పుడైతే తొలగిపోతుందో, భక్తులలోని భేదభావం నాశనమైనట్లే. భేదబుద్ధి నశించినట్లయితే భక్తులు మోక్షానికి అర్హులవుతారు. నిర్భేద అయిన "అమ్మ" తన భక్తులలోని భేదబుద్ధిని తొలగించే భేదనాశిని కూడా" – భారతీ వ్యాఖ్య.

భేదం తొలగిపోతే, ఖేదం నశించి, భక్తుని హృదయంలో మోదం ఆవిష్కృత మౌతుంది. ఆ ఆనంద స్వరూపమే "అమ్మ". అంటే, భక్తుని హృదయం "అమ్మ"కు ఆలయమౌతుంది.

ఒక్క పార్వతీపరమేశ్వరులేనా ? లక్ష్మీ నారాయణులు, సరస్వతీ చతుర్ముఖులు, సీతారాములు, రాధాకృష్ణులు – ఇలా మన దేవతలందరూ నిర్భేదతత్త్వంతో భాసిల్లుతున్నవారే. ఎందుకని ? అందరూ లలితాదేవి స్వరూపమే కనుక. నామ, రూప భేదమే కాని పరబ్రహ్మ తత్త్వం అంతా ఒక్కటే – అని కదా ! ఆర్షవాక్యం. లంకలో అశోకవృక్షం క్రింద రాముని కోసం విలపిస్తున్న సీతలో, రాముని రూపమే గోచరించింది హనుమకు. ఎందువల్ల? సీతారాములు వేరుకాదు కనుక.

"అమ్మ" నిర్భేద. ఈ విషయం "అమ్మ" మాటల్లో, చేతల్లో, ఎప్పుడూ వ్యక్తమవుతూనే ఉండేది. "అమ్మ"తో ఒకరు – పరధ్యాసగా ఉన్నావా ? "అమ్మా"! అంటే, పరధ్యాస కాదు; "పతిధ్యాస" అని సవరించిన తల్లి నిర్భేదకదా! మరి. అవసరమైన పనులమీద నాన్నగారు పొరుగూళ్ళకు వెళ్ళినా, "అమ్మ" ఆయనతోపాటే

ఉండి, సమయానుకూలంగా నాన్నగారికి తగిన సూచనలివ్వడం, నాన్నగారు మరచిపోయిన వాటిని ఆయనకు గుర్తు చేయడం వంటివి చేస్తూ ఉండేదని నాన్నగారే స్వయంగా చెప్పగా విని, తరించిన వారున్నారు. ఇవన్నీ ఒక ఎత్తు. నాన్నగారి నిర్యాణ సమయంలో "అమ్మ" ప్రవర్తించిన తీరు మరొక ఎత్తు. అత్యద్భుతమూ, అమితాశ్చర్యకరమూ, అతిమానుషమూ అయిన సన్నివేశం ఇది. 1981, ఫిబ్రవరి 16వ తేదీ తెల్లవారుఝామున గం. 3.15 ని.లకు స్వర్గస్థులైన నాన్నగారి మంచంప్రక్క మంచంమీద పడుకుని, ఆయనవైపు తిరిగి, తన కుడిచేతిని ఆయన గుండెపై ఉంచిన "అమ్మ", మరునాడు – అంటే 17వ తేదీ ఉదయం గం. 11.00ల వరకు అలాగే నిశ్చేష్టగా పడుకునే ఉంది. "కనబడుతున్నదంతా చైతన్యమే. జడమే లేదు" అని ప్రవచించిన "అమ్మ"కు నాన్నగారిలో అప్పుడు కూడా చైతన్యమే కనిపించిందేమో! నాన్నగారి కోసం విలపిస్తున్న బిడ్డలతో "అమ్మ" – "నాన్నగారు ఎక్కడికీ వెళ్ళలేదు. మనతోనే మన మధ్యనే ఉంటారు" అని నిర్ద్వంద్వంగా పలికి, అందరికీ ధైర్యాన్ని ప్రసాదించింది. నాన్నగారితో భేదభావం పొందని "అమ్మ" నిర్భేద. అందువల్లనే తన అవతారపరిసమాప్తి వరకు "అమ్మ" సర్వాలంకార భూషితయై, సుమంగళిగా, సర్వమంగళగా ప్రకాశించి, బిడ్డలకు కనువిందు చేసింది.

నిర్భేద అయిన "అమ్మ" భేదనాశిని కూడా. ఇందుకు ఒక చిన్న సంఘటనను మనం గుర్తు చేసుకుందాం. 1978 జనవరి 2వ తేదీన సోదరులు తూనుగుంట్ల త్రిలోక అప్పారావుగారు, మరొక సోదరునితో "అమ్మ" వద్దకు వచ్చారు. ఆ సోదరుని పేరు టిఫిన్‌కుమార్ బెహరా. కటక్ నివాసి, స్మగ్లర్, వంచకుడు, మొరటుమనిషి. మరి, అలాంటి వ్యక్తితో త్రిలోక అప్పారావుగారికి ఎలా పరిచయం? అంటే – అది చాలా తమాషాగా జరిగింది. వేరుశనగనూనె వ్యాపారం చేస్తున్న అప్పారావుగారు, ఒకసారి రూ. 70,000/- ఖరీదు చేసే నూనెను బెహరా లారీలో ఏలూరుకు పంపారు. అయితే, స్వతహాగా వంచకుడైన బెహరా, నూనెను అమ్మి, ఆ డబ్బును తాను వాడుకున్నాడు. "అమ్మ" ఒడిలోని బిడ్డ, "అమ్మ"పై అపరిమితమైన భక్తిగల అప్పారావుగారు ఈ సంగతులన్నీ అప్పటికప్పుడే "అమ్మ"కు నివేదించి, "అమ్మ" ద్వారా 'కౌన్సిలింగ్' పొంది, కొండంత ధైర్యాన్ని కూడగట్టుకున్నారు. అయితే, మానవ ప్రయత్నం మానలేదు. అప్పారావుగారిచ్చిన పోలీసు రిపోర్టు

కారణంగా లొంగిపోయిన బెహరా, డబ్బుకు బదులు తన లారీని అప్పారావుగారి పరం చేస్తానని, కోర్టుకేసులు, గొడవల నుంచి తన్ను తప్పించమని అప్పారావుగారినే వేడుకున్నాడు. భేదనాశినియైన "అమ్మ" అనుగ్రహ విశేషం చేత అప్పారావుగారు బెహరాను క్షమించడమే కాక, అతనిని పుణ్యక్షేత్రాలకు కూడా తీసుకువెళ్ళి, అతనికి మనశ్శాంతి కలిగేలా చేశారు. "అమ్మ" ప్రేమతత్త్వాన్ని అతనికి ఒంటబట్టేలా బోధించారు. అంతేనా! బెహరాకు కోర్టు ఆదేశించిన రూ.2000/- అపరాధ రుసుము కూడా తానే కట్టి, అతణ్ణి బంధవిముక్తుణ్ణి చేశారు. అక్కడితో ఆగారా? బెహరా కోరికపై తాను స్వయంగా అతణ్ణి వెంట బెట్టుకొని జిల్లెళ్ళమూడికి తీసుకు వచ్చి, "అమ్మ" దర్శనం చేయించారు. నిర్భేద అయిన "అమ్మ" ఆ ఇద్దరినీ తన అక్కున, చేర్చుకుని సేదతేర్చింది.

ఈ విధంగా అప్పారావుగారు తనకు ఏమీ కాని బెహరాకు – ఆప్తమిత్రుడు, ఆత్మబంధువు, తోడబుట్టినవాడు తానే అయి అన్నివిధాలా అతనికి తోడునీడగా నిలిచారు. ఒక స్మగ్లర్, వంచకుడు అయిన వ్యక్తికోసం, అతని చేతనే వంచితుడైన వ్యక్తి ఇలా చేయడమేమిటి ? ఇదంతా "అమ్మ" దయ కాకపోతే ? ఎవరిమీద ? ఆ ఇద్దరిపైనా. "అమ్మ"కు అందరూ బిడ్డలేగా మరి. నిర్భేద అయిన "అమ్మ"కు నక్సలైటూ అనుంగు బిడ్డడే. భేదనాశినియైన "అమ్మ" అనుగ్రహానికి పాత్రులయిన "ఆమె" బిడ్డలకు స్మగ్లర్లూ సోదరులే. ఉదాహరణకు ఒక్క సన్నివేశాన్ని స్మరించినా, ఇలాంటి వెన్నో సంఘటనలు "అమ్మ" జీవితచరిత్ర పుటల్లో కనిపిస్తూ, భేదనాశినిగా "అమ్మ"ను మనకు సాక్షాత్కరింప చేస్తాయి.

నిర్భేద, భేదనాశినిఅయిన "అమ్మ" కటాక్ష వీక్షణ ప్రసారం చేత మనలో అజ్ఞాన జనితమైన భేదభావం నశించి, హృదయోద్యానంలో జ్ఞానప్రసూనం వికసించిననాడు – వసుధైక కుటుంబాన్ని స్థాపించ గలుగుతాం. విశ్వమానవ సౌభ్రాత్రాన్ని సాధించ గలుగుతాం. "అమ్మ"కు అసలైన వారసులం కాగలుగుతాం.

**159, 128 వ్యాసాలు, "మాతృసంహిత" – రచయితకు కృతజ్ఞతలు.**



# 24. నిర్ద్వైతా, ద్వైత వర్జితా

**ద్వంద్వ భావమ్ము నణచి, నిర్ద్వైత యగుచు**
**సకల సృష్టిని నొకటిగా సాకుచుండి**
**ద్వైతవర్జితయై యిల వరలు తల్లి**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"ద్వైతమంటే రెండు. రెండవది లేనిది నిర్ద్వైత. ద్వైతం అనిత్యం. ద్వైత భ్రమను తొలగించి, నిత్యస్థితిని అనుగ్రహించే శ్రీమాత నిర్ద్వైత."

"ద్వైతస్థితి ఎన్నడూ లేని దేవి ద్వైత వర్జిత. శ్రీమాత నిత్యసత్య స్వరూపిణి" – భారతీవ్యాఖ్య.

ప్రతి మానవుడికీ, ప్రతి విషయంలోనూ విభిన్న భావాలు ఒక దానితో ఒకటి పోటీపడుతూ, మానసిక ప్రశాంతతకు భంగం కలిగిస్తూ ఉంటాయి. అకారణంగానో, సకారణంగానో, ఒకరి పట్ల ద్వేషం, మరొకరి పట్ల రాగం, ఒకరిపై ప్రేమ, మరొకరిపై కోపం; ఒకరంటే ఇష్టం, మరొకరంటే అయిష్టం; ఒకసారి దుఃఖం, మరొకసారి సంతోషం, ఒకప్పుడు సుఖం, మరొకప్పుడు కష్టం; ఒక సందర్భంలో ఆనందాన్ని కలిగించే సంఘటనలే, మరొక సందర్భంలో చికాకును కలిగించడం – ఇలా మానవ జీవితంలో ఎన్నో సందర్భాల్లో రెండు రకాల భావాలు మనస్సులో కొట్టుమిట్టాడుతూ ఉంటాయి. ఎంత వదిలించుకుందామన్నా, కట్టెకాలేవరకూ ఈ భావవైవిధ్యం పట్టి పీడిస్తూనే ఉంటుంది. అందుకే, మనం మాధవత్వాన్ని సాధించు కోలేకపోతున్నాం.

"అమ్మ" నిర్ద్వైత, ద్వైతవర్జిత. ఆర్తజన బాంధవి యైన "అమ్మ" మాధవి. జన్మతః "అమ్మ"లో కోపం, రాగం, ద్వేషం, అసూయ, అహంకారం, లోభం, మోహం వంటి మానవసహజమైన లోపాలు మచ్చుకైనా కనిపించవు. పసివయస్సులోనే కన్నతల్లిని కోల్పోయి కూడా దుఃఖించలేదు సరికదా, లోకానికి తానే "అమ్మ"యై మాతృప్రేమను పంచి, పరవశించిన అనసూయమ్మ నిర్ద్వైత. "అమ్మ"కు త్రికాలాలూ, త్రిసంధ్యలూ లేవు. తాపత్రయాలు లేవు. సత్తు – అసత్తు

అని రెండు లేవు. జడము – చైతన్యం అని రెండు లేనేలేవు. “జగత్తు మిథ్య, బ్రహ్మ సత్యం” కాదు. “జగత్తే జగన్నాథుని స్వరూపమైనప్పుడు మిథ్య ఎలా అవుతుంది?” అని ప్రశ్నిస్తుంది. జగన్మాత అన్నప్పుడు కూడా “జగత్తుకు మాత అనికాదు; జగత్తే మాత” అని “అమ్మ” వ్యాఖ్యానించింది. అందువల్లనే “అమ్మ” మనలో – అంటే, కనిపిస్తున్న ఈ సకల చరాచర సృష్టిలో దైవత్వాన్నే దర్శించింది. “భిన్నత్వం లేని మనస్సే దైవత్వం” అని ప్రకటించి, ఆ అభిన్నత్వాన్ని తన ప్రవర్తన ద్వారా ప్రదర్శించింది. “అమ్మ” దృష్టిలో – అన్నమూ, అశుద్ధమూ పరబ్రహ్మ స్వరూపాలే; జ్ఞానమూ, అజ్ఞానమూ బ్రహ్మతత్త్వమే; ఆనందమే కాదు, బాధకూడా భగవత్స్వరూపమే. ప్రకాశమే కాదు, అంధకారమూ దైవమే; తల్లిదండ్రులే కాదు, పిల్లలూ దేవుళ్ళే; శిష్యుడికి గురువే కాదు, గురువుకు శిష్యుడూ భగవంతుడే. “వైద్యో నారాయణో హరిః” ఎట్లాగో, రోగీ వైద్యుడికి నారాయణ స్వరూపమే; భర్త భార్యకు దేవుడైతే, భార్య భర్తకు దేవత. “సర్వత్రానురాగమే విరాగ”మని నిర్వచించిన “అమ్మ” నిర్ద్వైత. “అమ్మ” దృష్టిలో “అనాథ”లెవరూ లేరు, అందరూ “శ్రీనాథులే”. మంత్రానికి శక్తిమంతమైన అక్షరాలంటూ ప్రత్యేకంగా ఏమీ లేవు. మనస్సు శుద్ధిగా ఉంటే, పలికే ప్రతి అక్షరమూ మంత్రమే అవుతుంది అని “అమ్మ” స్పష్టంగా చెప్పింది. ఇలా మనస్సులో గాని, మాటలలోగాని, మనుగడలో గాని, ద్వైత భావమే లేని “అమ్మ” నిర్ద్వైత.

“అమ్మ” తత్త్వం ప్రేమతత్త్వం. “అమ్మ” తత్త్వం అనసూయత్వం. “అమ్మ”తత్త్వం అమృతత్వం. “అమ్మ” తత్త్వం విశ్వమాతృత్వం. అందుకే, “అమ్మ”లో లేశమాత్రమైనా ద్వైతం కనిపించదు. నిర్ద్వైత అయిన “అమ్మ” ద్వైత వర్జిత. పండితుడైనా – పామరుడైనా, ధనికుడైనా – నిరుపేద అయినా; బాలుడైనా – వృద్ధుడైనా, స్త్రీ అయినా – పురుషుడైనా; మానవులయినా – తిర్యక్కులైనా “అమ్మ” ప్రేమలో మార్పు ఉండదు. వారి వారి మనస్తత్వాన్ని బట్టి, శరీర తత్త్వాన్ని బట్టి పంచి పెట్టడంలో హెచ్చుతగ్గులున్నా, ప్రేమించడంలో మాత్రం తరతమ భేదాలుండవు. పెట్టులో కొలత ఉన్నా, “అమ్మ” ప్రేమ అనే తేనెపట్టులో కొరత ఉండదు.

ఒకసారి జిల్లెళ్ళమూడికి ఒక పండిత బృందం టాక్సీలో వచ్చింది. పండితులతో పాటు, ఆ టాక్సీడ్రైవరు కూడా “అమ్మ” దర్శనానికి వచ్చి, “అమ్మ”

గదిలో ఒక మూలగా ఒదిగి కూర్చున్నాడు. దర్శనానికి ముందు భోజనం, దర్శనానంతరం "అమ్మ" చేసే వస్త్రసత్కారం బిడ్డలందరికీ అనుభవంలోనిదే. "అమ్మ"కు చాలా ఇష్టమయిన కార్యక్రమం ఇది. "అందరింటి"కి వచ్చినవారికి కడుపునిండా అన్నంపెట్టి, కట్టుకునేటందుకు బట్టలు పెట్టడం "అమ్మ"కు ఆనవాయితీ. వచ్చినవారు పండితులు కనుక, వారిని శాలువాలతో సత్కరించింది "అమ్మ". వారితో పాటు అక్కడే ఉన్న టాక్సీడ్రైవర్‌కు కూడా "అమ్మ" శాలువా కప్పబోయింది. అయితే, అతడు తాను పండితుణ్ణి కాను అనే భావంతో "అమ్మ"ను సుతారంగా వారించాడు. వ్యత్యాసం లేని "అమ్మ" ప్రేమకు "అన్నం పెట్టడానికి ఆకలే అర్హత" అయినట్లుగా, శాలువా కప్పడం చలిబాధను పోగొట్టడానికే. అందుకే "చలిబాధ ఎవరికైనా ఒకటేగా నాన్నా!" అంటూ అతనికి నచ్చజెప్పి, శాలువాతో సత్కరించడమనే, సత్కార్యాన్ని నిర్విఘ్నంగా పూర్తిచేసింది ద్వైతవర్జిత అయిన "అమ్మ".

నిర్ద్వైత, ద్వైత వర్జిత అయిన "అమ్మ" తాను నిత్యకృత్యంగా నిర్వర్తించే ఎన్నో కార్యక్రమాల్లో తన స్వభావంలోని అభేదతత్త్వాన్ని అనుక్షణమూ గుర్తుచేస్తూ మాటల ద్వారా చేతల ద్వారా మార్గదర్శకత్వం వహించింది. నిర్ద్వైత, ద్వైతవర్జిత అయిన "అమ్మ" మనలోని భేదభావాలను పోగొట్టి, తన మార్గంలోకి మనల్ని మళ్ళించాలని మనసా, వాచా, కర్మణా కోరుకుంటూ, "అమ్మ"కు అంజలి ఘటిస్తున్నాను.



**నాదగు జీవితాశయము, నాదగు కోర్కులు, నాదు దుఃఖమున్**
**నాదగు ప్రేమబంధములు, నాదగు శోధన, లాత్మవంచనల్**
**నాదగు సత్యముల్ దెలుప నా కిలలోపల నీవు దక్కగా**
**నాదగు వారు లేరు గద! నన్ కరుణింపవె, ఆలకింపవే!**

**- డా॥నారపరాజు శ్రీధరరావు**

# 25. విశ్వసాక్షిణీ

**వీను లక్కర లేకుండ వినెడు తల్లి**
**కన్ను లక్కర లేకయే కనెడు తల్లి**
**విశ్వమున కెల్ల ఆత్మయై వెలుగు తల్లి**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"సమస్త విశ్వానికీ సాక్షి స్వరూపిణి శ్రీమాత. ఎవరు, ఎక్కడ, ఏం చేసినా సాక్షాత్తుగా చూడగలశక్తి లలితాదేవి. ఆమె విశ్వసాక్షిణి" – భారతీవ్యాఖ్య

సామాన్య మానవుల మయిన మనకు మన కళ్ళముందు జరిగితే తప్ప, తెలుసుకునే శక్తిలేదు. ఒక్కొక్కసారి కంటిముందు ఉన్నవే సరిగ్గా కనిపించక, దేవులాడుకుంటాం. ఒకగది మధ్యలో మనం ఉంటే, మనకు ముందు, అటూ, ఇటూ ఉన్నవాటిని మాత్రమే చూడగలుగుతాం. మనకు వెనుక ఉన్న వాటిని చూడలేం, తల వెనక్కి త్రిప్పి చూస్తే తప్ప. మన దృష్టిప్రసారం అంత పరిమితం. మనం రోజూ చూసే వస్తువులే అయినా, చీకటిలో వాటిని చూడలేం. తడుముకుంటాం. కాని, విశ్వాన్ని లీలగా, హేలగా నడిపించే శ్రీమాతకు సర్వమూ ప్రత్యక్షమే.

"అమ్మ" విశ్వసాక్షిణి. "నేను ఈ మంచం మీద కూర్చున్నానని, నాకేమీ తెలీదనుకుంటున్నారు. కాని, నాకు గోడచాటు లేదు" అని చెప్పిన "అమ్మ" కంటికి కనిపించనిదేమీ లేదని తెలుస్తున్నది కదా ! "అమ్మ" అంటే మన కంటికి కనిపిస్తున్న రూపం మాత్రమే కాదు అని మనకి స్పష్టం చేస్తూ "నాలుగు గోడల లోపల మంచంమీద కనపడుతున్న రూపం పరిమితమూ, బయట అనంతమూ" అని తన విశ్వరూపాన్ని వివరించింది. "అమ్మ" చెప్పినప్పుడు అర్థమయినా, మరుక్షణం "అమ్మే" కప్పిన మాయకు లోబడి ప్రవర్తిస్తూ ఉంటాం. మళ్ళీ ఆమాయను తానే తొలగిస్తూ, "సర్వత్ర "అమ్మ" ఉందనుకుంటే తలుపు లెందుకోయ్" అంటూ మనకు తన సర్వవ్యాపకత్వాన్ని తెలియజేస్తుంది విశ్వరూప – "అమ్మ". "నా కబురు సరాసరి చేరుతుంది. మీ కబుర్లు పోస్టాఫీసులో ముద్రలు పడితేగాని, ఎక్కడికైనా

చేరవు" అంటూ తన సంకల్పబలాన్ని వివరించింది. "అమ్మ" అనుకుంటే, ఎంత దూరాన ఉన్నవారికైనా ఆ విషయం వారి మనస్సుకు తట్టి, వెంటనే వారి చేత ఆ పనిని చేయిస్తుంది. అదంతా క్షణాల్లో జరిగిపోతుంది. అందుకే "అమ్మ" – "నాకు నిన్నా, ఇవ్వాళా, రేపూ అంటే నవ్వు వస్తుంది" అంటుంది. "నీకు మూడు కాలాలూ వర్తమానమే కదమ్మా" అని అడిగితే, "అవును" అని రక్కున జవాబిచ్చింది. కాలాతీత, గుణాతీత, సర్వాతీత అయిన "అమ్మ"కు అవి వేరువేరుగా కనిపించవు కదా ! మరి.

"యమదూతలు "అమ్మ" దూతలు కాకపోతేగా" అని చెప్పిన అమ్మ "నీవేం చిత్రగుప్తుడివా ?" అని ప్రశ్నించిన ఒకరితో "నాకంటే చిత్రగుప్తుడు ఎవరు ? అంతా రికార్డు అయ్యే ఉంటుంది" అని నిశ్చయంగా చెప్పి, మన 'బయోడేటా' తన దగ్గర ఉంటుందని మనకు ఒక హెచ్చరిక చేసింది. విశ్వసాక్షిణి అయిన "అమ్మ"కు తెలియనివి ఏం ఉంటాయి ? "నీకు ఇక్కడికి వినిపించిందా ? నీవు అక్కడికిపోయి విన్నావా"? అని ప్రశ్నించిన వారితో "ఎట్లాగయినా ఒకటేనమ్మా" అని "అమ్మ" సమాధానం. "మేము మాట్లాడుకున్నది నీకెలా వినపడిందమ్మా ?" అంటే, "మీరు మాట్లాడుకున్నది మీకు వినపట్టంలేదూ ? అట్లాగే అంతా వినపడుతూ ఉంటుంది. అన్నీ కనపడుతూ ఉంటాయి." అంటుంది. "అమ్మ" విశ్వరూప; కామరూప; కామగమన. ఎక్కడికైనా, ఎప్పుడైనా, ఎలాగైనా వెళ్ళిపోగలదు. "మీరు తీసుకువెళితే కార్లు అవసరం కాని, నేను రావాలనుకున్నప్పుడు ఇవన్నీ అక్కరలేదు. వీటితో పనిలేదు" అని చెప్పటమే కాదు. కొందరికి ఆ అనుభవాన్ని కూడా కలిగించి, వారికి ఆనందాన్ని ప్రసాదించింది. ఆపన్నులకు సాక్షాత్కరించి, అభయహస్తాన్ని అందించి, అనుగ్రహించిన "అమ్మ" విశ్వసాక్షిణి.

జిల్లెళ్ళమూడిలో తన చిన్నగదిలో ఒక బుల్లిమంచం మీద దర్శనమిచ్చే ఈ బంగారు తల్లి – గుంటూరులో కొత్తపేటలో ద్వారకామాయి హస్పిటల్లో పిల్లవానిని కనగలదు (చూడగలదు). ఎక్కడో ఉన్న కిష్టయ్య తాతయ్య మరణం గురించి చెప్పగలదు. పథ్యం పాటించని అక్కయ్య అపథ్యంగా తిన్న పప్పు, చింతకాయపచ్చడిని గురించి ప్రశ్నించగలదు. హైదరాబాదు నుంచి వచ్చిన అబ్బాయి దొంగతనాన్ని, దురలవాట్లనూ ఎత్తిచూపగలదు. "చూట్టానికి పిచ్చి

అమ్మవలె ఉంటావు" అన్న ఒక బిడ్డతో "నేను పిచ్చమ్మనే నాన్నా ? మొదట నీ పేరు పిచ్చయ్య అని పెట్టలేదూ ? పిల్లలు బ్రతక్కపోతే?" అని అతని ఫ్లాష్ బాక్‌ని వెల్లడించగలదు. (పిచ్చయ్యకు తల్లి కనుక పిచ్చమ్మ అని అర్థం). పన్నాల రాధాకృష్ణశర్మగారి "అశ్రులహరి" పుస్తకావిష్కరణకు రావలసిన అన్నయ్య రాకపోతే "వాడక్కడ చేస్తూనే ఉన్నాడు అశ్రులహరి.... వస్తాడులే" అని వర్తమానాన్నీ, భవిష్యత్తునూ మేళవించి చెప్పగలదు. వర్షంలో తడిసిన అన్నయ్యను గురించి "నా కృపావృష్టిలో తడిసి ఉంటాడు" అని "అమ్మ" అనడం, ఆ సాయంత్రం వచ్చిన అన్నయ్య ఉత్తరంలో అదే వాక్యం ఉండడం ... వంటివి గమనిస్తే, ఎంత చిన్న విషయమైనా విశ్వసాక్షిణి అయిన "అమ్మ"దృష్టిపథం నుంచి తప్పుకోవడం అసాధ్యమని స్పష్టమవుతోంది.

విశ్వసాక్షిణి అయిన "అమ్మ" ఒక్కొక్కసారి చూడడంతో ఆగక, తాను చూసిన భయంకర సన్నివేశాలను తన చేతలతో (చేతులతో) అడ్డుకోవడం కూడా జరుగుతూ ఉంటుంది. నిరాశా నిస్పృహలకు లోనై, జీవితంపైన విరక్తి కలిగిన ఒక అన్నయ్య చచ్చిపోవాలనుకుని కరెంటు ప్రవహిస్తున్న వైరును పట్టుకుంటే, ఆ అన్నయ్యకు కరెంటు షాకు కొట్టే సమయానికి, జిల్లెళ్ళమూడిలో ఉన్న "అమ్మ" తన చేతిని గట్టిగా విదిలించడం, ఆ తరువాత కూడా ఆ అన్నయ్య తలపెట్టిన ఆత్మహత్యా ప్రయత్నాలు ఫలించకపోవడం జరిగింది. విశ్వసాక్షిణి అయిన "అమ్మ" విపత్కర పరిస్థితులనుంచి తన బిడ్డలను ఎలా రక్షించుకుంటుందో ఈ సన్నివేశం విశదపరుస్తోంది. "హైదరాబాదు మౌంటురోడ్డులో నడచిపోతున్న తన మీద "అమ్మ" ప్రభావం ఎలా ఉంటుంది" అని ప్రశ్నించిన ఒక సోదరునితో "ఏముంది నాన్నా! నా ముందు రోడ్డుమీద వెళుతున్నట్లు కనిపిస్తావు" అంది అమ్మ. విశ్వసాక్షిణి అయిన "అమ్మ"కు అంతా సమక్షంలో జరుగుతున్నట్లే ఉంటుంది. అందుకే "అందరూ నా ఒడిలోనే ఉన్నారు" అంటుంది. కళ్ళముందు కదలాడేవారు, ఎంతో దూరంగా ఉన్నామనుకునే వారూ అమ్మకు ఒకటిగానే కనిపిస్తారు. దూరం మనకే కాని "అమ్మ"కు లేదు. "పర్చూరులో సుబ్బారావు అనే వాడుంటాడు. వాడు బాగాపాడుతాడు" – అన్నది. ఆ సాయంత్రానికే ఆ సుబ్బారావుగారు వచ్చారు. "కాశీరావు అన్నయ్యకు 20 రోజులు సెలవుపెట్టి రమ్మని వ్రాయి" అన్నది. మధ్యాహ్నం

రెండుగంటలకు ఆ అన్నయ్య వచ్చారు. "సుబ్రహ్మణ్యం వచ్చాడురా చూడు," అంటే, కాసేపటికి ఆ అన్నయ్య "అమ్మ" దగ్గరకు రానే వచ్చారు. ఫోన్‌కాల్ వచ్చింది. "భృగుబండ నారాయణరావులే, ఇటివ్వు" అన్నది. అవును, ఆయనే. విశ్వసాక్షిణి అయిన "అమ్మ"కు తెలియనిది ఏముంటుంది?

"అమ్మ"కు పరోక్షం లేదు. అంతా ప్రత్యక్షమే. "అమ్మ"కు దూరం లేదు. అంతా దగ్గరే. ఈ విషయంలో ఎవరి అనుభవం వారికి ఉంది. అవి నేను రీసెర్చి చేసే రోజులు. విశాఖపట్టణం నుంచి ఒకసారి నాతో పాటు నా స్నేహితురాలు అన్నపూర్ణ కూడా మా అమ్మ నాన్నగార్లని చూడాలని చీరాలకు వచ్చింది. అంత దూరం నుంచి వచ్చింది కదా ! జిల్లెళ్ళమూడిలో "అమ్మ" దర్శనం చేయిస్తే బాగుంటుంది అన్పించింది నాకు. నామాటల్లో ఎప్పుడూ "అమ్మ"ను గురించి చెప్పడం వల్ల "అమ్మ" తనకు పరోక్షంగా పరిచయమే. అందువల్ల నేను తనతో "జిల్లెళ్ళమూడికి వెళ్దాం" అనగానే, వెంటనే ఒప్పుకుంది. ఏడవమైలు దగ్గర బస్సు దిగి, జిల్లెళ్ళమూడికి నడక ప్రారంభించాం. శ్రమ తెలియకుండా ఉండడానికి దారి పొడుగునా "అమ్మ" సంగతులే ముచ్చటించుకుంటూ "అమ్మ" సన్నిధికి చేరుకున్నాం. "అమ్మ" దర్శనం లభించింది. దారిలో మేము మాట్లాడుకున్న విషయాలను "అమ్మ" ప్రస్తావించడం మాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆరోజు ఆ దారిలో మాకు దగ్గరగా నడుస్తున్న వారెవ్వరూ లేరు. అందువల్ల ఇతరుల ద్వారా "అమ్మ"కు తెలిసే అవకాశం లేదు కదా ! ఈ విషయం మొదటిసారిగా "అమ్మ" దర్శనం చేసుకున్న అన్నపూర్ణకు ఎంతో విస్మయాన్నీ, ఆనందాన్నీ కలిగించింది. "మనం మాట్లాడుకున్న విషయాలు "అమ్మ"కు ఎలా తెలిశాయి ?" అని ఎన్నోసార్లు అనుకుంది. విశ్వసాక్షిణి అయిన "అమ్మ" అన్నింటికీ సాక్షిభూతురాలేగా మరి.

మావారికి జిల్లెళ్ళమూడిలోని మాతృశ్రీ ఓరియంటల్ కళాశాలలో ఉద్యోగం వచ్చిన తొలిరోజులు. మేమిద్దరం అన్నపూర్ణాలయంలో లోపలి గదిలో భోజనం చేసేవాళ్ళం. ఒకరోజు పచ్చడి కలుపుకొని, ఒక ముద్ద నోట్లో పెట్టుకున్నారో లేదో, ఆ కారం నోటికి పట్టక, చాలాసేపు అవస్థపడ్డారు. ఆ సాయంకాలం కాలేజీనుంచి

ఆయన రాగానే అలవాటుగా "అమ్మ" దగ్గరకు వెళ్ళి కూర్చున్నాం. కాసేపు ఆ కబుర్లు ఈ కబుర్లు అయ్యాక "అమ్మ" - "ఏం నాన్నా! పచ్చడి బాగా కారంగా ఉందా ? చాలాసేపు బాధపడ్డావు" అని ఎంతో ఆప్యాయంగా అడిగింది. ఆ సమయంలో "అమ్మ" కన్నుల్లో కనిపించిన ఆ ప్రేమను వర్ణించడానికి భాషలేదు. ఆ రోజునుంచీ మమ్మల్ని హైమాలయంలో భోజనం చేయమని, అక్కడ ఇంత కారంగా ఉండదనీ, చెప్పి, ఆ ఏర్పాటు చేసింది "అమ్మ".

విశ్వజనని అయిన "అమ్మకు" ఈ సృష్టి అంతా సంతానమే. విశ్వసాక్షిణి అయిన "అమ్మ" దృష్టికి సమస్తమూ సమక్షమే. రాత్రి 9 గంటల సమయంలో మధ్యహాల్లో మంచంమీద పడుకుని "ఏదో ఠపేలుమని పేలిన చప్పుడయ్యిందిరా" అంది "అమ్మ". అక్కడ ఉన్నవారికెవ్వరికీ ఆ చప్పుడు వినిపించలేదు. కాసేపటికి "అమ్మ" లేచి వెనుకగదిలోకి వెళుతుంటే, "అమ్మ" కాలివేళ్ళకున్న ఆభరణాలు అయిదూ రాలిపడిపోయాయి. "అయ్యో! అయిదూ రాలిపోయాయమ్మా" అంటే, "రాలి పోయేవాటిని పోనీరా" అంది నిర్లిప్తంగా. ఆ మరునాటి ఉదయం పేపర్లో రెండు భయంకరమైనవార్తలు. ఒకటి - "అమెరికా అధ్యక్షుడు కెన్నడీని ఎవరో తుపాకీతో పేల్చి చంపారు." రెండు-"అయిదుగురు వాయు సైన్యాధిపతులు ప్రయాణిస్తున్న విమానం కూలి వారు మరణించారు". అమెరికాలో పేలిన తుపాకీ చప్పుడు తన ప్రక్కగదిలో జరిగినట్లుగా "అమ్మ"కు వినిపించింది. ఔనుమరి ! విశ్వసాక్షిణి అయిన "అమ్మ"కు దేశం ఏదైనా, ప్రదేశం తన అంతరంగమే కదా!

"అమ్మ"కు అంతా ప్రత్యక్షమే అనే విషయాన్ని "అమ్మే" ఎన్నో రకాలుగా ప్రకటించింది. "అదేమిటో, నాకు ఎవరూ చూడనట్లు ఉండరు. అందరూ చూసినట్లే ఉంటారు." "మీకు ఎప్పుడో చూసినట్లు అనుమానం. నాకు ఆ అనుమానం లేదు, ఎప్పుడూ చూస్తున్నట్లే ఉంటుంది." "మీరు ఇక్కడికి వచ్చి, నన్ను చూస్తారు. నేను మిమ్మల్ని ఎప్పుడూ చూస్తూనే ఉంటాను". "అందరూ ఎప్పుడూ చూడరు నన్ను. నేను ఎప్పుడూ అందర్నీ చూస్తాను". "నేను మిమ్మల్ని ఎప్పుడూ చూస్తాను". "ఎదురుగా ఉన్నవాడిని అన్నం తిన్నావా ? అని అడగవచ్చు. చాటుగా ఉన్నవాడికి భార్య చేత పెట్టించవచ్చు. కాని క్రియలో ఇది కనిపిస్తుంది. అది కనిపించటం

లేదు," "నేను చేసే ప్రతి పనీ చూస్తూనే ఉంటావా? అమ్మా !" అంటే "నువ్వెక్కడివేనా?" అని చమత్కారంగా సత్యాన్ని దర్శింపజేసింది. ఎన్ని దర్శనాలను అనుగ్రహించినా, నిదర్శనాలతో నిరూపించినా, మళ్ళీ తానే,మనకు మాయపొరలు కప్పుతూ, మనతో దోబుచులాడుతూ ఉంటుంది "అమ్మ". నవ్వురాజిల్లే మోముతో, తన కృపారసాన్ని మనపై వెదజల్లుతూ మనలనందరినీ ఎల్లప్పుడూ రక్షించాలని 'విశ్వసాక్షిణి' అయిన అమ్మనే వేడుకుందాం.

('అమ్మ - అమ్మవాక్యాలు' సంకలనకర్త శ్రీపాదవారికి కృతజ్ఞతలతో)



తనువే యావుగ, నీవె యా తనువుగా తాదాత్మ్యముం జెంది యే
యనుమానంబును లేక భోగపరతన్ యావత్ప్రపంచంబు నీ
కనుపేరాసను జిక్కి స్రుక్కెదవు నీ వాదారి బోనేల ? ఓ
మనసా ! అమ్మ పదాబ్జముల్ హృదయసీమన్ నిల్పి పూజింపుమా !

వినువీధిన్ దురితంబు లొక్కెడ బడన్ వీనిన్ మహాశ్రద్ధతో
వినగా గోరెద వీవు, నీ ప్రకృతికిన్ వేఱైన యివ్వానికిన్
జనగా నేల ? సుఖోదయం బొసగు స్వస్థ ప్రక్రియన్ గోరి ఓ
మనసా ! అమ్మ పదాబ్జముల్ హృదయ సీమన్ నిల్పి పూజింపుమా !

నిను బంధింపగ నెంతవారలకు యత్నింపంగ వీ లౌనె ? ని
న్నను శాసింపగ నెంత వారలకు సాధ్యంబెట్లుగా; దందుచే
నిను యాచింతు ననుగ్రహించి సుముఖ స్నేహంబు నేర్పంగ నో
మనసా ! అమ్మ పదాబ్జముల్ హృదయ సీమన్ నిల్పి పూజింపుమా.

- డా॥నారపరాజు శ్రీధరరావు

# 26. నిస్సీమ మహిమా

**ఆశ్రితాళిని ప్రేమతో నాదరింప**
**తన కసాధ్యము లేకుండ తనరి యుండి**
**మహిని వెలసిన నిస్సీమమహిమ యైన**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"సీమ అంటే అవధి. అవధుల్లేని మహిమలు కలది లలితాదేవి. అంటే శ్రీమాత మహిమలు అనంతం" – భారతీవ్యాఖ్య.

మహాపురుషుల విషయంలో సామాన్యమానవులం అయిన మనం సర్వసాధారణంగా ముందు చూసేది వారి మహిమలు. మహిమలు ప్రదర్శించిన వారిని మహనీయులుగా, అవతారమూర్తులుగా, సిద్ధపురుషులుగా, భావిస్తూ ఉంటాం. ఎంత గొప్పవ్యక్తి అయినా ఏమహిమా ప్రదర్శించకపోతే, మనం వారిలోని ఔన్నత్యాన్ని గుర్తించలేం. ఎవరైనా చెప్పినా, తేలిగ్గా కొట్టి పారేస్తాం. సాక్షాత్తూ భగవంతుని విషయంలో కూడా మనం మహిమలకే ప్రాధాన్యం ఇస్తాం. ఏ దేవుడు మనం కోరిన కోరిక నెరవేరుస్తున్నాడో, ఆ దేవుడికి మ్రొక్కులు తీరుస్తూ, ఆ దేవుడి మహిమలను వేనోళ్ళ ప్రశంసిస్తాం. ఏ దేవుడైనా మనకోరిక తీర్చకపోతే, వెంటనే ఆ దేవుణ్ణి వదలివేసి, మరొక దైవానికి కోరిక విన్నవించుకుంటాం. అతనికి మ్రొక్కుకుంటాం. అందుకే "మ్రొక్కిన వరమీని వేల్పు"ను "గ్రక్కున విడువంగ వలయు" అని సుమతీశతకకర్త చక్కని సలహాఇచ్చాడు. భక్తులమని చెప్పుకునే చాలమంది ఈ కోవకు చెందిన వారే. భక్తులకు తన అనంతమైన మహిమలను చూపించే తల్లి నిస్సీమ మహిమ.

"అమ్మ" నిస్సీమ మహిమ. అయితే "అమ్మ" చూపించిన మహిమలు పదిమందికి చెప్పి, ప్రచారం చేయడంకంటే కూడా ఎవరికివారే అనుభవించి, ఆనందించేవిగా ఉంటాయి. ఇతరులతో చెప్పినప్పుడు, వారు, ఇందులో ఏముందీ? ఎలాగైనా ఇది ఇలాగే జరిగి ఉండేది – అని తేలిగ్గా తీసుకునే విధంగా ఉంటాయి. "అమ్మ" మహిమలు అనుభవైకవేద్యాలు. అయితే, "అమ్మ" మహిమలను అంగీకరించదు. "మహాతత్త్వానికి మాహాత్మ్యాలతో పనిలేదు" అని మహిమలపట్ల

తన విముఖతను స్పష్టం చేసింది. "మీ పనులు కావటమూ అను(గ్రహమే. కాకపోవటమూ అను(గ్రహమే", "అయినపనీ, కాని పనీ అంతా ఆశీర్వచనమే," "మీకు దారి(ద్ర్యం వచ్చిందని బాధపడవద్దు. ఆ దారి(ద్ర్యం కూడా నేనే" ఇలాంటి వాక్యాల్లో "అమ్మ" మహిమలకు ఎంత తక్కువ (ప్రాధాన్యం ఇచ్చిందో అర్థం అవుతుంది. "మంచిని మించిన మహిమలు లేవు" అని (ప్రకటించిన "అమ్మ" "ఇతరులలో మంచిని చూడటమే మన మంచితనం" అని నిర్వచించింది. అయితే, "అమ్మ" తన మహిమాన్వితమైన అద్భుతశక్తులను (ప్రదర్శించి, ఎందరినో సమ్మోహితులను చేసిన సంఘటనలు ఎన్నెన్నో. అయితే, "అమ్మ" మహిమలు చేస్తుందా ? అంటే, అవునని చెప్పలేం. శ్రీ విఠాల రామచం(ద్రమూర్తిగారు చెప్పినట్లు 'అమ్మసన్నిధిలో మహిమలు జరుగుతాయి. అమ్మ మహిమలు చెయ్యదు'.

ఆ(బహ్మకీటజనని అయిన అమ్మకు (క్రిమికీటకాలూ, పశుపక్ష్యాదులూ కూడా బిడ్డలేకదా! అందువల్లనే వాటిని లాలించి, పాలించిన సంఘటనలతో పాటు వాటికి తన పాదాల చెంత మరణాన్ని (ప్రసాదించి, మోక్షాన్ని అను(గ్రహించిన సన్నివేశాలు కూడా ''అమ్మ'' జీవితంలో మనకు తారసపడతాయి. "అమ్మ"ఉయ్యాలలో పాపాయిగా ఉన్నరోజుల్లోనే తన పాదాలచెంత మరణించేలా ఒక తేలును, ఒక పిల్లిని అను(గ్రహించి, తద్వారా వాటికి మోక్షాన్ని (ప్రసాదించింది. అమ్మమ్మ ఆరోగ్యం బాగా దెబ్బతినడంతో అమ్మమ్మకు బాపట్లలో వైద్యం చేయించాలని అక్కడికి పంపుతారు. దారిలో ములుకుదురు (గ్రామంలోని చెన్నకేశవస్వామి దేవాలయ శిఖరం మీద "అమ్మ" కనిపించి, నవ్వుతూ చేతులు చాపి పిలుస్తున్నట్లు అమ్మమ్మకు కనిపించింది. తల్లి తన పిల్లకోసం చేతులు చాపినట్లుగా తోచి, అమ్మమ్మ నిశ్చేష్టయై, తన ఒడిలోకి చూసుకుంటే అక్కడ "అమ్మ" పసిపాపగా మామూలుగా కనిపించింది. 'నిస్సీమ మహిమ' అయిన "అమ్మ" తన దివ్యరూపదర్శన భాగ్యాన్ని అమ్మమ్మకు (ప్రసాదించి, తనలోకి రాబోతున్న విషయాన్ని ముందుగానే సూచన చేసింది.

శ్రీ వీరమాచనేని (ప్రసాదరావుగారి కొడుకు, కోడలు ఒక జీపులో (ప్రయాణం చేస్తుంటే, ఒకలారీ ఢీకొని (ప్రమాదం జరిగింది. ఆయన కుమారుడు కొద్దిగాయాలతో బయటపడ్డారు. కాని కోడలుకు మాత్రం (ప్రాణాపాయపరిస్థితి ఏర్పడింది. ముఖంలో నుదురు భాగంలోని ఎముకలు విరిగి, మెదడుకు (గుచ్చుకుని, మెదడు దెబ్బతింది. స్పృహకోల్పోయింది. హాస్పిటల్లో చేరిస్తే, ఆపరేషన్ చేయాలని, అయినా

పరిస్థితి ఎలా ఉంటుందో చెప్పలేమని,మానవ ప్రయత్నం చేస్తామని, ఆపైన దైవానుగ్రహం ఎలా ఉంటే అలా జరుగుతుందని డాక్టర్లు చెప్పారు. అదే సమయంలో జమ్మి వెంకటరత్నంగారు "అమ్మ" వద్దనుంచి ప్రసాదమూ, తీర్థమూ తీసుకుని వెళ్ళి ప్రసాదరావుగారికి ఇచ్చారు. ఆయన ఆ తీర్థం ఆమె గొంతులో పోశారు. స్పృహలేకపోయినా ఆమె ఆ తీర్థం త్రాగింది. ఆపరేషను చేయడానికి ఆమెను థియేటర్‌లోకి తీసుకు వెళ్తున్నారు. ప్రసాదుగారికి ఒక దృశ్యం గోచరించింది. "అమ్మ" డాక్టరు డ్రస్సులో థియేటర్‌లోకి వెళ్ళింది. "అమ్మ" నడకలోని ఠీవికి వారు ఆశ్చర్యచకితులైనారు. "అమ్మ" వెనుకే వారి కోడలిని స్ట్రెచర్‌మీద థియేటర్‌లోకి తీసుకువెళ్ళారు. ఆయన ఆనందానికి అవధుల్లేవు. కాసేపటికి వారు మామూలు స్థితిలోకి వచ్చి, విచారిస్తే, అప్పుడే వారి కోడలిని లోపలికి తీసుకుని వెళ్ళినట్లు చెప్పారు. వారు ఆసమయంలో నిద్రించలేదు. నిద్రపోతే కదా కలవచ్చేది. కాబట్టి కలకనలేదు. ధ్యానావస్థలోనూ లేరు. మరి వారికి "అమ్మ" ఎలా కనిపించింది. అనేది వారికి ఎంతో ఆశ్చర్యాన్నీ, ఆశాభావాన్నీ కలిగించింది. ఆపరేషన్ విజయవంతమయింది. వైద్యులకు కూడా ఈ విజయం విస్మయాన్నే కలిగించింది. ఒకవేళ ఆపరేషన్ సఫలమై, రోగి బ్రతికినా మెదడు సరిగ్గా పనిచేయటం, జ్ఞాపకశక్తిరావటం, మాట్లాడటం చాలకష్టమయిన విషయమని వారు ఆశ్చర్యపోయారుట. అన్నీ సక్రమంగా జరగడం "అమ్మ" దివ్యాశీస్సుల ఫలమని, అంతా "అమ్మ" మహిమే అని ప్రసాదరావుగారి ప్రగాఢ విశ్వాసం. 'నిస్సీమ మహిమ' అయిన "అమ్మ"కు సాధ్యంకానిది ఏం ఉంటుంది?

అమ్మ" జీవిత చరిత్రలో ఇలాంటి సంఘటనలు ఎన్నో. 'నిస్సీమ మహిమ' అయిన "అమ్మ"ఆశీస్సులు మనందరిపై వర్షించాలని సదా "అమ్మ"ను ప్రార్థించుకుందాం.

**("కృతజ్ఞతలు : శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్యకు, అయ్యగారి కుసుమక్కయ్యకు...)"**



**నతియో, వాఙ్నతియో, సమర్చనమొ, సంధ్యావందన స్ఫూర్తియో**
**కృతియో, కింకర వృత్తియో, భజనమో, కించిత్సహాయంబొ, మ**
**త్కృతమై నీకు సమర్పితంబుగను లేదే ! యెంత యోచించినన్**
**గత మీరీతిగ నుండ, భావిగతి వక్కాణింప నా శక్యమే ?**

**-డా॥నారపరాజు శ్రీధరరావు**

# 27. అద్భుత చారిత్రా

**ఇదియు నిదమిత్థమని నిర్ణయింపరాని**
**సన్నివేశాలు బ్రతుకున సంతరించు**
**నామె అద్భుత చారిత్ర, ఆదిశక్తి :**
**అమ్మ అడుగుదమ్ములకు నే నంజలింతు.**

"శ్రీమాత చరిత్ర అద్భుతావహం. దుష్టశిక్షణ, శిష్టరక్షణ సమయాల్లో ఆమె చూపిన మహిమలు అనంతం. అద్భుతం. శ్రీమాత అద్భుత చారిత్ర"– భారతీవ్యాఖ్య

అద్భుతం అంటే వింత; ఆశ్చర్యం. అంటే ఎప్పుడూ, ఎక్కడా, ఎవ్వరూ చేయనిది ఏ ఒక్కరో చేస్తే అది మనకు అద్భుతంగా కనిపిస్తుంది (అనిపిస్తుంది). అద్భుతం శాశ్వతంగా ఉండదు. మెరుపుమెరిసి మాయమైనట్లు, అద్భుతం కూడా క్షణికమే. ఇది జరిగిందా, లేదా ? కలా ? నిజమా ? అని మనలో మనం మళ్ళీ మళ్లీ వితర్కించుకుంటూ, తన్మయావస్థనుంచి తెప్పరిల్లేలోగానే ఏమీ జరగనట్లు, అంతా మామూలుగానే ఉన్నట్లు అనిపించడం అద్భుతం లక్షణం. సాధారణంగా ఎవరి జీవితంలో నైనా అద్భుతాలు అరుదుగా జరుగుతూ ఉంటాయి. నూటికి కోటికి ఏ ఒక్కరికో అద్భుతమైన అనుభవం ద్వారా వారి జీవనయానమే మారిపోతుంది. అలాంటి అద్భుతాలను సృష్టిస్తూ, దుష్టశిక్షణ, శిష్టరక్షణలను నిర్వహించిన దేవి అద్భుతచారిత్ర. శ్రీ లలిత చరిత్రే అద్భుతం. కనుక శ్రీమాత 'అద్భుతచారిత్ర'.

"అమ్మ" అద్భుత చారిత్ర. పుట్టుక మొదలు అవతార పరిసమాప్తి వరకు "అమ్మ" జీవిత మహోదధిలోని ప్రతితరంగం అద్భుతావహమైనదే. కొన్ని అద్భుతాలు తన బిడ్డలను రక్షించుకోవడానికి, మరికొన్ని అద్భుతాలు తన భక్తులను ఆనందసాగరంలో తేలియాడించడానికి, ఇంకొన్ని అద్భుతాలు తప్పుదారిపట్టిన తన బిడ్డలను శిక్షకాని శిక్షణతో సన్మార్గంలోకి మరల్చడానికి ప్రదర్శించి, 'అద్భుతచారిత్ర'గా సాక్షాత్కరించింది "అమ్మ".

"అమ్మ" జీవితమే ఒక గొప్ప అద్భుతం. సర్వశక్తి స్వరూపిణి"అమ్మ"గా అవనిలో అవతరించడమే మహాద్భుతం. అఖిలాండకోటి బ్రహ్మాండజనని "అమ్మ"గా

అపార ప్రేమామృతాన్ని సమస్త ప్రాణికోటికీ పంచి, పెంచి, పోషించడానికే అర్కపురిలోని అందరింటిని అలరించింది. "అమ్మ" పుట్టినది ఆదిగా ఎన్నో దర్శనాలు "అమ్మ" అవతారతత్వాన్ని నిరూపించే నిదర్శనాలుగా నిలువుటద్దం పట్టాయి. "అమ్మ" పుట్టుకకు పూర్వమే రంగమ్మగారికి (అమ్మకు తల్లి) ఎన్నో దివ్యానుభూతులను అనుగ్రహించింది. "అమ్మ" భూమ్మీద పడగానే మంత్రసాని గొల్ల నాగమ్మకు కలిగిన అనుభవం అత్యద్భుతమైనది. ఆనాడే "అమ్మ" సర్వాలంకారశోభితయైన దేవతామూర్తివలె గొల్లనాగమ్మకు దర్శనమిచ్చి, ఆమెను అప్రతిభురాలిని చేసింది. చిన్నికృష్ణుణ్ణి బంధించడానికి యశోదమ్మకు ఎంతపొడవు తాడూ సరిపోలేదని మనం వింటూ ఉంటాం. "అమ్మ" బొడ్డుకోసి దారం చుట్టాలని, చాకు, దారం తీసుకుని బొడ్డుచుట్టూ ఎన్ని చుట్లు చుట్టినా దారం ఇంకా మిగిలిపోతూ, గొల్లనాగమ్మకు విసుగును, ఆశ్చర్యాన్ని కలిగించింది. దారం కోసేద్దామని చాకును వాడబోతే, అది త్రిశూలంగా మారి, చేతికి అమరకపోవడం వింతలో వింత. అంతలోనే అంతా మామూలుగా అయిపోయి, జరగవలసిన కార్యక్రమం యథావిధిగా జరిగిపోయింది. పుట్టీపుట్టగానే అద్భుతాన్ని గొల్లనాగమ్మకు అనుగ్రహించిన "అమ్మ" అద్భుతచారిత్ర. పుట్టినప్పటినుంచి ఇంటిలోని వారికి, ఇంటికి వచ్చినవారికి ఎన్నెన్నో అద్భుతాలను ప్రదర్శించి, వారిని ఆశ్చర్యచకితులను చేసిన "అమ్మ" అద్భుతచారిత్ర. అంతలోనే మామూలు చిట్టితల్లిగా అయిపోయి, వారికి తమ అనుభవం కలా, నిజమా? అనే భ్రాంతిని కలిగించి, మాయ కప్పేసిన అమాయకపు బాలిక అద్భుతచారిత్ర. పందొమ్మిది నెలలప్రాయంలోనే శాంభవీ ముద్రలో ఉండటమేగాక, అదేమిటి? అలా కూర్చున్నావు – అంటే, అది 'శాంభవీముద్ర' అని వివరించడం అనూహ్యమూ, అతిమానుషమూ,అత్యద్భుతమూ.

మన్నవలోని రాజ్యలక్ష్మి అమ్మవారి ఆలయంలో మౌనస్వామి వేసిన యంత్రం 'రాజ్యలక్ష్మి యంత్రం' అన్న మరిడమ్మ తాతమ్మగారితో, జ్వరంతో బాధపడుతూ అమ్మమ్మప్రక్కలో పడుకుని ఉన్న "అమ్మ" – "అది రాజ్యలక్ష్మీ యంత్రం కాదు. రాజరాజేశ్వరీ యంత్రం"అని నిర్ద్వంద్వంగా, నిశ్చయంగా చెప్పింది. అది విని, అమ్మమ్మ (రంగమ్మగారు) "సరేలే అన్నీ నీకే" అంటే, వెంటనే "అమ్మ", "ఔను, అన్నీ నావే కనుక" అని నిర్ధారణగా చెప్పింది. సరిగ్గా మాటలు పలకడం కూడా

రాని మూడు సంవత్సరాల పసిప్రాయంలోనే తాను ఏమిటో ? స్పష్టంగా చెప్పిన "అమ్మ" అద్భుత చారిత్ర. తరువాత కొంతకాలానికి "అమ్మ" మౌనస్వామివారి దర్శనానికి వెళ్ళింది. మౌనస్వామి వారిని ఆంతరంగికంగా కలుసుకుని, ఆయన మౌనాన్ని భంగపరుస్తూ ఆయనచేతనే - ఆయన ప్రతిష్ఠించినది రాజరాజేశ్వరీ యంత్రమే అని చెప్పించింది. మౌనస్వామి మౌనాన్ని భంగం చేయటమే కాక, మౌనంలోని పరమార్థాన్ని వారికి ప్రబోధించిన "అమ్మ"అద్భుత చారిత్ర.

మన్నవలోని పున్నయ్యగారి తోటలో చింతచెట్టు మీద కూర్చుని ఉన్న "అమ్మ" చింత చిగురుకోసం వచ్చిన తురుమెళ్ళ వెంకటప్పయ్యగారికి తమ ఇష్టదైవమైన సత్యనారాయణస్వామిగా దర్శనమిచ్చింది. ఆయన "అనసూయ మామూలు పిల్లకాదు. నా ఇష్టదైవమైన సత్యనారాయణస్వామియే ఈ అనసూయ" అని స్పష్టంగా చెప్పారు. "తల్లిలేని పిల్ల" అని జాలిపడిన బ్రహ్మాండం సుబ్బారావుగారితో (అమ్మ మామగారు) చిదంబరరావుగారు "ఈ తల్లి ఎందరి తల్లులకో తల్లి. ఇంకా ఈమెకు తల్లి ఎందుకు?" అని ఆనాడే ప్రకటించారు. చిన్నపాపగా ఉన్న "అమ్మ" ఆనాడే ఎందరికో ఎన్నో దర్శనాలు అనుగ్రహించింది. కొందరికి బాలా త్రిపురసుందరిలా, కొందరికి కనకదుర్గలా, కొందరికి సీతమ్మవారిలా, కొందరికి బాలకృష్ణుడిగా, కొందరికి నాగేంద్రునిలా, కొందరికి రఘురామునిలా, కొందరికి కాశీ అన్నపూర్ణలా, కొందరికి రాజరాజేశ్వరిగా - ఇలా ఎన్నోరూపాలతో, ఎవరి ఇష్టదైవం రూపంలో వారికి దర్శనం ఇచ్చి వారికి అంతులేని ఆనందాన్ని, మధురాతి మధురమయిన అనుభవాన్ని అనుగ్రహించింది. అందుకే అద్భుత చారిత్ర అయిన "అమ్మ" భగవంతుణ్ణి గురించి - "అన్నిరూపాలూ ఆయనవే కనుక రూపరహితుడు; అన్ని గుణాలూ ఆయనవే కనుక గుణరహితుడు. అన్ని నామాలూ ఆయనవే కనుక నామరహితుడు; అన్ని సంకల్పాలూ ఆయనవే కనుక సంకల్ప రహితుడు" అని విశదీకరించింది.

తన అత్యద్భుత దర్శనాలతో దుర్మార్గపు ఆలోచనలు గల ఎందరిలోనో మార్పుతెచ్చిన మహిమాన్విత అయిన "అమ్మ" అద్భుత చారిత్ర.

"అమ్మ" మామగారు బ్రహ్మాండసుబ్బారావుగారు చనిపోయేనాటికి "అమ్మ"కు తొమ్మిది సంవత్సరాలు. "అమ్మ" ఆ సందర్భంలో వారింటికి వెళ్ళింది. మేడపైన

పడుకున్న "అమ్మ" దగ్గరకు పెమ్మరాజు సత్యనారాయణమూర్తిగారు వచ్చి, "అమ్మ" పక్కలో కూర్చున్నారు. చిదంబరరావుగారు లేచి "అమ్మాయి దగ్గర ఎందుకు కూర్చున్నారని" అడిగితే, "అమ్మాయి కాళ్ళతీపులతో బాధపడ్తుంటే మెస్మరిజం చేద్దామని" అని సమాధానం చెప్పారు. వీరి సంభాషణ వింటూ పడుకుంది "అమ్మ". మూర్తిగారు కాళ్ళు రాయడం మొదలు పెట్టగానే "అమ్మ" చివాలున లేచి, "మీరు పెద్దవారు నా కాళ్ళు పట్టుకుంటారేమిటి?" అని చురుగ్గా ప్రశ్నించింది. అంతేకాదు. 'ఆయన పట్టుకుంటేనే బాధలు తీరిపోయేటట్లయితే తన మామగారు బ్రహ్మాండం సుబ్బారావుగారికి ఎందుకు తగ్గించలేద'ని నిలదీసింది. "ఏమిటి గొడవ ?" అని అడిగిన చిదంబరరావుగారితో "ఈయన అడక్కుండానే అందరి బాధలూ అర్థంచేసుకుంటారట. ఈ ఇంటిలో ఎవరెవరు ఏఏ బాధలతో ఉన్నారో చెప్పమనండి కనీసం, నివారణ ఎలా ఉన్నప్పటికీ?" అని చాలా కటువుగా మాట్లాడింది. 'పెద్దవారితో ఎందుకు?' అన్న చిదంబరరావుగారితో "పెద్దవారు పెద్దవారుగా ప్రవర్తించకపోవటంతో వస్తుంది గొడవ. వీరు ఉపాసకులు" అని వ్యంగ్యం గొంతులో ధ్వనింపజేసింది. మూర్తిగారితో మాత్రం కరుకుగా "ఉపాసన ఇదేనా? పలుకరేమి ? అందరికీ మీరు చేసే మెస్మరిజం ఇలాగే ఉంటుందా ? మీరిక ఈ ఉపాసన మానుకున్నా సరే, లేదా ఈ విషయం వివరించి చెప్పినా సరే!" అని నిలదీసింది. అంతేకాదు, వెంటనే ఆయనను మేడ దించేయమని చిదంబరరావుగారితో చెప్పింది. మూర్తిగారిని అప్పుడే బాగుచేయాలనుకుందేమో మరి. అయితే, ఆయనను మాటలతో బాగుచేయడం కష్టమని అనుకుంది కాబోలు. అనుభవాన్ని అనుగ్రహించి సంస్కరించాలనుకుంది "అమ్మ". "ఉపాసన అంటే ఏమిటి?" అని ప్రశ్నించింది. ఆ ప్రశ్న ఆయన అంతరంగాన్ని మథించివేసింది. ఉపాసన పేరుతో తాను చేసిన చెడ్డపనులన్నీ ఒక్కొక్కటే ఆయన కళ్ళముందు కదలాడసాగాయి. ఒక్కొక్క దృశ్యానికి ఆయన వణికిపోయారు. ఒక్కసారిగా చిన్నపిల్లవాడిలా వెక్కి వెక్కి ఏడుస్తూ, "అమ్మ" పాదాలు పట్టుకున్నారు. ఆయనకు బాలాత్రిపురసుందరిగా సాక్షాత్కరించింది "అమ్మ". "బాల్య యౌవన కౌమారస్థితులు కలది, సృష్టిస్థితిలయకారిణి, భూతభవిష్యద్వర్తమానాలు ఆమె రూపం – అంటే ప్రతిదానిలో గర్భితమైన శక్తియే బాలాత్రిపురసుందరి" అని "అమ్మ" బాలాత్రిపురసుందరీ తత్త్వాన్ని వివరించింది. "అమ్మ" పాదాల నుండి లేచిన

మూర్తిగారికి క్రొత్త ప్రపంచాన్ని చూస్తున్నట్లు, పునర్జన్మ ఎత్తినట్లు అన్పించింది. "నమస్తే మాతా" అని "అమ్మ"కు నమస్కరించారు. "శిక్ష అంటే క్రమశిక్షణలో పెట్టటమేనా?" అని అడిగిన అమ్మతో చిదంబరరావుగారు "నీకు తోచిన దానికి తిరుగేముంటుందమ్మా ! అదే అందరికీ రక్ష" అని చెప్పి, ఆనాడే మనకందరికీ "అమ్మే" రక్ష అని ప్రకటించారు.

సత్యనారాయణమూర్తిగారితో "మీ తప్పును మీకు తెలియపరిచాను. మీరు శిక్ష అనుకోవద్దు. శిక్షణ ఇచ్చి మీ పేరు సార్థకం చేద్దామని" చెప్పి వారికి "అమ్మ" బోధచేసింది. ఊరికి బయలుదేరిన ఆయనతో పాటు స్టేషను దాకా వెళ్లి రైలుకూడా ఎక్కించింది. మూర్తిగారు రైలు వాకిట్లో నిలబడి రుద్ధకంఠంతో నీళ్ళు నిండిన కళ్ళతో, చేతులు జోడించి "అమ్మా ! దయానిధీ ! వెళ్ళి వస్తానమ్మా!" అని సెలవు తీసుకున్నారు. తన అద్భుత దర్శనం ద్వారా సత్యనారాయణమూర్తిగారికి పశ్చాత్తాపం కలిగించి, వారు సన్మార్గవర్తనులు కావడానికి మార్గదర్శకత్వం వహించింది అద్భుత చారిత్ర అయిన అనసూయమ్మ.

"అమ్మ" తన బాల్యం నుంచి ఈనాటివరకూ ప్రదర్శిస్తున్న అద్భుత దర్శనాలు "అమ్మ"ను అద్భుత చారిత్రగా మనకు సాక్షాత్కరింపజేస్తున్నాయి. అయితే, "అమ్మ" మాత్రం "నేను 'అమ్మ'ను, మీరు బిడ్డలు," "మీరు కానిది నేనేదీ కాదు" అంటూ ఎప్పటికప్పుడు మనల్ని మాయలో పడవేస్తూ, మానవిగా మనందరి మధ్య నడయాడిన బంగారుతల్లి. "అమ్మ" జీవితకాలంలో జన్మించి, "అమ్మ"ను దర్శించి భజించి, సేవించి, తరించిన ధన్యజీవులం మనం. తన అద్భుతచరిత్రను మనకు అందించి, అద్భుత దర్శనాలను అనుగ్రహించిన అమ్మ 'అద్భుత చారిత్ర' అర్కపురీశ్వరి అయిన అనసూయామాతకు అంజలి ఘటిస్తూ.....

('శ్రీమతి కుసుమాచక్రవర్తిగారికి కృతజ్ఞతలతో')

**"డివైన్ పవర్ కాదు; పవరే డివైన్" - అమ్మ**

## ఈ గ్రంథం ....

"అమ్మ భక్తులకు ఇది అమృతప్రాయంగా ఉంటుందనడంలో సందేహం లేదు"

కుర్తాళంశంకరాచార్య, జగద్గురు
**శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానందభారతీస్వామి**

"లలితాదేవికి, అమ్మకు శ్రీవల్లి చేసిన సమన్వయం సమగ్ర సుందరంగా ఉన్నది" **-శ్రీపి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్**

"మరెన్నో పరమౌషధాలను సోదరులకు శ్రీవల్లి ద్వారా అందించాలని అమ్మను వేడుకుంటున్నాను"

**శ్రీమతి బ్రహ్మాండం వసుంధర**

"సరళ వివరణతో కూడిన శ్రీవల్లి వ్యాసాలు 'అమ్మ' సుందర దరహాస కాంతులుగా శోభిల్లుతున్నాయి"

**ఆచార్య కోలవెన్ను మలయవాసిని**

"ఈ గ్రంథం చతుర్ముఖమై, మనలను అంతర్ముఖులను చేసి ఆ లలితా పరమేశ్వరి అనుగ్రహం కలిగిస్తుందని విశ్వసిస్తున్నాను" **- డా॥ బి.యల్. సుగుణ**

"ఆర్తి, జీవుని వేదన, ఆత్మ నివేదన ఈ రచనలో అంతర్లీనంగా గోచరిస్తున్నాయి" **- డా॥ ఉప్పల వరలక్ష్మి**

"ఈ వ్యాసాల్లో అమ్మను గురించిన సంఘటనలను మా అమ్మ వివరిస్తూ ఉంటే, ఒళ్ళు గగుర్పొడిచేది.."

**- ఎం. నందకిశోర్**